# పార్టీ నిర్మాణం

★

లి - షావ్ - చీ

అనువాదం :

కంబంపాటి సత్యనారాయణ, ఎం. ఏ.

★

శాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# పార్టీ నిర్మాణం

[1945 మే నెలలో జరిగిన సప్తమ చైనా కమ్యూనిస్టు పార్టీ మహాసభలో, పార్టీ నిబంధనావళి మార్పును గురించి లీ - షావ్ - చీ యిచ్చిన రిపోర్టు]

★



లీ - షావ్ - చీ

(చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి)

# తొలిపలుకు

అనేక శతాబ్దాల భూస్వామ్యదోపిడీని, సామ్రాజ్యపీడనను ఎదుర్కొని పోరాడ్డంలో చైనా ప్రజానీకానికి సారథ్యం వహించిన చైనా కమ్యూనిస్టుపార్టీనుంచి మనం నేర్చుకోవలసిన విషయా లెన్నో ఉన్నాయి.

1945 లో జరిగిన సప్తమ చైనా కమ్యూనిస్టుపార్టీ మహాసభలో, నూతన నిబంధనావళిని వివరిస్తూ లీ-షావ్-చీ సమర్పించిన నివేదిక కేవల మొక నివేదికమాత్రమే కాదు; చైనా పార్టీయొక్క నిర్మాణచరిత్ర సంగ్రహం అది.

వివిధ విప్లవదశల్లో చైనాపార్టీ ప్రజలకు నాయకత్వం వహించేటప్పుడు, ప్రజా ఉద్యమాన్ని నడిపేటప్పుడు, శత్రు దాడుల్ని ఎదుర్కొనేటప్పుడు పార్టీసభ్యుల్లో తలయెత్తుతూ వచ్చిన వక్రధోరణుల్ని పార్టీ యెలా ఎదుర్కొందో, పెటీ బూర్జువా సిద్ధాంతాలకు వ్యతిరేకంగా శ్రామికవర్గ సిద్ధాంతాల కోసం ఎలా పోరుసల్పిందో వివరించడమేగాక, ఏ సూత్రాలపై చైనాపార్టీ నిర్మింపబడిందో ఆ నిర్మాణసూత్రాలను లీ-షావ్-చీ సులభమైన భాషలో తెలియజేశారు. సంకుచిత స్వీయానుభవవాదం, 'అతివాద' పాక్షికధోరణి, మితవాద అవకాశవాదం, అంధశిఖరాగ్రతత్వం, నిరంకుశత్వం—మొదలైన అవలక్షణాలను నిర్మూలించడానికి చైనా కమ్యూనిస్టు

పార్టీ నిర్విరామంగా ఒక ఉద్యమాన్ని నడిపింది. తత్ఫలితంగా దాని నిర్మాణం బలపడింది. సరియైన రాజకీయపంథాతో బాటు-సరియైన నిర్మాణబలంకూడా ఉన్నప్పుడే, కమ్యూనిస్టు పార్టీ ప్రజలకు సమర్థవంతంగా నాయకత్వం వహించగల్గుతుం దనీ, విప్లవాన్ని విజయవంతంగా నడపగల్గుతుందనీ లీ-షావ్-చీ నివేదిక చదివినవారికి ద్యోతకమవుతుంది.

చైనాలోమాదిరిగానే భారతదేశంలోకూడ అధిక సంఖ్యాక ప్రజలు రైతాంగం. కమ్యూనిస్టుపార్టీలోకూడ రైతు యువకులే అధిక సంఖ్యాకులుగా ఉన్నారు. పార్టీసభ్యులుగా చేరిన వేలాది రైతుయువకుల్ని సుశిక్షితులైన బోల్షివిక్కు-లుగా చేయడానికి చైనా కమ్యూనిస్టుపార్టీ అనుసరించిన పంథా యీ నివేదికలో స్పష్టంగా వివరింపబడింది.

ప్రస్తుతం చైనా కమ్యూనిస్టుపార్టీకి ప్రధాన కార్యదర్శిగా ఉన్న లీ-షావ్-చీ నివేదికలోని విషయాలను ఆంధ్ర యువకులు అవగాహన చేసుకొని, విప్లవోద్యమాన్ని ముందుకు తీసుకుపోవడంలో కృతకృత్యులవుతారని ఆశిస్తున్నాను.

—అనువాదకుడు.





# విషయసూచిక

## పార్టీ నిర్మాణం

అంశం పేజీ నెం.



## పార్టీ నిబంధనావళి





౧

# రచయిత జీవిత సంగ్రహం



లీషావ్-చీ చైనా ప్రజారిపబ్లిక్ కేంద్ర ప్రభుత్వ ఉపాధ్యక్షుడు; చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ కార్యవర్గ సభ్యుడు; చైనా విప్లవోద్యమంయొక్క, కార్మికోద్యమంయొక్క నాయకుల్లో ఒకడు.

లీషావ్-చీ 1898లో జన్మించాడు. హునాన్ రాష్ట్రం లోని నింగ్సియాంగ్ ఈయన జన్మస్థలం. 1920 లో స్థాపింపబడిన అఖిల చైనా సోషలిస్టు సమితిలో సభ్యుడుగా చేరాడు. 1921లో చైనాకమ్యూనిస్టుపార్టీ స్థాపింపబడింది. ఆ సంవత్సరమే లీషావ్-చీ కమ్యూనిస్టుపార్టీలో చేరాడు. అఖిల చైనా ట్రేడ్ యూనియన్ సమాఖ్యకు పూర్వం స్థాపింపబడిన చైనా కార్మిక సమాఖ్య కార్యవర్గ సభ్యుడుగా 1922 లో ఎన్నుకోబడ్డాడు.

అప్పటినుంచీ మొదటి అంతర్యుద్ధంవరకూ (1927) లీషావ్-చీ చైనా విప్లవ కార్మికోద్యమానికి సారథ్యం వహించాడు.

మొదటి అంతర్యుద్ధం తర్వాత రహస్యజీవితం గడుపుతూ లీషావ్-చీ కార్మికోద్యమానికి నాయకత్వం వహించాడు. 1932 ఆకురాలుకాలంలో ఆయన కియాంగ్సీ విప్లవస్థావరానికి వెళ్లి, అక్కడి కమ్యూనిస్టు కేంద్రాలలో కార్మికోద్యమాన్ని నడుపుతూ వచ్చాడు.

1936 నుంచి 1942 వరకు లీషావ్-చీ చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీలో మొదట ఉత్తరప్రాంత ఉపసంఘానికీ, తర్వాత కేంద్ర మైదానప్రాంత ఉపసంఘానికీ, ఆ తర్వాత కేంద్రప్రాంత ఉపసంఘానికీ కార్యదర్శిగా పనిచేశాడు.

1932 నుంచీ ఈయన చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీలో పొలిట్‌బ్యూరో సభ్యుడు; 1943 తర్వాత కేంద్ర కమిటీ కార్యనిర్వాహకవర్గంలో సభ్యుడు; విప్లవసైనికశాఖకు అధ్యక్షుడు.

1949 అక్టోబరు 1 వ తేదీని చైనా ప్రజారిపబ్లిక్ ఏర్పడినప్పుడు లీషావ్-చీ కేంద్రప్రజాప్రభుత్వంలో ఉపాధ్యక్షుడుగా నియమింప బడ్డాడు.

ప్రస్తుతం ఈయన చైనా కమ్యూనిస్టుపార్టీకి ప్రధాన కార్యదర్శి; అఖిలచైనా ప్రజాప్రాతినిధ్య సభయొక్క స్థాయీ సంఘు అధ్యక్షుడు.

ఈయన రచించిన యితర గ్రంథాలు: "పార్టీ అంతరంగిక పోరాటం," "మంచి కమ్యూనిస్టు ఎలావుండాలి?" "అంతర్జాతీయత, జాతీయత."



7

# ఉపోద్ఘాతం



కామ్రేడ్స్,

కామ్రేడ్ మావ్-సె-టుంగ్ ఏడవ పార్టీ కాంగ్రెసుకు సమర్పించిన రిపోర్టులో (ఇది 'సంయుక్త ప్రభుత్వాన్ని గూర్చి' అనే శీర్షికతో ప్రచురింపబడింది) ప్రస్తుత అంతర్జాతీయ, జాతీయ పరిస్థితులను ఎంతో నిశితంగాను, ప్రతిభావంతంగాను సమీక్షించాడు. గత ఎనిమిది సంవత్సరాలలో జపాన్ దురాక్రమణకు వ్యతిరేకంగాజరిగిన ప్రజాప్రతిఘటన యుద్ధాన్ని గురించి, ఆ యుద్ధంలో పార్టీ అనుసరించిన విధానాన్నిగురించి విపులంగా పర్యావలోకించాడు. దేశవ్యాపితంగా చైనాప్రజలు, ప్రజాతంత్ర పార్టీలు, గ్రూపులు ఉమ్మడిపోరాటంలో అనుసరించవలసిన, ఒక గొప్ప కార్యక్రమాన్ని ఆయన రూపొందించాడు. అంతిమపోరాటంలో జపాన్ దురాక్రమణదారుల్ని ఓడించి, స్వేచ్ఛాయుతమైన ఐక్య స్వతంత్ర ప్రజాతంత్ర చైనాను నిర్మించేటందుకు చైనా ప్రజలందరినీ సమీకరించి సమైక్యంచేయడానికి మార్గంచూపాడు.

కామ్రేడ్ మావ్-సె-టుంగ్ రిపోర్టు విజయసాధన కొరకు శంఖారావం. నూతన ప్రజాతంత్ర రిపబ్లిక్ నిర్మాణానికి ఉజ్వల ప్రణాళిక.

గత 24 సంవత్సరాల వీరోచితపోరాటంలో, ముఖ్యంగా గత 8 సంవత్సరాల ప్రతిఘటన యుద్ధంలో, మనపార్టీ కంటకావృతమైన కఠినమార్గంలో నడిచింది. చైనా ప్రజలతో కలిసి

కామ్రేడ్ మావ్ నాయకత్వాన అది పనిచేసింది. చివరకు గొప్ప విజయాలను సాధించింది. చైనా జాతియొక్క, చైనా ప్రజలయొక్క ఉజ్వల భవిష్యత్తుకు అది మార్గం సరిచేసింది. విముక్తి ప్రాంతాలు, అష్టమ సైన్యం, నూతన చతుర్థసైన్యం, పార్టీ నాయకత్వంక్రింద పోరాడే యితర సాయుధ ప్రజా శక్తులు – వీటి సహాయంతో మన పార్టీ జపాను వ్యతిరేక జాతీయ విముక్తి పోరాటానికి అగ్రగామిగా తయారైంది.

మన పార్టీ యీ గొప్పవిజయా లన్నిటినీ సాధించ గలిగిందంటే, అందుకు కారణం మొదటినుంచీ అదొకసరికొత్త శ్రామికవర్గ పార్టీగా ఉండడం; తన సర్వశక్తుల్నీ చైనా ప్రజల సేవలో హృదయపూర్వకంగా వినియోగించడం; మార్క్సిస్టు – లెనినిస్టు సిద్ధాంతాలను చైనాదేశ పరిస్థితులకు వర్తింపజేస్తూ, వాటి సుస్థిర పునాదిపై తాను సంఘటితపడ్డం, మార్క్సిస్టు – లెనినిస్టు సిద్ధాంతాలను చైనా విప్లవ ఆచరణతో జోడించి మావ్-సె-టుంగ్ తయారుచేసిన సిద్ధాంతమే మన పార్టీకి మార్గదర్శి. మన పార్టీ రూపొందించిన విప్లవ కార్యక్రమం, విప్లవ విధానాలు చైనా ప్రజల ప్రయోజనాలను పూర్తిగా ప్రతిబింబిస్తున్నాయి. చైనా జాతికి, చైనా ప్రజలకు బద్ధ శత్రువులైన వారిపై హోరాహోరీగా పోరాడ్డమేగాక, వారి ప్రయోజనాలకు ద్రోహంచేసే అభివృద్ధి నిరోధక రాజకీయగ్రూపు లన్నిటినీ ప్రతిఘటించడమేగాక, ఆంతరంగికమైన అవకాశవాద ధోరణులన్నిటినీ మనపార్టీ ఎదుర్కొని పోరాడింది. చైనా విప్లవాన్ని గురించి మావ్ – సె-టుంగ్ తయారు చేసిన సిద్ధాంతాన్ననుసరించి మనపార్టీ చైనా కార్మికవర్గంలోని

కష్టజీవులలోని విశ్వాసపాత్రులందరినీ, ధైర్యవంతులందరినీ, చైతన్యవంతు లందరినీ, క్రమశిక్షణ గలవారందరినీ ఒక చోటికి చేర్చి, చైనా కార్మికవర్గంయొక్క సంఘటిత అగ్రదళంగా తయారై, చైనాప్రజల శత్రువులతో దృఢనిశ్చయంతోను, ధైర్యంతోను పోరాడింది; వారి నెలాదెబ్బకొట్టాలో, ఎలా దెబ్బకాచుకోవాలో నేర్చుకొంది.

మన పార్టీ సాధించిన విజయాలకు మరొక కారణం కూడా వుంది. ప్రజలకు నిత్యమూ సేవచేయాలనే ప్రధాన నిర్మాణసూత్రాన్ని మనపార్టీ ఎడతెగకుండా అమలుజరుపుతూ వచ్చింది. అందువల్ల అది ప్రజల్లో వేళ్లు పాతుకొంది. ప్రజలతో సన్నిహిత సంబంధంగలిగి క్రమశిక్షణతో పని చేసే పార్టీగా అది తయారైంది. కేంద్రీకృత ప్రజాస్వామ్యంపై ఆధారపడ్డ పార్టీ అది. ఐచ్ఛికశిక్షణతో అది పనిచేస్తుంది. విమర్శన, ఆత్మవిమర్శన ద్వారా అది బలపడుతోంది. పార్టీలో ముఠాలను అది అంగీకరించదు. కొత్త సభ్యుల్ని జాగ్రత్తగా చేర్చుకొంటుంది. ప్రతి సభ్యుడూ ఏదో ఒక పార్టీయూనిట్‌లో వుంటూ పార్టీ కార్యకలాపాల్లో స్వయంగా పాల్గొనాలి. ప్రజల్ని పూర్తిగా విముక్తి చేయడంలో నాయకత్వం వహించడమే యిట్టి నిర్మాణసూత్రాల లక్ష్యం. మొట్టమొదటి పార్టీ మహా సభచే ఆమోదింపబడిన నిబంధనావళిలో యీ సూత్రాలన్నీ వున్నాయి. అవి సరియైనవేనని గత 24 సంవత్సరాల పోరాటానుభవం ఋజువుచేసింది. ఈ సూత్రాల ప్రకారమే మనపార్టీ నిర్మింపబడ్డందువల్ల అది తన రాజకీయ కర్తవ్యాలను జయప్రదంగా నెరవేర్చగల్గుతోంది. అది నడిపే పోరాటాల్లో ఐక్యతను

సాధించడం, అనేక చిక్కు పరిస్థితులను అధిగమించడం, అంతిమ విజయంవైపు ప్రజల్ని నడపడం సాధ్యమవుతోంది.

చైనాప్రజల ప్రయోజనాలను ప్రతిబింబించే విప్లవ కార్యక్రమం, విప్లవ విధానం మనపార్టీకి ఉన్నప్పటికీ, దానితో బాటు నిర్మాణబలం, కఠినశిక్షణ, అగ్నిపరీక్షలకు నిలబడగల శక్తి దానికుండడంవల్లనే - అనేకతరగతుల చైనా ప్రజలు మన పార్టీకి స్వాగతమిస్తున్నారు; దాన్ని విశ్వసిస్తున్నారు. జిత్తులమారి క్రూరశత్రువుపై 47½ కోట్ల పీడిత చైనాప్రజలు తమ విముక్తికోసం పోరుసల్పడం అతిక్లిష్టమైన విషయం. అట్టి శత్రువును ఓడించి విజయాన్ని సాధించేటందుకు యావన్మంది ప్రజలనూ సమీకరించి నడపగలశక్తి, మనోనిశ్చయం మన పార్టీవంటి పార్టీకే వుంటాయి.

ఈ రోజున మన పార్టీనిబంధనావళిలో మార్పులు జరుగుతున్నాయంటే, దాని అర్థం పార్టీయొక్క స్వభావంగాని, దాని ప్రధాన నిర్మాణసూత్రాలుగాని మార్పుచెందుతున్నాయనుకోవద్దు. పైగా మనం గడించిన అనుభవాలను ఆధారంగా చేసుకొని, గత మూడు విప్లవదశల్లో 'కామ్రేడ్ మావ్ రూపొందించిన నిర్మాణసూత్రాల ప్రాతిపదికపై పార్టీయొక్క స్వభావాన్ని, నిర్మాణసూత్రాలనూ మరింత బలపరచుకొంటూ పోవాలి. ముందు జరగబోయే గొప్ప ఘటనల్లో మన పాత్రను సరిగా నిర్వర్తించాలంటే, జపాన్ దురాక్రమణదారుల్ని, వారి ఏజంట్లనూ ఓడించాలంటే, ఐక్యప్రజాతంత్ర, స్వతంత్ర రిపబ్లిక్‌ను చైనాలో స్థాపించాలంటే, పార్టీ యొక్క పోరాటశక్తినీ, ప్రజల్లో దానికిగల సంబంధాలనూ అధికంగా

వృద్ధిచేసుకోవాలంటే - మరింత శక్తివంతంగా మన పార్టీయొక్క స్వభావాన్ని, నిర్మాణ సూత్రాలను బలపరచుకోవాలి.

అయితే, మనపార్టీ నిబంధనావళి పార్టీయొక్క ప్రధాన సూత్రాలను నిర్వచించడమేగాక, వాటికనుగుణ్యంగా కొన్ని నిర్మాణపద్ధతులను కూడ నిర్ణయించింది; నిర్మాణ రూపాల్లోను, ఆంతరంగిక జీవితంలోను అనుసరించవలసిన నిబంధనలను అది పేర్కొంది. ఈ నిర్మాణరూపాలు, పని పద్ధతులు అంతర్గత-బహిర్గత పరిస్థితుల్ని బట్టీ, పార్టీ నిర్వర్తించవలసిన రాజకీయ కర్తవ్యాన్ని బట్టీ వుంటాయి. అందుచేత కొంతవరకు పట్టువిడుపులు అవసరం. పరిస్థితులు మారడంవల్లగాని, పని చేసే విషయంలో కొత్తపరిస్థితు లేర్పడ్డంవల్లగాని పార్టీ నూతన రాజకీయ కర్తవ్యాలను నిర్వర్తించవలసి వస్తుంది. అప్పుడు మన నిర్మాణరూపాలు, పనిపద్ధతులుకూడా తదనుగుణ్యంగా మారవలసి యుంటుంది. లేకపోతే, పాత నిర్మాణరూపాలూ, కార్యవిధానమూ పార్టీయొక్క అభివృద్ధిని ఆటంకపరుస్తాయి; మన రాజకీయ కర్తవ్యాలను నిర్వహించడంలో మనకు అడ్డువస్తాయి. మనది సృజనాత్మకమైన మార్క్సిస్టు రాజకీయ పార్టీ. ఎందుచేతనంటే, సిద్ధాంతాల్లోగాని, రాజకీయాల్లోగాని పిడిసూత్రాలకు మనం ఎన్నడూ బంధింపబడం; పార్టీయొక్క నిర్మాణరూపాలను మార్చశక్యంగాని కఠిన నిబంధనలుగా పరిగణింపము. ఎప్పటికప్పుడు చైనావిప్లవం పురోగతికి సంబంధించినంతవరకు నిర్దిష్టపరిస్థితుల కనుగుణ్యంగా మనం తీసుకున్న రాజకీయ కర్తవ్యాల ప్రాతిపదికపై, నూతన అనుభవాన్ని దృష్టిలో వుంచుకొంటూ, నిర్మాణరూపాలనూ, కార్యవిధా

నాన్ని మనం వృద్ధిచేసుకొంటూ వచ్చాం. అందువల్ల మనం పార్టీయొక్క ప్రధాన నిర్మాణసూత్రాల కనుగుణ్యంగా, నూతన పరిసరాల్నీ, పార్టీలోసర్పష్ట నూతనపరిస్థితుల్నీ దృష్టిలో వుంచుకొని, నిబంధనావళిని సవరించుకోవడం ఎంతో అవసరం.

పార్టీ తన ప్రధానమైన నిర్మాణసూత్రాలను అతి కఠినంగా అమలు జరుపుతుంది. అదేసమయంలో, తన కార్య కలాపాలు విస్తరించేవిధంగాను, తన రాజకీయ కర్తవ్యాలను జయప్రదంగా నిర్వర్తించేటట్లు, ఆచరణలో ఐక్యతను సాధించే టట్లు తన నిర్మాణరూపాల్నీ, కార్యవిధానాన్నీ పరిస్థితులకు తగినట్లు మార్చుకొంటుంది.

ఏడవ పార్టీ మహాసభలో మనం పార్టీ నిబంధనావళికి అనేక ముఖ్యసవరణలను, అనుబంధాలను సూచించాం. ఆ సవరణలు, అనుబంధాలు ఎందు కవసరమయ్యాయి? క్రింది కారణాలవల్ల అవి అవసరమయ్యాయి:

1. మన పార్టీ నిబంధనావళి 17 సంవత్సరాల క్రిందట, 1928 లో జరిగిన ఆరవ పార్టీమహాసభలో సవరింపబడింది. ఆ తర్వాత పార్టీలోనూ, బయటి పరిస్థితులు ఎంతో మార్పు చెందాయి. పూర్తిగా కొత్తరాజకీయ కర్తవ్యాలను నిర్వర్తిం చేందుకు పార్టీ సభ్యులందరినీ సమీకరించవలసిన అవసరం ఏర్పడింది.

2. గత 17 సంవత్సరాలలో చైనా విప్లవోద్యమాన్ని నడపడంలో మన పార్టీగడించిన అనుభవాలు చాల విలువ యైనవి, ప్రధానమైనవి. వాటన్నిటినీ క్రోడీకరించి, పార్టీనిబం

ధనావళిని శక్తివంత మొనర్చుకొనేటందుకు, పార్టీనిర్మాణాన్ని బలపరచుకొనేటందుకు కృషి చేయవలసియుంది.

3. ప్రత్యేక పరిస్థితులవల్ల, ఆరవ పార్టీమహాసభలో ఆమోదింపబడిన అనేక నిబంధనలు యీయోజన వర్తించవు. అందుచేత చాలమంది పార్టీ సభ్యులు పార్టీ నిబంధనావళిపట్ల శ్రద్ధచూపడంలో విఫలులవుతున్నారు; దాన్ని శక్తివంతంగా అమలు జరపలేకున్నారు. కాబట్టి ప్రస్తుతపరిస్థితుల కనుగుణ్యమైన కొత్త నిబంధనావళిని తయారుచేయవలసిన బాధ్యత ఏడవ పార్టీ మహాసభమీాద పడింది.

నేడు మన పార్టీకి నూతనంగా కొన్ని ప్రధాన లక్షణాలేర్పడ్డాయి. అవి యిదివరకు పార్టీ చరిత్రలో ఎన్నడూలేవు. ఆ కొత్తలక్షణాలేవంటే :

i. మనపార్టీ దేశవ్యాపితమైన ప్రజాస్వభావంగలపార్టీగా పెంపొందింది. దేశప్రజలందరూ మన పార్టీమీాద గంపెడాశ పెట్టుకుని వున్నారు. 12,10,000 మంది సభ్యులతో దేశమంతటా విస్తరించియున్న పార్టీయూనిట్లతో మనపార్టీ తమ్ము తప్పక రక్షిస్తుందని చైనాప్రజలు నమ్ముతున్నారు.

ii దీర్ఘకాల విప్లవపోరాటాల్లో మనపార్టీ బాగా రాటుదేరింది; విప్లవపోరాటమనే కళలో అది ఆరితేరింది. జపాను దురాక్రమణకు వ్యతిరేకంగా యిప్పుడు జరుగుతున్న ప్రతిఘటనయుద్ధంలో ప్రధానశక్తులు అష్టమ సైన్యం, నూతన చతుర్థ సైన్యం, పార్టీ నాయకత్వంక్రింద సంఘటితమైయున్న ఇతర సాయుధ ప్రజాశక్తులు. జపాన్ దురాక్రమణదారులపై దీర్ఘకాలయుద్ధం జరపడంలో చైనాజాతి, చైనా

ప్రజలు యీ సాయుధ శక్తులపైనే ఆధారపడ్డారు. యుద్ధం సమాప్తమయిన తర్వాత చైనా ఒక ఐక్య ప్రజాతంత్ర దేశంగా రూపొందేటట్లుచూడ్డానికి వారు మన పార్టీమీద అనేక ఆశలు పెట్టుకొని వున్నారు.

iii మనపార్టీ శత్రుసేనల వెనుక బలమైన విప్లవస్థావరాలను నిర్మించడంలో 9,50,00,000 మంది ప్రజలకు నాయకత్వంవహించింది. అక్కడ ప్రజాతంత్ర సంస్కరణలెన్నో ప్రవేశపెట్టబడ్డాయి. ఆర్థిక, రాజకీయ, సైనిక, సాంస్కృతిక రంగాలలో నూతన ప్రజాస్వామ్యవ్యవస్థా నిర్మాణం ప్రారంభమయింది. తత్ఫలితంగావస్తూత్పత్తి పెరిగింది; ప్రజల జీవన ప్రమాణం హెచ్చింది; సాంఘికస్థిరత్వం ఏర్పడింది; ప్రజల సంస్కృతి, చైతన్యస్థాయి యినుమడించాయి. ఈ విధంగా మన పార్టీ యీ ప్రాంతాలప్రజల్ని సమీకరించి, జపాన్ దురాక్రమణదారుల్ని తరుమగొట్టడంలోను, చైనాదేశమంతటా ప్రజలు విప్లవపోరాటాలు సాగించేటట్లు ప్రోత్సహించడంలోను తన కర్తవ్యాన్ని నెరవేర్చగలిగింది. ఈ విప్లవస్థావరాలు నవచైనాకొక నమూనాఅని చెప్పవచ్చు. చైనాప్రజలు దేశవ్యాపిత విప్లవంలో జయించితీరుతారనడానికిది తార్కాణం.

iv మన పార్టీ అనేకరకాల తప్పుడుఅభిప్రాయాలను జయప్రదంగా ఎదుర్కొంది. మూడువిధాలైన వక్రధోరణు

లకు వ్యతిరేకంగా పోరాడ్డంవల్ల • పార్టీలో సిద్ధాంత, రాజకీయ, నిర్మాణఐక్యత బ్రహ్మాండంగా పెరిగింది. గతంలో తలయెత్తిన అవకాశవాద ధోరణులన్నీ నిర్మూలింపబడ్డాయి. కార్మిక వ్యతిరేక భావాలు చాలవరకు తొలగించబడ్డాయి. కామ్రేడ్ మావ్ - సె - టుంగ్ రూపొందించిన మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాలు బ్రహ్మాండమైన విజయాన్ని సాధించాయి. మన పార్టీలో తెలియకుండా దాక్కొనియున్న, చైనాజాతిని విచ్ఛిన్నంచేయడానికి ప్రయత్నిస్తూవచ్చిన గూఢచారులు, విచ్ఛిన్నకులు అనేకమంది పార్టీనుంచి తొలగింపబడ్డారు. ఈ విధంగా పార్టీ సిద్ధాంత, రాజకీయ నిర్మాణ విషయాల్లో యిదివరకెన్నడూ లేనంతగా ఐక్యతను సాధించింది. చైనా విముక్తికి యిదెంతైనా దోహదమిచ్చింది.

V. చివరి విషయం - ఇదేమీ చిన్నవిషయం కాదు - మన పార్టీ ఒక గొప్పనాయకుణ్ణి కలిగియుంది. అతడే కామ్రేడ్

---

కామ్రేడ్ మావ్ - సె - టుంగ్ నాయకత్వాన చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ 1941 - '42 లో మూడు వక్రధోరణులకు వ్యతిరేకంగా పోరాటం ప్రారంభించింది. పార్టీసభ్యులందరినీ సిద్ధాంత రీత్యా సరియైన మార్గంలో పెట్టడానికది అవసరమయింది. దాని పుద్దేశం, అనేక రంగాల్లో పార్టీ సభ్యులు ప్రదర్శిస్తూవచ్చిన వక్రభావాలను, అపసవ్య పద్ధతులను బహిర్గతంచేసి, వాటిని నిర్మూలించడం. అట్టి వక్రభావాలకు, అపసవ్య పద్ధతులకు ప్రధానరూపాలేవంటే: నిర్మాణ కార్యకలాపాల్లో సెక్టేరియనిజం; అధ్యయనంలో పిడివాదం; ప్రచారపద్ధతుల్లో ఫార్మలిజం (ఫార్మలిజం అంటే, పరిస్థితులకు సంబంధంలేకుండా కొన్ని సాధారణ విషయాలను వల్లించడం - అను. ).

మావ్-సె-టుంగ్. ఆయన మన పార్టీనిర్మాత, నాయకుడు. ప్రస్తుత చైనా విప్లవాన్ని నడిపే సారథి ఆయనే.

కామ్రేడ్ మావ్ మన వీరకార్మికవర్గానికి, చైనా జాతి యొక్క అత్యుత్తమ సాంప్రదాయాలకు ప్రతినిధి. ఆయన కుశాగ్రబుద్ధిగల సృజనాత్మక మార్క్సిస్టు; మార్క్సిజం అనే విశ్వమానవ సత్యాన్ని - ఇదే మానవజాతియొక్క మహోన్నత సిద్ధాంతం - చైనా విప్లవ ఆచరణతో ఆయన జోడించాడు. చైనాజాతియొక్క సిద్ధాంతసంపదను కామ్రేడ్ మావ్ అత్యున్నత పథాలకు తీసుకువెళ్ళాడు. పీడిత చైనా ప్రజల కతడు సరియైన, స్పష్టమైన విముక్తిమార్గాన్ని చూపెట్టాడు. అదే మావ్-సె-టుంగ్ మార్గం. ఈ మార్గంలో ప్రయాణం చేస్తూ మన పార్టీ, చైనా ప్రజలు 1927 కి పూర్వం బ్రహ్మాండ మైన విప్లవోద్యమాన్ని ప్రారంభించారు. కామ్రేడ్ మావ్. దాన్ని ఆర్గనైజ్ చేశాడు. వ్యవసాయ విప్లవదశలో కమ్యూనిస్టు ప్రాంతాలు, ఎర్రసైన్యం సృష్టింపబడ్డాయి. వాటిని నెల కొల్పిందీ, నడిపిందీ కూడా కామ్రేడ్ మావే. జపాను వ్యతిరేక ప్రతిఘటన యుద్ధదశలో విముక్త ప్రాంతాలు, ప్రజల సాయుధ దళాలు యేర్పడ్డాయి. అవే అష్టమసైన్యం, నూతన చతుర్థ సైన్యం. వాటిని స్థాపించిందికూడా కామ్రేడ్ మావే.

కామ్రేడ్ మావ్-సె-టుంగ్ మన పార్టీనాయకుడు. అయినా పార్టీలో ఆయనొక సాధారణ సభ్యుడు. పార్టీ సేవలో ఆయన తన జీవితాన్ని ధారపోస్తున్నాడు. పార్టీ శిక్షణను పాటించడంలో ఆయన అందరికంటె జాగ్రత్తగా వుంటాడు. ఆయన ప్రజలకు నాయకుడు; అయితే ప్రజల మనోవాంఛ

పైనే పూర్తిగా ఆధారపడతాడు. ప్రజలకు అత్యుత్తమ సేవకుడుగా, అతి నమ్రతగల శిష్యుడుగా ప్రజలముందు నిలబడతాడు.

కామ్రేడ్ మావ్ ప్రజాసామాన్యం యొక్క విప్లవ పోరాటాల్లో పుట్టి పెరగడంవల్ల, 30 సంవత్సరాలకు పైగా విప్లవ పోరాటాల పరీక్షకు నిలబడ్డంవల్ల పార్టీ సభ్యులంతా, ప్రజలందరూ ఆయన్ని బాగా ఎరుగుదురు. వారు ఆయనలో పూర్తి విశ్వాసం వుంచడంవల్లనే, జాగ్రత్తగా ఆయన్ని ఎన్నుకోవడంచేతనే కామ్రేడ్ మావ్ మన పార్టీకి, చైనా జాతికి, చైనాప్రజలకు నాయకు డయాడు.

మన పార్టీ కొక గొప్ప నాయకుడు ఉండడంతోపాటు, అనేక కఠినపరీక్షలకు నిలబడ్డ కార్యకర్తలు కూడా పార్టీలో చాలమంది వున్నారు. వారి ఆయుధం చైనా విప్లవాన్ని గురించిన మావ్ సిద్ధాంతం; ఆయన అడుగుజాడల్లో వారంతా నడుస్తారు. ఈ కార్యకర్తలంతా దీర్ఘకాల పోరాటదశలో అతి ప్రతిభావంతులనీ, చైనా జాతికి ఆణిముత్యాలవంటివారనీ, విప్లవంలోనేగాక పునర్నిర్మాణంలో కూడ అన్ని విషయాల్లోనూ అగ్రగాములనీ - రుజువు చేసుకున్నారు. మనపార్టీకి, ప్రజలకు అలాంటి గొప్పనాయకుడు, అలాంటి కార్యకర్తలు ఉండడంవల్లనే మనం అజేయులం. అందువల్లనే మనం చైనా జాతికి, చైనా ప్రజలకు శత్రువులైనవారిని ఓడించగలం.

కామ్రేడ్స్, మన పార్టీ యిదివరకే మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీగా, దేశవ్యాపితమైన ప్రజాపార్టీగా రూపొందింది. సిద్ధాంత, రాజకీయ, నిర్మాణ విషయాల్లో ఐక్యతను సాధిం

చింది. తన సొంత నాయకుణ్ణి అది కలిగియుంది. చైనాయొక్క రాజకీయ భవిష్యత్తును నిర్ణయించే శక్తిగా అది యీనాడు తయారైంది.

ఇవీ నేటి మన పార్టీయొక్క ముఖ్య లక్షణాలు.

ఇవీ మన పార్టీసాధించిన విజయాలు. ఈ గొప్ప విజయాలన్నీ చైనా ప్రజలవి; ప్రజల్లో మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలు సాధించిన విజయాలివి. మన పార్టీనాయకుడైన కామ్రేడ్ మావ్-సె-టుంగ్ యొక్క సిద్ధాంతానికి, నాయకత్వానికి అవి గొప్పవిజయాలు.

అయితే, దీన్నిబట్టి మన పార్టీలో బలహీనతలుగాని లేవనుకోవడం పొరబాటు. ముందుముందు చిక్కు పరిస్థితు లేర్పడవని దీని అర్థంకాదు. మనలో యింకా కొన్నిలోపాలు, బలహీనతలువున్నాయి. మన మెన్నో విజయాలు సాధించినప్ప టికీ, గమ్యస్థానానికి మనమింకా దూరంగానే ఉన్నాం. అనేక చిక్కుపరిస్థితులను మన మెదుర్కోవలసియుంది.

మన పార్టీ ప్రధానంగా గ్రామసీమల్లోవుంది. పార్టీ సభ్యుల్లో అత్యధిక సంఖ్యాకులు రైతులనుంచీ, మధ్యతరగతుల నుంచీ వచ్చినవారు. మొత్తంమీద చూస్తే మనపార్టీ సభ్యులు అనేక విప్లవపోరాటాల్లో రాటుదేరినప్పటికీ వారి సిద్ధాంత పరి జ్ఞానం, వైజ్ఞానికస్థాయి అధికమైనది కాదు. పార్టీలో కొందరు కామ్రేడ్స్ యింకా తమ కార్యవిధానంలో స్వీయమానసిక తత్వాన్నిపూర్తిగా నిర్మూలించుకోలేదు. మరికొందరు హుకూ మత్ తత్వాన్ని, నియంతృత్వ ధోరణిని, పెత్తందారీ పోకడ లను ప్రదర్శిస్తున్నారు, ఈ లక్షణాలు పార్టీని ప్రజలనుంచి

దూరం చేస్తాయి. అంధ 'శిఖరాగ్రతత్వం' ♦ పార్టీయొక్క ఐక్యతను నాశనం చేస్తుంది, మన పార్టీలో యిలాంటి లోపాలు, బలహీనతలు లేకుండా చేసుకోవాలంటే యిదివరకుకన్న ఎక్కువగా యిందుకు ప్రయత్నించాలి; ఇదివరకు కన్న ఎక్కువగా కష్టపడి సాధన చేయాలి.

మన పార్టీ చైనా ప్రజలతో కలిసి దీర్ఘకాలం వీరోచిత పోరాటాలు జరిపి, ముఖ్యంగా గత ఎనిమిది సంవత్సరాల్లో గొప్ప ప్రతిఘటన యుద్ధంలో పాల్గొని, విజయానికి సమీపంలోకి వచ్చింది. మన ప్రస్తుత కర్తవ్యం: ఆ విజయం కొరకు పోరాడ్డం, సన్నాహాలు జరపడం, జపాన్ దురాక్రమణదారుల్ని చివరిసారిగా తరిమికొట్టి వారిచేతుల్లో వున్న పట్టణాలను గ్రామాలను స్వాధీనం చేసుకొనేందుకు మిత్రరాజ్యాల సహకారం తీసుకొంటూ చైనా ప్రజలందరినీ సమీకరించడం, ఐక్యపరచడం; దేశం మొత్తంమీాద వున్న ప్రజాతంత్రవ్యతిరేక శక్తుల్ని నిర్మూలించడం; సర్వస్వతంత్రమైన ఐక్య ప్రజాతంత్ర జన చైనాను నిర్మించడం. ఈ కర్తవ్యాలను నిర్వర్తించా

---

♦ ఇదొక స్థానిక సెక్టేరియన్ ధోరణి. అందరి ప్రయోజనాలకంటె కొందరి ప్రయోజనాల కిది ప్రాధాన్యత యిస్తుంది. దీని ప్రత్యేక లక్షణం, తన ప్రాంతపు కార్యకర్తలతోను కామ్రేడ్స్‌తోను, యెక్కువ చనువుగా ఉంటూ, యితర ప్రాంతాల కార్యకర్తలయెడ, కామ్రేడ్స్ యెడ అంటీ అంటనట్లుండడం. ఈ ధోరణి తలయెత్తడానికి తోడ్పడ్డ పరిస్థితులేవంటే: చాల సంవత్సరాలు సాగిన గెరిల్లా యుద్ధకాలంలో గ్రామసీమల్లోని విప్లవ స్థావరాలు చెల్లాచెదరై ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా పోయాయి. అనేక సందర్భాలలో యీ విప్లవ స్థావరాలు పర్వత ప్రాంతాల్లో నెలకొల్పబడ్డాయి. అందుచేత యీ విధమైన సెక్టేరియన్ ధోరణి 'శిఖరాగ్రతత్వం'అనే పేరుతో పిలువబడుతూ వచ్చింది.

లంటే, మనం పార్టీపనిని తీవ్రతరం చేయాలి; అన్ని తరగతుల ప్రజల్లో దాని నిర్మాణశక్తిని, నాయకత్వాన్ని బలపరచుకోవాలి; వారూ మనం కలిసి సిద్ధాంత రాజకీయ నిర్మాణ విషయాల్లో సర్వసన్నాహాలు చేసుకోవాలి. మన చరిత్రలో అత్యద్భుతమైన విజయం సాధించడానికి కవసరమైన అంతిమపోరాటానికి ఆయత్తమవాలి. ఇవీ, మన పార్టీ నిర్వర్తించవలసిన తక్షణ రాజకీయ, నిర్మాణ కర్తవ్యాలు.

ఈ పరిస్థితి, ఈ కర్తవ్యాలే పార్టీ నిబంధనావళిలో వచ్చిన మార్పుకు కారణాలు.

# పార్టీ సాధారణ కార్యక్రమం

**పా**ర్టీ నిబంధనావళికి ఉపోద్ఘాతంగా మనం ఒక సాధారణ కార్యక్రమాన్ని రూపొందించుకున్నాం. అదే మన పార్టీ యొక్క కార్యక్రమం. నిబంధనావళిలో అదొక భాగం. ప్రతి పార్టీ సభ్యుడు యీ కార్యక్రమాన్ని తన కార్యకలాపాలకు ప్రాతిపదిగా అంగీకరించాలి. మొత్తం పార్టీయొక్క ఐక్యతను సంఘటితశక్తిని యీ సాధారణ కార్యక్రమం దృఢతరమొనర్చుతుంది.

గత 24 సంవత్సరాలలో పార్టీగడించిన పోరాటానుభవాలను, ప్రపంచ కార్మికోద్యమంలోని ఉత్తమోత్తమ అనుభవాలను యీ సాధారణ కార్యక్రమం క్రోడీకరిస్తుంది. మన పార్టీనాయకుడైన **మావ్ - సె - టుంగ్** ఉపదేశాలందులో యిమిడివున్నాయి. అది **పార్టీ**యొక్క స్వభావాన్నీ సిద్ధాంతాన్నీ సులభమైన భాషలో వివరిస్తుంది. చైనా విప్లవంయొక్క

స్వభావాన్ని, దాని చోదకశక్తినీ, అది నిర్వర్తించవలసిన కర్తవ్యాలను విశదీకరిస్తుంది. మన పార్టీపాలసీని అది నిర్వచిస్తుంది. చైనా విప్లవంలో అది అలవరచుకోవలసిన గుణాలను తెలియ జేస్తుంది. పార్టీలో అవకాశవాదానికి స్థానంలేదని నొక్కిచెబు తుంది. పార్టీలో ఆత్మవిమర్శన ఎలా జరగాలో, ప్రజా సాన్నిహిత్యపంథా అంటే ఏమిటో, పార్టీయొక్క నిర్మాణ సూత్రాలేవో వివరిస్తుంది. ఈ అంశాలన్నీ యిదివరకే పార్టీ కార్యక్రమంలో పేర్కొనబడ్డాయి. ప్రస్తుతం నేను యీ దిగువ అంశాలపై కొన్ని వివరణలుమాత్రం యిస్తాను.

## 1. పార్టీయొక్క స్వభావం

మన పార్టీ కార్మికవర్గం యొక్క సుసంఘటిత అగ్రదళ మనీ, కార్మికవర్గపు అత్యున్నత నిర్మాణరూపమనీ మొదట్లోనే పార్టీ కార్యక్రమం స్పష్టంచేసింది. చైనాజాతియొక్క, చైనా ప్రజలయొక్క ప్రయోజనాల కది నిర్దిష్టరూపం. నేటి దశలో నూతనప్రజాతంత్ర విధానాన్ని నెలకొల్పడానికది కృషిచేస్తుంది. చైనాలో కమ్యూనిస్టు సమాజస్థాపన దాని అంతిమ లక్ష్యం. ఈ విషయంలో ఎవరికీ అనుమానాలు లేవని నా అభిప్రాయం.

మన పార్టీ 1921 లో ఏర్పడింది. అంతకుముందు చైనా ప్రజలు ఎంతో ప్రజ్ఞావంతులైన నాయకుల సారధ్యం క్రింద సామ్రాజ్యవాదానికీ, భూస్వామ్య విధానానికీ వ్యతిరేకంగా 80 సంవత్సరాలు ఎడతెగకుండా వీరోచిత విప్లవపోరాటాలు జరిపారు. 80 సంవత్సరాల తర్వాత కమ్యూనిస్టుపార్టీ ఏర్పడ్డా నికి అంతర్జాతీయ, జాతీయ పరిస్థితు లెంతో అనుకూలించాయి. అంతర్జాతీయంగా మొదటి ప్రపంచయుద్ధం, రష్యాలో అక్టో

బహు విప్లవం జరిగాయి. జాతీయంగా సామ్రాజ్యవాదుల దురాక్రమణ, భూస్వామ్యవర్గాల దోపిడీ అంతకంతకు భయంకరరూపం దాల్చాయి. మరోవైపు ప్రజల విప్లవపోరాటాలు, 1919 మే 4 వ తేదీ తర్వాత బ్రహ్మాండమైన కార్మికోద్యమం అంతకంతకు తీవ్రమవుతున్నాయి. ఈ పరిస్థితుల్లో చైనా విప్లవకారులు కామ్రేడ్ మావ్ సె-టుంగ్ నాయకత్వాన మొట్టమొదటిసారిగా అతివాద విప్లవ ప్రజాతంత్రపంథానుండి కమ్యూనిస్టుపంథాకు పురోగమించారు. ఈ విధంగా చైనా కమ్యూనిస్టుపార్టీ ఉద్భవించింది.

మన పార్టీ ఏర్పడినప్పటినుంచీ స్పష్టమైన వర్గ చైతన్యంతో పనిచేసింది. బూర్జువా ప్రజాతంత్ర విప్లవాన్ని నడపడంలో శ్రామికవర్గ దృక్పథాన్ని అది అలవరచుకొంది. మార్క్సిజం – లెనినిజం అను విశ్వమానవసత్యాన్ని చైనా కార్మికోద్యమంయొక్క, చైనా విప్లవోద్యమంయొక్క వాస్తవ పరిస్థితుల కన్వయిస్తూ పనిచేయగలిగింది. అభివృద్ధి చెందిన కార్మికవర్గపార్టీల కార్యవిధానాన్ని అలవరచుకో గలిగింది. వీటన్నిటివల్ల చైనావిప్లవాని కొక నూతనస్వరూపమేర్పడింది. ఈరోజున, అంటే అతి కఠినమైన, అతి క్లిష్టమైన అనేక బాధలతో కూడుకున్న విప్లవపోరాటాల తర్వాత, మన పార్టీ చైనావిప్లవాన్ని చాల ముందుకు తీసుకువెళ్ళగలిగింది. ఈ పోరాటాల్లో అది సంపాదించిన అమూల్య అనుభవాన్ని కామ్రేడ్ మావ్ సె-టుంగ్ ఎంతో చక్కగా క్రోడీకరించగలిగాడు. అందువల్ల మార్క్సిజం-లెనినిజం అనే విశ్వమానవ సత్యాన్ని చైనాదేశపు విప్లవపరిస్థితుల కన్వయించడంలో

యిదివరకటికంటె ఎక్కువ ప్రావీణ్యత మనకు లభించింది. అనగా, మనపార్టీ మొదటినుంచీ ఒక కొత్తవిధమైన పార్టీగానే - మార్క్సిస్టు లెనినిస్టు పార్టీగానే - ఉంటూ వచ్చింది. ఈ నాడది మరీ ఖచ్చితమైన మార్క్సిస్టు లెనినిస్టు పార్టీగా రూపొందింది.

మన పార్టీలో శ్రామికవర్గం నుంచీ, అర్ధశ్రామికులనుంచీ (పేదరైతులు) వచ్చిన సభ్యులే అధికసంఖ్యాకులుగా ఉన్నప్పటికీ, పార్టీలోని ప్రధాన సెక్షన్లు గ్రామసీమల్లో నివసిస్తున్నారు. పార్టీ సభ్యులలో అత్యధిక సంఖ్యాకులు రైతులనుంచీ, పెటీ బూర్జువా మేధావులనుంచీ వచ్చినవారు. మొత్తం సభ్యులలో కార్మికుల నిష్పత్తి తక్కువ. ఇందువల్లనూ, యితర కారణాలవల్లనూ పార్టీలో సహజంగా అనేక ప్రధాన సమస్యలు ఉత్పన్నమవుతూ వచ్చాయి. ఉదాహరణకు చిన్న ఉత్పత్తిదారుల తత్వం మన పార్టీలో ఎక్కువగా ప్రతిబింబించింది. పెటీ బూర్జువా వర్గాలద్వారా మన పార్టీలో బూర్జువా సిద్ధాంతాలు, ఫ్యూడల్ సిద్ధాంతాలు ప్రవేశించాయి. స్వీయ మానసిక తత్వం (సబ్జెక్టివిజం), అతివాద పాక్షిక తత్వం (సెక్టేరియనిజం), పడికట్టు శబ్దాల ప్రయోగం (పార్టీ జార్గన్), రాజకీయంగానూ, నిర్మాణ పద్ధతుల్లోను అవకాశవాదం (ఆపర్చూనిజం) మొదలైన ధోరణులకు సాంఘిక పునాది యిదే. అయినప్పటికీ మన పార్టీ శ్రామిక వర్గంయొక్క రాజకీయ పార్టీ. ఈ యధార్థం పై పరిస్థితులవల్ల ఎంతమాత్రం మారదు.

మన పార్టీయొక్క శ్రామికవర్గ స్వభావం క్రింది పరిస్థితులవల్ల నిర్ణయింపబడుతూంది:

1. ప్రపంచ శ్రామిక విప్లవదశలో మనపార్టీ ఏర్పడింది. 1927 చైనా విప్లవ ప్రాతిపదికపైన, అంతకుముందు కార్మికోద్యమ ప్రాతిపదికపైన అది అభివృద్ధిచెందింది. అంతర్జాతీయ మార్క్సిస్టు-లెనినిస్టు మహోద్యమాల సాంప్రదాయాల్ని అది అలవరచుకొంది. చైనా కార్మికోద్యమంతో ఎడతెగని సన్నిహిత సంబంధాలు దానికున్నాయి.

2. కామ్రేడ్ మావ్‌సె-టుంగ్ ఉపదేశాల ననుసరించి, ఆయన చూపిన రాజకీయ నిర్మాణపంథా ననుసరించి మన పార్టీ అభివృద్ధిచెందింది. ఆ పంథాను వ్యతిరేకించినవారి వాదనలు తప్పు అని చరిత్ర రుజువుచేసింది. కామ్రేడ్ మావ్ సారథ్యం క్రింద పనిచేసే కేంద్రకమిటీ నాయకత్వానికి, మార్క్సిస్టు-లెనినిస్టు నాయకత్వానికి, అంతులేని పలుకుబడి ఉంది. ఆ నాయకత్వంక్రింద దీర్ఘకాల పోరాటాల్లో రాటుదేరి మార్క్సిజం - లెనినిజం, మావ్‌సె-టుంగ్ ఉపదేశాలు అనే ఆయుధాన్ని కలిగియున్న కార్యకర్తలు అనేకమంది ఉన్నారు. వారిలో అధికసంఖ్యాకులు కార్మికోద్యమంనుంచి వచ్చినవారే. వారంతా కేంద్రకమిటీ ఆశయాన్ని, కామ్రేడ్ మావ్ లక్ష్యాన్ని సాధించగల సమర్థులు.

3. మన పార్టీ అవలంబించేది శ్రామికవర్గ కార్యక్రమం, శ్రామికవర్గపాలసీ. అందువల్లనే అది చైనాప్రజల సామ్రాజ్యవ్యతిరేక భూస్వామ్య వ్యతిరేక నూతన ప్రజాతంత్ర విప్లవాన్ని సంఘటితపరచి నడపగల్గుతోంది. ప్రస్తుతబూర్జువా ప్రజాతంత్ర విప్లవంలో చైనా కార్మికవర్గం తన కర్తవ్యాలను అత్యధికంగా నెరవేర్చేటట్లు అది చూడగలిగింది. సోషలిజం,

కమ్యూనిజం అనే గమ్యస్థానాన్ని చేరుకొనేందుకు శ్రామికవర్గ నాయకత్వాన్ని ప్రజల కీయఁగలిగింది.

4. ప్రతి సభ్యుడు పార్టీయొక్క శ్రామికవర్గ శిక్షణను పాటించితీరాలి. పార్టీ కార్యక్రమానికి నిబంధనావళికి కట్టుబడి యుంటూ, ఏదో ఒక పార్టీ యూనిట్‌లో పనిచేసేవాడు (యాక్టివ్ వర్కర్)గా ఉండాలి. పార్టీ ఎల్లప్పుడూ సిద్ధాంత, రాజకీయ, నిర్మాణరంగాల్లో ఐక్యతను కాపాడుతూ, శక్తివంత మొనర్చుతూ ఉంటుంది. తన సభ్యత్వంనుంచి పరాయిశక్తుల్నీ, మొండిఘటాలైన అవకాశవాదుల్నీ గెంటివేస్తూ వచ్చింది.

5. షుమారు 20 సంవత్సరాల అంతర్యుద్ధం, జాతీయ సమరం మన పార్టీని గట్టిపరిచాయి. అనేకవేలమంది పార్టీ సభ్యులు తమ వృత్తులను, వ్యాపకాలను కట్టిపెట్టి, చాల కాలం జీవన్మరణపోరాటాల్లో పాల్గొంటూ, సమిష్టిగా విప్లవ సైనిక జీవితంగడిపారు. సిద్ధాంత రంగంలోను, నిర్మాణపద్ధతుల్లోను కఠినసాధనకు, అగ్నిపరీక్షలకు నిలబడ్డారు. తత్ఫలితంగా వారి వర్గచైతన్యం, సమిష్టి మనోబలం హెచ్చాయి. నిర్మాణం యెడల, శిక్షణ యెడల వారికిగల విశ్వాసం బలపడింది. శత్రువుముందు పార్టీ ఐక్యతను పెంపొందించుకోవలసిన అవసరాన్ని వారు చక్కగా గుర్తించారు. కనుకనే ప్రతి పార్టీ సభ్యుడు ఎట్టి మినహాయింపులు లేకుండా కేంద్ర నాయకత్వాన్ని జవదాటకూడదనే విషయాన్ని అర్థం చేసుకున్నాడు. వీటన్నిటివల్ల, అతిక్లిష్టమైన విప్లవ పోరాటాలగమనంలో ఊగిసలాడేవారిని పార్టీ తన సభ్యత్వంనుంచి తొలగిస్తూవచ్చింది.

6. పెటీబూర్జువావర్గనుంచి వచ్చిన పార్టీ సభ్యులు మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాల్లో పరిజ్ఞానాన్ని పొందడం ద్వారా సంస్కరింపబడ్డారు. వారి పెటీబూర్జువా లక్షణాలు తొలగిపోయి, శ్రామికవర్గ లక్షణాలు అలవడ్డాయి.

ఈ విధంగా స్థాపింపబడి, రాటుదేరి, శిక్షణపొందిన మన పార్టీ పెట్టుబడిదారీ దేశాల కార్మికవర్గ పార్టీలకు ఏ విధంగానూ తీసిపోదు.

పార్టీసభ్యుల సాంఘిక పునాదుల్నిబట్టిమాత్రమే అన్ని విషయాలనూ నిర్ణయించలేము. మన పార్టీ సాగించిన రాజకీయ పోరాటాలు, దాని రాజకీయజీవితం, సిద్ధాంత పరిజ్ఞానం, సిద్ధాంత రాజకీయ నాయకత్వం - ఇవీ అన్నిటినీ నిర్ణయించేవి. మన పార్టీయొక్క కార్యక్రమాన్నిబట్టి, నిర్మాణ సూత్రాలను బట్టి పార్టీలో శ్రామికవర్గసిద్ధాంతం, శ్రామికవర్గపంథా ఎంత ప్రాబల్యం వహిస్తున్నాయో తెలుస్తుంది. పార్టీలో పెటీ బూర్జువా సిద్ధాంతాలు ఎంత విస్తృతంగా వ్యాపించినప్పటికీ, వాటిని పార్టీ ఎడతెగకుండా తొలగిస్తూఉంటుంది. విజ్ఞానం ద్వారాను, తైద్ధాంతిక సంస్కరణ ద్వారాను వాటిని సరిదిద్దుతూఉంటుంది. అంతేగాక, అవి ప్రజల ప్రయోజనాల కనుగుణ్యమైనవి కావుగనుక, నిష్ప్రయోజనములని ఋజువయింది.

కొన్ని యూరపియన్ దేశాలలో లేబర్ పార్టీల స్వభావాన్ని వాటి సభ్యుల సాంఘిక పునాదినిబట్టి ఎలా నిర్ణయించలేమో, అలాగే మన పార్టీస్వభావంకూడా పార్టీసభ్యుల సాంఘిక పునాదుల్నిబట్టి ఉండదు. యూరపియన్ దేశాల

లేబర్ పార్టీలలో అత్యధిక సంఖ్యాకులైన సభ్యులు కార్మికులే అయినప్పటికీ, అవి కార్మికవర్గానికి ప్రాతినిధ్యంవహించే రాజకీయ పార్టీలు కావు. కార్మికవర్గంయొక్క కర్తవ్యాలను అవెన్నటికీ నిర్వర్తించలేవు.

అనేకమంది పెటీబూర్జువా విప్లవకారులు మన పార్టీలో చేరారు. ఇది చాల మంచివిషయం. అట్టివారిని పార్టీ నిరాకరించకూడదు. కార్మికుల్లో ఎక్కువ చైతన్యంగలవారిని సభ్యులుగా చేర్చుకోవడంలో మనం చాల శ్రద్ధవహించాలనే మాట వాస్తవమే. కాని కష్టజీవుల్లో అన్ని సెక్షన్లనుంచీ వచ్చిన చైతన్యవంతుల్నికూడా మనం చేర్చుకోవడం అవసరం. అప్పుడే మనపార్టీ ప్రజాస్వభావముగల శక్తివంతమైన పార్టీగా పెంపొందుతుంది. పెటీబూర్జువావర్గానికి చెందినవారిని ఎప్పటికప్పుడు మనలో చేర్చుకోవడంద్వారా శ్రామికవర్గం బలపడుతుంది. ఇదొక చారిత్రకసత్యం.

రైతాంగం, మధ్యతరగతి ప్రజలు స్థిరత్వంలేని, ఎల్లప్పుడూ మార్పుచెందే వర్గాలు. అవి పెట్టుబడిదారీవిధానంలో శిథిలమవుతూ ఉంటాయి. వాటిలో కొద్దిమంది మాత్రం పెట్టుబడిదారీవర్గంలో చేరగలుగుతారు. కాని అత్యధిక సంఖ్యాకులు దివాళాతీసి శ్రామికవర్గంలో కలుస్తారు. రైతాంగం మధ్యతరగతి ప్రజలు ఈ విధంగా పరివర్తన చెందే వర్గాలుగా ఉంటూనే, రాజకీయంగా లిబరల్ బూర్జువావర్గాన్నిగాని, శ్రామికవర్గాన్నిగాని అనుసరించవచ్చు. సిద్ధాంతరీత్యా వారు పెట్టుబడిదారీవర్గంయొక్క లేదా శ్రామికవర్గంయొక్క, ప్రభావాన్ని గుర్తించవచ్చు. అందుచేత కొన్ని ప్రత్యేక చారిత్రక

పరిస్థితుల్లో పెటీ బూర్జువా వర్గంలోని విప్లవశక్తులు పెద్ద యెత్తున శ్రామికవర్గపార్టీలో చేరి, శ్రామిక వర్గ శిక్షణను అంగీకరించవచ్చు. శ్రామికవర్గపార్టీ, అనగా మన పార్టీ శిక్షణద్వారా అట్టివారిని సంస్కరించగలదు.

అట్టివారిలో అధికసంఖ్యాకులు మన పార్టీలో చేరిన తర్వాత శ్రద్ధగా చదివి, మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలనూ, మావ్ సె-టుంగ్ ఉపదేశాలనూ అంగీకరించి, పార్టీశిక్షణకు కట్టుబడియుంటూ ప్రజల విప్లవపోరాటాల్లో పాల్గొంటూ వచ్చారు. గత అనుభవమువల్ల యిది రుజువయింది. ఇలా చేయడంలో వారు తమ పాతలక్షణాలకు స్వస్తిచెప్పి, మార్క్సిస్టు - లెనినిస్టులుగా, శ్రామికయోధులుగా మార్పు చెందారు. వారిలో చాలమంది పార్టీకోసం, చైనాలో కమ్యూనిస్టు సమాజస్థాపనకోసం తమ ప్రాణాలనుసహితం బలి యిచ్చారు.

అయితే, వీరిలో కొద్దిమంది పార్టీలో చేరినతర్వాత మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాలను, మావ్ ఉపదేశాలను త్రికరణశుద్ధిగా, సవ్యమైన మార్గంలో అధ్యయనంచేయలేదు. తమ పాత దృక్పథాలను, కార్యవిధానాన్ని మార్చుకోలేదు; ఒక్కొక్కప్పుడు శ్రామికవర్గ దృక్పథాన్ని, కార్యవిధానాన్ని తీవ్రంగా ఎదుర్కొన్నారు. తమ పెటీబూర్జువా అభిప్రాయాలకు, అభిరుచులకు తగినట్లుగా పార్టీని, దాని ఆంతరంగిక జీవితాన్ని పునర్నిర్మించడానికి ప్రయత్నించారు. ఈ విధంగా వారు సిసలైన మార్క్సిస్టు లెనినిస్టులుగా, శ్రామికయోధులుగా తయారుకాలేకపోయారు. అంతేగాక, పార్టీలో అనేక

పోరబాట్లు జరిగడానికి, అనేక భేదాభిప్రాయాలు తల మెత్తడానికి కారకులయ్యారు.

అందుచేత మన పార్టీలో చేరే వారందరూ శ్రద్ధతో మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలను, మావ్ సే-టుంగ్ చైనా విప్లవ సిద్ధాంతాన్ని అధ్యయనంచేయాలి. ముఖ్యంగా పెటీ బూర్జువా విప్లవకారులు యీ విషయంలో మరింత శ్రద్ధచూపాలి. వారు మన పార్టీలో చేరకముందు, చేరిన తర్వాత తమ పాత సిద్ధాంతాలను సంస్కరించుకోడానికి, తమ పాతవర్గదృక్పథాన్ని విడనాడ్డానికి, శ్రామికవర్గ దృక్పథాన్ని అలవరచుకోడానికి, స్వీయ మానసిక — అహంభావపూరిత — అతివాదపాక్షిక ధోరణులను త్యజించడానికి మరింత కష్టపడి ప్రయత్నించాలి. అట్టి సంస్కారం లేకుండా, వారు మంచి పార్టీసభ్యులుగా తయారు కాలేరు. పూర్తిగా నిద్రనుంచి మేల్కొనని అనేక పెటీబూర్జువా విప్లవకారుల కిదొకతో బాధాకరమైన దీర్ఘకాల పోరాటం. ఇదొక ప్రత్యేక ప్రాముఖ్యతగల సమస్య. పార్టీ నిర్మాణంలో యిది చాల ప్రాధాన్యత వహిస్తుంది.

మన పార్టీలో స్వతస్సిద్ధంగా ఉత్పన్నమయే ప్రధాన వైరుధ్యాలు శ్రామిక - శ్రామికేతర సిద్ధాంతాలమధ్య బయల్దేరేవి. వీటిలో అతిప్రధానమైన వైరుధ్యం శ్రామికవర్గ సిద్ధాంతానికీ, రైతాంగ పెటీబూర్జువా సిద్ధాంతాలకూ మధ్య ఉత్పన్నమవుతుంది. ఈ వైరుధ్యాలను ప్రతి దశలోను పరిష్కరించ గల్గితేనే మన పార్టీ నిర్మాణం, కార్యకలాపాలు అభివృద్ధి చెందుతాయి. ఇందుకు మనం మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాల అధ్యయనాన్ని, సాధనను తీవ్రతర మొనర్చాలి. ఎప్పటి

కప్పుడు పార్టీలో ప్రతిబింబించే పెటీబూర్జువా సిద్ధాంతాలను, యితర శ్రామికేతర సిద్ధాంతాలను ఏరివేస్తూ ఉండాలి. అలా కాకుండా, పార్టీలో పెటీబూర్జువా సిద్ధాంతాలను స్వేచ్ఛగా వ్యాపించనిస్తే, పార్టీ నాయకత్వంలో అయినప్పటికీ ప్రాబల్యం వహించనిస్తే, మన పార్టీ నిర్మాణం, పార్టీ కార్యకలాపాలు తప్పక తిరోముఖం పడతాయి; పతనం చెందుతాయి. అందుచేత నేడు మన పార్టీ నిర్మాణంలో ప్రధానసమస్య సిద్ధాంత సంస్కరణ. అనగా మన పార్టీసభ్యులకు, ముఖ్యంగా పెటీ బూర్జువా విప్లవకారులకు, శ్రామికవర్గ సిద్ధాంతమైన మార్క్సిజం - లెనినిజం సహాయంతో శిక్షణ యివ్వడం. మరోవిధంగా చెప్పాలంటే, పార్టీలో అన్నివిధాలైన శ్రామికేతర సిద్ధాంతాలను ఎదుర్కొని నిర్మూలించడం నేడు మన కర్తవ్యం.

చైనా జనాభాలో పెటీబూర్జువా వర్గంయొక్క సంఖ్య చాలపెద్దది. మన పార్టీసభ్యులలో చాలమంది పెటీబూర్జువా వర్గంనుంచి వచ్చినవారే. గతంలో శ్రామికవర్గం, మనపార్టీ బాల్యావస్థలో ఉండడంవల్ల దానికి అనుభవం బహు తక్కువ. పార్టీస్థాపనకు ముందు మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాల్లో తగినంత పరిజ్ఞానం లేకపోయింది; స్థాపనతర్వాత సిద్ధాంత సమస్యల అధ్యయనానికి తగినంతవ్యవధి లేకపోయింది. ఎందువల్లనంటే కల్లోలపూరితమైన విప్లవపోరాటాల్లో వెంటనే అదీ పాల్గొనవలసి వచ్చింది. ఈ కారణాలవల్ల మనపార్టీ చాలకాలం మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాలను తగినంతగా అధ్యయనం చేయలేకపోయింది. కనుకనే పార్టీలోని పెటీ

బూర్జువా సభ్యులు మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాల ముసుగుతో, సిద్ధాంతరీత్యా అనేకమంది పార్టీసభ్యుల అజ్ఞానాన్ని అవకాశంగాతీసుకొని పచ్చి అవకాశవాద ధోరణులను ప్రచారం చేస్తూవచ్చారు. కనుకనే, కొన్ని దశల్లో పెటీ బూర్జువా సిద్ధాంతాలు తాత్కాలికంగా పైకమిటీలలో పలుకుబడి సంపాదించాయి.

పార్టీ నాయకత్వంలో పెటీబూర్జువా సిద్ధాంతాలెప్పుడైతే పలుకుబడి సంపాదించాయో, అప్పుడు రాజకీయంగానేకాక పార్టీనిర్మాణంలోకూడ మితవాద, "అతివాద" అవకాశవాద ధోరణులు వ్యాపించాయి.

మితవాద అవకాశవాదం కొందరు కామ్రేడ్స్ అనుసరించిన ఉదారవాద ధోరణిలో వ్యక్తమయింది. వీరు మన పార్టీని పెటీబూర్జువా ఉదారవాద పార్టీగా మార్చడానికి ప్రయత్నించారు. సిద్ధాంత విషయాల్లోను, నిర్మాణ సమస్యలపైన ఉండవలసిన కాఠిన్యాన్ని వారు వ్యతిరేకించారు; దాన్ని పూర్తిగా విసర్జించారు. పార్టీ సభ్యుల్ని పెద్దయెత్తున విచక్షణారహితంగా చేర్చుకోవడం, పార్టీలో అనేకరకాలైన అపసవ్యభావాలు వ్యాపిస్తూంటే వాటిని సరిదిద్దకపోవడం, పార్టీ శత్రువులయెడ, విచ్ఛిన్నకులయెడ జాగరూకతతో మెలగకపోవడం, పార్టీలో 'సొంతడబ్బా' కొట్టుకొనే లక్షణాన్ని ప్రోత్సహించడం, శిక్షణారాహిత్యం, ముఠాలుకట్టే ధోరణి, ప్రాప్తకాలజ్ఞత మొదలైనవాటిని బలపరచడం - ఇట్టి పద్ధతులద్వారా వారు పార్టీయొక్క కేంద్రీకృత ప్రజాస్వామ్యాన్ని, ఉక్కు-శిక్షణను

నాశనం చేశారు. దీన్ని కొనసాగనిస్తే, మన పార్టీ ఏమీ చేయగలిగియుండేదికాదు; క్రమంగా పతనమై యుండేది.

ఇక పార్టీ నిర్మాణంలో "అతివాద" అవకాశవాద మెలా వ్యక్తమయిందో చూదాం. కొంతమంది కామ్రేడ్స్ చైనాదేశ పరిస్థితుల్ని విస్మరించారు. పార్టీ నిర్మాణంలో విదేశ పార్టీల అనుభవాల్ని ముక్కీకిముక్కీగా దిగుమతిచేసి వాటిని వేదాక్షరాలుగా చేశారు. పార్టీలో కేంద్రీకృత నాయకత్వానికి, ఆంతరంగిక పోరాటానికి అవసరమైనంతకన్న ఎక్కువ ప్రాముఖ్యత యిచ్చారు. 'ఎట్టి రాజీలు పనికిరావు' అంటూ ముక్కుసూటిగా క్రమశిక్షణను అమలుజరిపారు. ఆంతరంగిక ప్రజాస్వామ్యంగాని, సమిష్టితత్వంగాని, వివిధ సమస్యలపై చర్చలు - విమర్శలుగాని లేకుండాచేశారు. పార్టీ సభ్యుల చొరవను, చైతన్యాన్ని నిరుత్సాహపరిచారు. పెత్తందార్లమాదిరిగా ఫర్మానాలు జారీచేసి, నిరంకుశంగా పరిపాలించ చూచారు.

నాయకుల్ని గుడ్డిగాఅనుసరించేపద్ధతిని వారు ప్రోత్సహించారు. తమతో ఏకీభవించని పార్టీ సభ్యులమీద నిర్దాక్షిణ్యంగా ఆంతరంగిక పోరాటం జరిపి, శిక్షలు విధించారు. పెద్దయెత్తున పార్టీసభ్యుల్ని తొలగించివేశారు. తత్ఫలితంగా పార్టీలో యాంత్రిక డిసిప్లిను, భూస్వామ్య నియంతృత్వం వ్యాపించాయి. ఆంతరంగిక జీవితం స్తంభించింది. ఇట్టి విధానం వల్ల పైకి పార్టీలో ఐక్యత ఏర్పడినట్లు తాత్కాలికంగా కనబడేవి. కాని అది నిజమైన ఐక్యతకాదు. పైకి మాత్రమే కనబడు బూటకపు యాంత్రిక ఐక్యత. ఈ బూటకపు ఐక్యతను

బహిర్గత మొనర్చినప్పుడల్లా పార్టీలో అరాచకత్వం, అప్రజా స్వామ్యం ప్రవేశించాయి. ఇలాంటి పంథావల్ల మనపార్టీ నాశనమవుతుంది; ఒక సంకుచితమైన నిర్జీవమైన సెక్టేరియన్ ముఠాగా అది తయారవుతుంది.

ఈ రెండు పెడమార్గాలు పార్టీ నిర్మాణంలో పెటీ బూర్జువా ఉదారత్వం యొక్క, సెక్టేరియనిజంయొక్క, దుందుడుకు పోకడలయొక్క ప్రతిబింబాలు.

మన పార్టీసభ్యులలో యీ రెండు పెడమార్గాలే కాక మరి కొన్ని లోపాలుకూడా ఉన్నాయి. కొందరిలో సిద్ధాంత, రాజకీయ పరిజ్ఞానం తక్కువ కావడంవల్ల సిద్ధాంత, రాజకీయ సమస్యలకంటె నిర్మాణ సమస్యలకు వారెక్కువ ప్రాధాన్యత యిచ్చారు. తత్ఫలితంగా పార్టీ నిర్మాణమొక నిర్జీవయంత్రంగా తయారయింది. గుడ్డిగా ఉత్తరువులను అమలుజరిపే "నిజాయితీ పరుల్ని" వారు ప్రోత్సహించేవారు. అలాంటివారినే పై కమిటీలకు ప్రమోట్ చేసేవారు. స్వాంతంగా ఆలోచించేవారు, వాక చక్యంగలవారు, గుడ్డిగా అనుసరించనివారు అంటే భయపడే వారు. అట్టివారిని నిందించేవారు. ఇతరుల దైనందిన జీవితానికి సంబంధించిన చిల్లర విషయాలకు అధిక ప్రాధాన్యత యిస్తూ, అసలు సమస్యపై దృష్టిని ప్రసరించేవారు కారు. అనగా సిద్ధాంత, రాజకీయ సమస్యలపై పార్టీసభ్యుల చైతన్యాన్ని వృద్ధిచేయ డానికెట్టి ప్రయత్నం చేసే వారు కారు. ఆ విధంగా పార్టీ నిర్మాణాన్ని పార్టీసభ్యుల డిసిప్లిన్‌ని శక్తివంత మొనర్చేవారు కారు. అంతేగాక పైతరగతి కార్యకర్తల, మధ్య తరగతి కార్యకర్తల చైతన్యాన్ని వృద్ధిచేస్తేగాని యీ ఆశయం సిద్ధించ

దను విషయాన్ని వారు గుర్తించలేదు. కార్మికుల నుంచీ రైతులనుంచీ వచ్చిన సభ్యులమీదనే వారు తమదృష్టిని కేంద్రీకరించేవారు. శక్తివంతులైన మేధావులంటే వారికి భయం.

"నాయకత్వం" వహించే పేరిట సభలు సమావేశాలు జరపడం, ఇక్కడికీ అక్కడికీ పరుగులెత్తడం, అనేక చిల్లర సమస్యలను పరిష్కరించడంలో వారు నిమగ్నులయేవారు; కాని తమ మెదడును మాత్రం ఉపయోగించేవారు కారు. నిర్మాణంలో నాయకులైనవారిని సిద్ధాంత, రాజకీయ నాయకుల స్థాయికి అభివృద్ధి చేయలేకపోయేవారు. తత్ఫలితంగా నిర్మాణ కార్యకలాపాలకూ; సిద్ధాంత, రాజకీయ నాయకత్వానికీ మధ్య అగాధమేర్పడింది. పార్టీనిర్మాణంలో అంధత్వమంటే యిదే. మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీని, శ్రామికవర్గ పార్టీని నిర్మించే పద్ధతి యిది కాదనేవిషయం స్పష్టం. పార్టీలో ప్రవేశించిన అవకాశవాదు లిట్టిపరిస్థితిని చక్కగా వినియోగించుకొన గల్గుతారు.

ఇలాంటి పెడమార్గాలన్నిటినీ మన పార్టీ ఎడతెగకుండా ప్రతిఘటించి నిర్మూలించింది. నిర్మాణం విషయంలో కామ్రేడ్ మావ్ ఉపదేశాలను ముక్తకంఠంతో బలపరిచింది; వాటిని అమలుజరిపింది. కామ్రేడ్ మావ్, పార్టీ నిర్మాణంతోబాటు సిద్ధాంత రాజకీయనాయకత్వానికెంతో ప్రాధాన్యత యిచ్చాడు. మన పార్టీ నాయకత్వంలో సిద్ధాంత పరిజ్ఞానానికి మొదటి స్థాన మివ్వాలని ఆయన పదేపదే నొక్కి చెప్పాడు.

కామ్రేడ్ మావ్ మన పార్టీకోసం ఎంతో సమగ్రమైన రాజకీయ, సైనిక, నిర్మాణ పథకాన్ని తయారుచేశాడు.

1929 లో * జరిగిన క్యూటీన్ సమావేశంలో ఆయనొక తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు.

అందులో వివిధ పెడమార్గాలకు కారణం పార్టీలో ప్రవేశించిన శ్రామికేతర సిద్ధాంతాల ప్రభావమేనని స్పష్టం చేశాడు. పార్టీసభ్యులందరూ వాటిని దిద్దుకోవాలని హెచ్చరించాడు. అంతేకాదు. "త్రైమార్గ సంస్కరణ" అనే పేరుతో పార్టీసభ్యుల చైతన్యాన్ని పెంపొందించేటందుకు, పెటీబూర్జువా సిద్ధాంతాలను నిర్మూలించేటందుకు ఒక ప్రణాళికను తయారు చేశాడు. స్వీయ మానసికతత్వం (సబ్జక్టివిజం), అతివాద పాక్షికతత్వం (సెక్టేరియనిజం), పడిగట్టు పదాల ప్రయోగం (పార్టీజార్గన్) అనే ధోరణులలో ప్రతిబింబించే పెటీబూర్జువా సిద్ధాంతాలను దిద్దుకోవడ మెలాగో తెలియజేశాడు. మార్క్సిజం – లెనినిజం అనే విశ్వమానవ సత్యాన్ని చైనా విప్లవపరిస్థితుల కన్వయించడంద్వారానే మన పార్టీ అభివృద్ధి చెందుతుందని స్పష్టంచేశాడు. పార్టీయొక్క నిర్మాణక్రమానికీ

* 1929 డిసెంబరులో సప్తమ ఎర్రసైన్యంలోని కమ్యూనిస్టుపార్టీ సభ్యులు పశ్చిమ ఫ్యూకీన్ రాష్ట్రంలో క్యూటిన్ అనేచోట 9 వ మహాసభ జరుపుకున్నారు. అది ఎర్రసైన్యంలో వ్యాపించియున్న అనేక శ్రామికేతర పెడమార్గాలను సమీక్షచేసి, కామ్రేడ్ మావ్ సె-టుంగ్ ప్రవేశపెట్టిన తీర్మానాన్ని ఆమోదించింది. ఆ మహాసభ చారిత్రకంగా ఎంతో ప్రాధాన్యత వహించింది. కారణమేమంటే, చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం క్రింద పోరాడేసైన్యాన్ని యుద్ధ ప్రభువుల, పెటీ బూర్జువా వర్గాల పెడమార్గాల నుంచి కాపాడింది. కామ్రేడ్ మావ్ నాయకత్వాన అది ఎర్రసైన్యాన్ని ప్రజలతో సన్నిహిత సంబంధంగల, శ్రామికవర్గ సిద్ధాంతంగల సుశిక్షిత సైన్యంగా అభివృద్ధి చేసింది.

రాజకీయపంథాకూ గల సన్నిహితసంబంధాన్ని తెలియజేశాడు. పెట్టుబడిదారీవర్గంయెడల, సాయుధ పోరాటం యెడల మన పార్టీ అవలంబించే విధానానికీ, నిర్మాణ క్రమానికీ గల సంబంధాన్నికూడా ఆయన వివరించాడు.

కామ్రేడ్ మావ్ రచించిన "పార్టీలో అపసవ్య భావాల సంస్కారం", "నూతనదశ" అనే కరపత్రంలో రెండవ భాగం, "కమ్యూనిస్టు" అనే పత్రికను పరిచయం చేస్తూ వ్రాసినవ్యాసం, "అధ్యయన పద్ధతిని సంస్కరించుకునే పద్ధతి", "పార్టీయొక్క కార్యవిధానంలో మార్పు తేవాలి", "పడిగట్టు పదాల ప్రయోగంపై విమర్శ", త్రైమార్గ సంస్కరణను పెంపొందించడానికి కేంద్రకమిటీ చేసిన నిర్ణయాలు (1943 ఏప్రిల్), "నాయకత్వ పద్ధతికి సంబంధించిన కొన్ని సమస్యలు" (1943 జూన్) మొదలైన వాటిలో పార్టీ నిర్మాణ మెలా ఉండాలో తెలియ జేశాడు. మన పార్టీయొక్క ప్రత్యేక లక్షణాలను ఆయన దృష్టిలో ఉంచుకొని పార్టీ పంథాను రూపొందించాడు. ఆ మార్గ మవలంబించడంవల్లనే మనం పార్టీ నిర్మాణంలో అన్నివిధాలైన అపసవ్య పద్ధతుల్నీ, అవకాశ వాదాన్నీ నిర్మూలించగలిగాం. తత్ఫలితంగా మన పార్టీ బ్రహ్మాండంగా అభివృద్ధిచెంది అనేక విజయాలను సాధించింది.

పార్టీ నిర్మాణంలో పై పెడమార్గాలనే కొనసాగించి యున్నట్లయితే, కార్మికుల సంఖ్య పార్టీలో ఎంత ఎక్కువగా ఉన్నప్పటికీ అది కార్మికవర్గ పార్టీగా పెంపొందేది కాదు. నేడు మన పార్టీలో కార్మికులు అధిక సంఖ్యాకులుగా లేనప్పటికీ, కామ్రేడ్ మావ్ నిర్మాణసూత్రాలను అనుసరించడంవల్ల

దాన్ని నిజమైన కార్మికవర్గ పార్టీగా, మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీగా నిర్మించగలిగాం.

మన పార్టీలో ప్రధాన సెక్షన్లు చాలాకాలంనుంచీ గ్రామసీమల్లోనే ఉంటున్నాయి. ఇందుకు కారణ మేమంటే: చైనా అర్థవలస, అర్థఫ్యూడల్ దేశం కావడంవల్ల ప్రస్తుత విప్లవంలో రైతాంగ ప్రజాసామాన్యమే ప్రధానశక్తిగా ఉంటుంది. కార్మిక వర్గం చిరకాలంగా పీడింపబడుతూ, పట్టణాలలో బహిరంగ విప్లవ కార్యకలాపాల్లో పాల్గొనజాలక, గ్రామసీమల్లోని మిత్ర బృందాన్ని సంఘటిత పరచడానికి తన అగ్రదళాలను పంపుతూ వచ్చింది. సరియైన సమయంలో పట్టణాలను విముక్తి చేయడానికి వారు తోడ్పడతారని అది గుర్తించింది. మన పార్టీ చాలాకాలంగా గ్రామసీమల్లో చేస్తూవచ్చిన పనికి అర్థమిదే. చైనాదేశ ప్రత్యేకపరిస్థితుల్లో మనపార్టీ యీ విధంగానే కార్మికవర్గానికి ప్రాతినిధ్యం వహించగల్గుతుంది. కార్మికవర్గ కర్తవ్యాలను నెరవేర్చగల్గుతుంది. మరోవిధంగా అది చేసియుంటే చైనా కార్మికవర్గానికది ప్రాతినిధ్యం వహించగలిగేదికాదు. కారణమేమంటే, ప్రస్తుత చైనావిప్లవం ప్రధానంగా రైతాంగవిప్లవం. చైనా రైతాంగాన్ని విముక్తి చేయడమే చైనా కార్మికవర్గంయొక్క ప్రధాన తక్షణ కర్తవ్యం. కార్మికవర్గపార్టీ నాయకత్వాన చైనాలో సాగుతున్న రైతాంగ పోరాటం, చైనాదేశ చరిత్రలో జరిగిన రైతాంగ పోరాటాలన్నిటివంటిదికాదు. అది విజయాన్నికూడా సాధించగలదు. అందువల్ల మనపార్టీ కార్మికవర్గానికి అగ్రగామిగా ఉంటూ

చాలకాలం గ్రామసీమల్లో రైతాంగవిప్లవాన్ని అర్ధనైజుచేసే నడపడంలో తన యావచ్ఛక్తిని వినియోగించవలసి యుంటుంది.

చైనా జాతియొక్క, చైనా ప్రజలయొక్క ప్రయోజనాలను మనపార్టీ కాపాడుతుందని పార్టీ కార్యక్రమం పేర్కొంటూంది. నిజానికి యిదే మన పార్టీయొక్క, మావ్ చైనా విప్లవ సిద్ధాంతంయొక్క సారాంశం. చైనాకార్మికవర్గ ప్రయోజనాలూ, చైనా ప్రజల ప్రయోజనాలూ ఎప్పుడూ ఒకటే. మన పార్టీ సామ్రాజ్యవాదానికీ భూస్వామ్య విధానానికీ వ్యతిరేకంగా సాగిస్తున్న నూతన ప్రజాస్వామ్య విప్లవం కార్మిక ప్రయోజనాలనే కాకుండా, రైతాంగప్రయోజనాలను, మధ్యతరగతుల ప్రయోజనాలను, పెట్టుబడిదారుల ప్రయోజనాలను కూడా కాపాడుతుంది. చైనా కమ్యూనిస్టుపార్టీ తన వర్గంయొక్క తక్షణ, పాక్షిక ప్రయోజనాలకై మాత్రమేకాక ప్రజలందరి ప్రయోజనాలకై పోరాడగల్గినప్పుడే, మొత్తం చైనా జాతినంతటినీ, చైనా ప్రజలందరినీ పోరాటంలో సంఘటితపరచి ఐక్యపరచి నప్పుడే – విజయాన్ని సాధించగల్గుతుంది. కార్మిక వర్గం ప్రజలందరినీ విముక్తి చేయనిదే తన్నుతాను విముక్తి చేసుకోలేదు.

మరోవైపు చైనా కార్మికులు, కష్టజీవులు కలిసి చైనా జాతిలో ప్రధానభాగంగా ఉన్నారు. వారి ప్రయోజనాలే చైనా ప్రజల ప్రయోజనాలకు పునాది. ఐక్య, స్వతంత్ర, ప్రజాతంత్ర, సుభిక్ష చైనాను నిర్మించడంకోసం పోరాడ్డంద్వారా చైనా కమ్యూనిస్టుపార్టీ చైనా జాతియొక్క, చైనా ప్రజలయొక్క, చైనా కార్మికవర్గంయొక్క ప్రయోజనాలను కాపాడ గల్గు

తుంది. ఇదే భవిష్యత్తుకుకూడా వర్తిస్తుంది. భవిష్యత్తులో మన పార్టీ సోషలిజాన్ని, కమ్యూనిజాన్ని సాధిస్తుంది. ఎందుచేతంటే, సోషలిస్టు-కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించడమంటే అర్థం చిట్టచివరకు మానవజాతినంతటినీ విముక్తి చేయడం.

2. పార్టీయొక్క మూల సిద్ధాంతం.

చైనా కమ్యూనిస్టుపార్టీ నత యానత్తు పనినీ మావ్ చైనా విప్లవ సిద్ధాంతంద్వారా — అంటే మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతాలను చైనా విప్లవ పరిస్థితుల కన్వయించడం ద్వారా — నడుపుతుందని పార్టీ కార్యక్రమం పేర్కొంటూంది. ప్రాచీన సాంప్రదాయాలయెడ మన వైఖరి ఏమంటే, అవి చైనా సాంప్రదాయాలైనా, విదేశ సాంప్రదాయాలైనా సరే — విచక్షణ చూపకుండా వాటిని మనం స్వీకరించం, తిరస్కరించం. మార్క్సిస్టు గతితార్కిక భౌతికవాదాన్ని, చారిత్రక భౌతికవాదాన్ని ఆధారం చేసుకొని విమర్శనా దృష్టితో విలువైన వాటినీ ఉపయోగించేవాటినీ స్వీకరిస్తాం; విలువలేని వాటినీ ఉపయోగించని వాటినీ తిరస్కరిస్తాం.

ఇంతవరకు స్పష్టమే. ఇక వివరించవలసింది మావ్ చైనావిప్లవసిద్ధాంతం.

మన పార్టీ కార్యకలాపా లన్నిటికీ ఈ సిద్ధాంతమే మార్గదర్శి అని కార్యక్రమం చెబుతోంది. ప్రతి పార్టీసభ్యుడు మార్క్సిస్టు-లెనినిస్టు మూల సిద్ధాంతాలను, మావ్ చైనా విప్లవ సిద్ధాంతాన్ని అర్థంచేసుకోడానికి ప్రయత్నించాలని పార్టీ నిబంధనావళి చెబుతోంది. నిబంధనావళిలో సూచింపబడిన యీ మార్పు చారిత్రక ప్రాధాన్యతగలది. ఈ నిబంధ

నను పార్టీ మహాసభ, మొత్తం పార్టీసభ్యులు హృదయ పూర్వకంగా అంగీకరిస్తారని నమ్ముతున్నాను.

చైనా జాతి, చైనా ప్రజలు షుమారు వందసంవత్స రాల కాలం చెప్పశక్యంకాని బాధలు అనుభవించారు. తమ విముక్తికోసం వారు సాగించిన పోరాటాల్లో అమూల్యమైన అనుభవాలు సంపాదించారు. వారి ప్రత్యక్ష పోరాటాలు, ఆ పోరాటాల్లో వారు సంపాదించిన అనుభవాలు అనివార్యంగా కొన్ని గొప్ప సిద్ధాంతాలను సృష్టించాయి. నిజానికవి వారి సొంత సిద్ధాంతాలు. ఈ విధంగా చైనా ప్రజలు వీరోచితంగా పోరాడగల శక్తినేగాక, అధునాతనమైన ఒక శాస్త్రీయవిప్లవ సిద్ధాంతాన్నికూడా కలిగియున్నారని అవి రుజువు చేశాయి. మన దేశంలో పెట్టుబడిదారీవర్గం రాజకీయంగాను, ఆర్థికంగాను బలమైనది కాక పోవడంచేత, దానికి ప్రజలతో సంబంధాలు లేకపోవడం చేత, దాని దృక్పథమూ ఆలోచన సంకుచిత మవడంచేత, దాని నాయకులు పరిమితమైన విప్లవ కార్య క్రమాన్ని మాత్రమే, పరిమితమైన ప్రజాతంత్రభావాలను మాత్రమే యివ్వగలిగారు. వాటిలోని మంచి విషయాలను మన మిదివరకే స్వీకరించాం. అయితే వారొక క్రమబద్ధమైన విప్లవ సిద్ధాంతాన్ని ఇవ్వలేక పోయారు. చైనాదేశ చరిత్రకు, చైనా విప్లవానికి అన్వయించే సమగ్ర శాస్త్రీయ సిద్ధాంతాన్ని అసలే యివ్వలేకపోయారు. కార్మికవర్గ ప్రతినిధులు మాత్రమే అట్టి సిద్ధాంతాన్ని యివ్వగలవారు. అట్టివారిలో కామ్రేడ్ మావ్ అందరికంటె గొప్పవాడు.

చైనా కమ్యూనిస్టుపార్టీ స్థాపింపబడినతర్వాత ప్రజా విప్లవాన్ని గురించి, చైనాలో జాతీయ పునర్నిర్మాణాన్ని గురించి ఒక అద్భుతమైన, సమగ్రమైన, శాస్త్రీయ సిద్ధాంతం బయలుదేరి అభివృద్ధి చెందిం దనేవిషయాన్ని యీ మహాసభ గుర్తించాలి. దాన్ని హృదయపూర్వకంగా ఆహ్వానించాలి. ఈ సిద్ధాంతనే మన పార్టీని, ప్రజలను గొప్ప విజయాలవైపు నడిపింది. అంతిమవిజయం, సంపూర్ణవిముక్తికూడా లభించే టట్లు మన పార్టీని, ప్రజలను నడపగలిగేది అదే. అనేక దీర్ఘకాల పోరాటాల్లో మన పార్టీ, మనప్రజలు సాధించిన మహోన్నతవిజయం, అత్యున్నతప్రతిభ ఇదే. ఇది మన జాతికి తరతరాలుగా ఖ్యాతిని సంపాదిస్తుంది. ఇదే కామ్రేడ్ మావ్ తయారుచేసిన చైనా విప్లవసిద్ధాంతం. చైనా దేశ చరిత్రకు, చైనా సమాజానికి, విప్లవానికి సంబంధించిన సిద్ధాంతం యిది.

చైనా విప్లవాన్ని గూర్చిన మావ్-సె-టుంగ్ సిద్ధాంతం చైనా విప్లవ అనుభవంతో మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలను సమైక్యపరుస్తుంది. చైనా పరిస్థితుల కనుగుణ్యమైన కమ్యూనిజం, మార్క్సిజం అంటే యిదే.

ప్రస్తుత దశలో ఒక వలస, అర్ధవలస, అర్ధఫ్యూడల్ దేశంలోని జాతీయ ప్రజాతంత్ర విప్లవానికి సంబంధించినంత వరకు మావ్ చైనా విప్లవ సిద్ధాంతం మార్క్సిజాన్ని ముందుకు తీసుకెళ్ళింది. ఒక ప్రత్యేక జాతికి అన్వయించే మార్క్సిజం యిందులో వ్యక్తమవుతూంది. చైనాజాతి, చైనా ప్రజలు సాగించిన దీర్ఘకాల విప్లవపోరాటాల్లో, మూడు పెద్ద విప్లవ

సమరాల్లో (ఉత్తర దేశయాత్ర, వ్యవసాయ విప్లవం, ప్రస్తుత జపాన్ వ్యతిరేక ప్రతిఘటనోద్యమం) అది ఉద్భవించి అభివృద్ధి చెందింది. అది చైనా కెంత సన్నిహితమైనదో, మార్క్సిజానికి కూడా అంత సన్నిహితమైనది.

గతితార్కిక భౌతికవాదమనే మార్క్సిస్టు ప్రపంచ దృక్పథంద్వారాను, చారిత్రక భౌతికవాదమనే మార్క్సిస్టు సామాజిక దృక్పథంద్వారాను యిది రూపొందింపబడింది. మరోవిధంగా చెప్పాలంటే, చైనా జాతియొక్క విశిష్టలక్షణా లను దృష్టిలోఉంచుకోవడంద్వారా, ఆధునిక విప్లవాలయొక్క అమూల్యానుభవాలనుంచి పాఠాలు నేర్చుకోవడంద్వారా, చైనా ప్రజల విప్లవ పోరాటాన్ని నడపడంలో కమ్యూనిస్టు పార్టీ సంపాదించిన అనుభవాలను అధ్యయనంచేయడంద్వారా అది మార్క్సిస్టు—లెనినిస్టు సిద్ధాంతాల బలీయమైన పునాదిపై నిర్మింపబడింది. చైనా జాతిని, చైనా ప్రజల్ని విముక్తి చేయ డానికి తోడ్పడే సిద్ధాంతం అది. మార్క్సిజం - లెనినిజం అనే శాస్త్రీయపద్ధతిని అన్వయించడంద్వారా, చైనాదేశచరిత్రనూ సామాజిక పరిస్థితుల్నీ విప్లవ అనుభవాలనూ సమన్వయ పరచడంద్వారా అది శ్రామికవర్గప్రయోజనాల ప్రాతిపదికపై, అంటే ప్రజలందరి ప్రయోజనాల ప్రాతిపదికపై అభివృద్ధి చెందింది. చైనా కార్మికవర్గం, కష్టజీవులు విముక్తి కొరకు సాగించే పోరాటాన్ని నడపాలంటే సరియైన సిద్ధాంతం, పాలసీ యిదొక్కటే.

మావ్ చైనా విప్లవసిద్ధాంతం - చైనాదేశానికి వర్తించే కమ్యూనిస్టు సిద్ధాంతం, కమ్యూనిస్టు ఆచరణ - జాతీయ

అంతర్జాతీయ శత్రువులకు వ్యతిరేకంగా జరిగిన విప్లవపోరాటాల గమనంలోనేగాక, పార్టీలో వివిధ పొరబాటు అవకాశవాద భావాలకు వ్యతిరేకంగా జరిగిన సిద్ధాంత పోరాటాల గమనంలో కూడ అభివృద్ధిచెందింది. అంటే చెన్-తూ-సియూయిజం *, లి-లీ-సాన్ పంథా ♦ ఆతర్వాత బయల్వెడలిన "అతివాద" పెడమార్గాలు, లొంగుబాటు ధోరణులు, పిడివాద పోకడలు, స్వీయానుభవ ధోరణులు – ఇట్టి అవకాశవాద ధోరణులక్రిందకే వస్తాయి. కామ్రేడ్ మావో సిద్ధాంతమే పార్టీని సరిగా నడపగల సిద్ధాంతం, పాలసీ.

---

* 1921-27 మధ్య కాలంలో చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి చెన్-తూ-సియూ యొక్క మితవాద అవకాశవాద పంథా. శ్రామిక వర్గ నాయకత్వాన్ని వదులుకోవాలని వీరుకోరారు. ఆవిధంగా, పెట్టుబడిదారీ వర్గంతో కలియడానికి కార్మిక - కర్షక ప్రజా సామాన్యం యొక్క ప్రయోజనాలకు స్వస్తి చెప్పడం వీరి ఉద్దేశం. 1927 లో చైనా విప్లవానికి ద్రోహం జరిగిన తర్వాత, చెన్.తూ-సియూ 'లిక్విడేటరు'గా తయారయాడు. (అంటే పార్టీయొక్క నాయకత్వ పాత్రను విసర్జించడం). చివరకు చెన్-తూ-సియూ చైనా ట్రాట్‌స్కీ-స్టులతో చేతులు కలిపి, బాహాటంగా ద్రోహి అయాడు.

♦ కామ్రేడ్ లి-లీ-సాన్ చేబట్టిన "అతివాద" అవకాశవాద పంథా. దీని ప్రత్యేక లక్షణ మేమంటే: పోరాటంలో పాల్గొనే ఉభయపక్షాల బలాబలాలను సరిగా అంచనా వేయవలసిన అవసరాన్ని గాని, ప్రజలు పాల్గొనే ప్రతి విప్లవ చర్యలో వివిధ వర్గాల మధ్య గల సంబంధాలను గాని యిది గుర్తించ నిరాకరిస్తుంది. ఆనాడు శత్రువుయొక్క క్రూర నిర్బంధ విధానానికి లోనయ్యే ప్రధాన నగరాల్లో సాయుధ తిరుగుబాట్లు తీసుకురావాలని లి-లీ-సాన్ వాదించేవాడు. తర్వాత లి-లీ-సాన్ తన పొరబాట్లను అంగీకరించి, సరిదిద్దుకున్నాడు.

మావ్ సిద్ధాంతంయొక్క పుట్టుక, అభివృద్ధి, పరిపక్వత 24 సంవత్సరాలచరిత్ర గలది. అనేక లక్షలమంది ప్రజలు సాగించిన అసంఖ్యాకమైన పోరాటాల్లో పదేపదే అన్ని పరీక్షలకూ అది నిలిచింది. ఇదే వాస్తవసత్యమనీ, చైనాను కాపాడగల సరియైన సిద్ధాంతం, పాలసీ ఇదేననీ రుజువయింది. విప్లవం మావ్ నాయకత్వాన, ఆయన సిద్ధాంతంప్రకారం నడచినప్పుడల్లా జయించి పురోగమించింది; దాన్నుంచి దూరమైనప్పుడల్లా ఓడిపోవడమో, తిరోగమించడమో జరిగింది.

సామ్రాజ్యవాదశకంలో, రష్యా విప్లవ అనుభవమనే ప్రాతిపదికమీద, మార్క్సిస్టు సిద్ధాంతాన్ని శ్రామిక విప్లవ ఆచరణతో సమన్వయ పరచిన ఫలితంగా బోల్షివిజం లేక లెనినిజం—స్టాలినిజం లభించింది. కమ్యూనిజానికి రష్యాచేసిన సహాయ మిది. రష్యన్ ప్రజలు సంపూర్ణ విముక్తిని సాధించడంలో యిది వారికి మార్గదర్శిగా ఉపయోగపడింది.

అంతేగాక ప్రపంచ ప్రజలు తమ విముక్తికై జరిపే పోరాటాలలోకూడ యిది మార్గదర్శిగా ఉపయోగపడింది. అదే విధంగా కామ్రేడ్ మావ్-సె-టుంగ్ మార్క్స్-ఎంగెల్స్ లెనిన్-స్టాలిన్‌ల శిష్యుడుగా మార్క్సిస్టు సిద్ధాంతాన్ని చైనా విప్లవ ఆచరణతో జోడించాడు. ఆవిధంగా కమ్యూనిజానికి సహాయం చేశాడు.

ఇదే మావ్ చైనా విప్లవసిద్ధాంతం. ఈ సిద్ధాంతమే చైనాప్రజలు సంపూర్ణవిముక్తికై సాగించే పోరాటంలో మార్గదర్శిగా ఉపయోగపడింది; ఇప్పటికీ ఉపయోగపడుతోంది. అన్ని దేశాల ప్రజలు, ముఖ్యంగా ప్రాచ్యదేశాల ప్రజలు,

స్వాతంత్ర్యంకోరకు జరిపే పోరాటానికి అది గొప్ప విలువైన సహాయం చేస్తుంది.

మావ్ రూపొందించిన చైనా విప్లవసిద్ధాంతం, ఆయన ప్రపంచదృక్పథం, కార్యవిధానం చైనాపరిస్థితుల కన్వయించే విధంగా మార్క్సిజాన్ని అభివృద్ధిపరచడం తప్ప వేరుకాదు. అది చైనా ప్రజల విప్లవానికీ, జాతీయ పునర్నిర్మాణానికీ సంబంధించిన మూలసిద్ధాంతం. ఇది మావ్ రచనల్లోను, మనపార్టీ సాహిత్యంలోను కనిపిస్తుంది. ప్రపంచపరిస్థితిని గురించి, చైనా దేశ ప్రత్యేక పరిస్థితుల్నిగురించి ఆయనచేసిన పరిశీలనలన్నీ వాటిలో ఉన్నాయి. నూతన ప్రజాస్వామ్యం, విప్లవ జాతీయైక్య సంఘటన, రైతాంగ విముక్తి, విప్లవ స్థావరాలు, నూతనప్రజాతంత్ర ప్రభుత్వ స్థాపన, పార్టీనిర్మాణం, సంస్కృతి– వీటిని గురించి ఆయన తయారుచేసిన సిద్ధాంతం, పాలసీ అందులో వ్యక్తం చేయబడ్డాయి. ఈ సిద్ధాంతం, పాలసీ మార్క్సిజానికెంత సన్నిహితమో చైనాకంత సన్నిహితం. చైనా ప్రజల మహోన్నత మేధాసంపత్తి, సిద్ధాంత పరిజ్ఞానం అందులో యిమిడిఉంది.

చైనా దేశ సామాజిక చారిత్రకాభివృద్ధిలో కొన్ని ప్రత్యేక లక్షణాలుండడంవల్ల, శాస్త్రాభివృద్ధిలో అది వెనుకబడి యుండడంవల్ల, మార్క్సిజాన్ని క్రమబద్ధంగా చైనాకు వర్తింపజేయడం, దాని యూరపియన్ తొడుగును తీసివేసి చైనా తొడుగు తొడగడం ఎంతో కష్టసాధ్యమైన పని. మరో విధంగా చెప్పాలంటే, చైనా విప్లవానికి సంబంధించిన అనేక సమస్యలను మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించడం, వాటిని

మార్క్సిస్టు పద్ధతిలో పరిష్కరించడం చాలకష్టం. ఈసమస్యల్లో అనేక వాటిని ప్రపంచ మార్క్సిస్టు సిద్ధాంత వేత్తలు ప్రజల ముందుంచడం గాని, వాటిని పరిష్కరించ పూనుకోవడం గాని చేయలేదు. ఎందుచేతంటే, చైనా జనసామాన్యంలో ప్రధాన సెక్షన్లు రైతాంగమేగాని కార్మికవర్గం కాదు; ప్రజల పోరాటం విదేశ సామ్రాజ్య వాదులమీద, భూస్వామ్య అవశేషాల మీదనే గాని దేశీయ పెట్టుబడిదారీ వర్గంమీద కాదు.

పై లక్ష్యాన్ని మనం సాధించాలంటే, కొందరు భావి స్తూన్నట్లు మార్క్సిస్టు గ్రంథాలను వల్లెవేసి ఒప్పజెప్పడంవల్ల కాదు. వాటిలోని వాక్యాలను పునశ్చరణ చేయడంకూడా నిష్ప్రయోజనం. అత్యున్నతమైన శాస్త్రీయ దృక్పథాన్ని విప్లవ చైతన్యంతో మేళవించడంవల్లనే యిది సాధ్యం. ఇందుకు ఎంతో చారిత్రక, సామాజిక విషయ పరిజ్ఞానం ఉండాలి. విప్లవ పోరాటాలను నడపడంలో బోలెడు అనుభవం ఉండాలి. భౌతిక పరిస్థితులనూ వాటి పరిణామాన్నీ, శాస్త్రీయదృక్ప థంతో పరిశీలించేటప్పుడు మార్క్సిస్టు - లెనినిస్టు పద్ధతిని చాక చక్యంగా ఉపయోగించగలగాలి. అంతేకాదు. శ్రామికవర్గం పట్ల, ప్రజాసామాన్యంపట్ల అంతులేని వినయ విధేయత లుండాలి. ప్రజల బలంలో, వారి సృజనాత్మకశక్తిలో, వారి భవిష్యత్తులో విశ్వాసం ఉండాలి. ప్రజల అనుభవాల్నీ మనో వాంఛల్నీ భావాలనూ క్రోడీకరించడంలో, వాటిని క్రియా రంగంలో అన్వయించడంలో నైపుణ్యం ఉండాలి. ఇన్ని ఉంటేనే, చైనాదేశపు చారిత్రక పరిణామదశలోను, ఆయా ఆర్థిక రాజకీయ పరిస్థితులకు తగినట్లు మార్క్సిజం- లెనినిజం

అనే పెన్నిధికి నూతన సంపదను చేర్చడం సాధ్యం. ఇట్టి విధాన మవలంబించడం వల్లనే మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతా లను సులభమైన భాషలో, చైనా ప్రజలందరికీ అర్థమయే విధంగా చెప్పడం, నూతనచారిత్రక పరిసరాలకూ చైనా ప్రత్యేక పరిస్థితులకూ దాన్ని అన్వయించడం, చైనాకార్మికుల, కష్టజీవుల పోరాట సాధనంగా దాన్ని ఉపయోగించడం సాధ్యమైంది.

ఈ కష్టసాధ్యమైన పనిని, చైనాకు మార్క్సిజాన్ని అన్వయించే మహాత్కార్యాన్ని జయప్రదంగాను, అద్భుతం గాను సాధించినది మన కామ్రేడ్ మావ్-సె-టుంగ్ తప్ప మరొకరు కాదు. ఇది ప్రపంచ మార్క్సిస్టు ఉద్యమ చరిత్రలో ఒక అద్భుతమైన కార్యం. మార్క్సిజం అనే పరమోత్కృష్ట మైన విశ్వమానవ సత్యాన్ని అతడు 47½ కోట్ల ప్రజలు గల చైనా దేశంలో అద్వితీయంగా అభివృద్ధిచేశాడు. ఇందుకు మన మెంతో కృతజ్ఞులమై యుండాలి.

కామ్రేడ్ మావ్ చైనాదేశ చరిత్రలో అందరికంటే గొప్ప విప్లవకారుడు, రాజనీతిజ్ఞుడు మాత్రమేకాక, అందరి కంటే గొప్ప సిద్ధాంతవేత్త, శాస్త్రజ్ఞుడు. ప్రపంచాన్నంతటినీ ఊపివేసిన మహాపోరాటాల్లో చైనా పార్టీనీ, మొత్తం చైనా ప్రజల్నీ నడపడమేకాక, మహోన్నతమైన సిద్ధాంత పరిజ్ఞా నాన్ని, నైతికసాహసాన్ని కూడ ఆయన ప్రదర్శించాడు. చైనా పరిస్థితులకు పనికిరాని కొన్ని మార్క్సిస్టు సూత్రాలను, నిర్ధారణలను ఆయన ధైర్యంతో త్రోసిపుచ్చాడు; వాటిస్థానే చైనాదేశపు నూతన చారిత్రక పరిస్థితులకు సరిపడ్డ కొత్త

సిద్ధాంతాలను, నిర్ధారణలను ప్రవేశపెట్టాడు. మార్క్సిజాన్ని చైనా పరిస్థితుల కన్వయించేకష్టసాధ్యమైన, మహోన్నతమైన పనిని ఆయన జయప్రదంగా సాధించ గల్గడానికి కారణ మిదే.

మనకు తగినంత సిద్ధాంతపరిజ్ఞానం లేకపోవడంచేత, పార్టీలో అనేకమందిసభ్యులు ఎన్నోకష్టాలకు లోనయ్యారు. త్రోవతెలియక ఎన్నో అనవసరమైనచిక్కుల్లో యిరుక్కునే వారు. కాని యిప్పుడు కా(మ్రేడ్ మావ్ సృజనాత్మక కృషి ఫలితంగా మన పార్టీకి, చైనాప్రజలకు గట్టి సిద్ధాంతపునాది ఏర్పడింది. తత్ఫలితంగా వారిలో ఆత్మవిశ్వాసం, పోరాటశక్తి వేయిరెట్లు పెరుగుతుంది; చైనావిప్లవం విజయంవైపు మరింత వేగంగా పురోగమిస్తుంది. అందుచేత, నేటి ప్రధానకర్తవ్యం మావ్ చైనా విప్లవసిద్ధాంతాన్ని పార్టీసభ్యులందరూ అధ్యయనంచేసి, దాన్ని విస్తరింపజేయడం; ఈ గొప్ప ఆయుధాన్ని పార్టీసభ్యులకు, విప్లవ ప్రజాసామాన్యానికి అందజేయడం. అప్పుడది ఒక సజీవమైన, అజేయమైన శక్తిగా తయారవు తుంది. ఇందుకు అన్ని పార్టీస్కూళ్ళలోను, అధ్యయన తరగ తుల్లోను మావ్ రచనలను ప్రమాణగ్రంథాలుగా తీసుకొని బోధించాలి. కార్యకర్తలందరూ వాటిని క్రమబద్ధంగా అధ్యయనం చేయాలి. పార్టీ పత్రికలన్నీ మావ్ చైనావిప్లవ సిద్ధాంతాన్ని క్రమబద్ధంగా ప్రచారంచేయాలి. మన ప్రచార శాఖలన్నీ మావ్ ముఖ్యరచనలను సామాన్య పార్టీసభ్యుల కర్థమయేవిధంగా కూర్చి ముద్రించాలి.

పార్టీలో మనోవికాసాన్ని అరికట్టే వితండవాదాన్ని మనం నిర్మూలించ గలిగాం. ఇక పార్టీలోని స్వీయానుభవ

వాదం (Empiricism) అనే అడ్డంకినికూడా నిర్మూలించడానికి మరింతగా కృషిచేయవలసియుంది; పార్టీ సభ్యులందరూ మావ్ చైనా విప్లవసిద్ధాంతాన్ని అధ్యయనం చేసేటట్లు మన మొక ఉద్యమాన్ని ప్రారంభించాలి. అప్పుడు మనపార్టీలో బ్రహ్మాండమైన మార్క్సిస్టు విజ్ఞానవెల్లువ పొంగుకొస్తుంది. దీని అర్థం, చైనాలో ప్రజావిప్లవవిజయానికి అవసరమైన సన్నాహాలన్నీ సిద్ధాంతరంగంలో చేసుకోవడ మన్నమాట.

మావ్ చైనా విప్లవసిద్ధాంతం మన పార్టీయొక్క నూతన నిబంధనావళికి, కార్యక్రమానికి పునాది. దాన్ని అధ్యయనం చేయడం, ఇతరులకు బోధించడం, దాన్ననుసరించి పనిచేయడం పార్టీసభ్యులందరి కర్తవ్యం.

### 3. చైనా విప్లవంయొక్క లక్షణాలు

నేడు చైనా సమాజం అర్ధవలస, అర్ధఫ్యూడల్ స్వభావాన్ని కలిగియుందని పార్టీకార్యక్రమం పేర్కొంటూంది. అయితే, దాదాపు పదికోట్ల ప్రజలు నివసించే విముక్త ప్రాంతం నూతన ప్రజాస్వామ్య లక్షణాలను కలిగియుంది. దీన్నిబట్టి నేడు మన చైనా సమాజం ఆర్థికంగాను, రాజకీయంగాను ఎంతక్లిష్టంగా, వ్యత్యాసాలతో నిండి ఉందో అర్థం చేసుకోవచ్చు.

ఇట్టి స్వభావం గల సమాజం చైనాలో ఉండడంవల్ల, శక్తివంతమైన కమ్యూనిస్టు పార్టీ పని చేస్తుండడంవల్ల, ప్రస్తుత ప్రపంచ పరిస్థితులు అనుకూలంగా ఉండడంవల్ల, శ్రామికవర్గ నాయకత్వానరై తాంగమే ప్రధాన శక్తిగా గల ప్రజా బాహుళ్యం విప్లవానికి చోదకశక్తి అవడంవల్ల —

చైనా విప్లవం అటు పాతరకపు బూర్జువా ప్రజాస్వామ్య విప్లవమూ కాజాలదు; నవ్యాతి నవ్యమైన శ్రామికవర్గ సోషలిస్టు విప్లవమూ కాజాలదు. ఇదొక కొత్తరకపు బూర్జువా ప్రజాస్వామ్యవిప్లవం. ఈ విప్లవంలో కార్మికులు, రైతులు, పెటీ బూర్జువావర్గాలు చోదకశక్తులు. అయితే, దేశీయంగాను, విదేశాల్లోను మిత్రులు గల యితర వర్గాలు కూడా ఇందులో పాల్గొనవచ్చు. అందుచేత చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రస్తుత దశలో నిర్వర్తించవలసిన కర్తవ్యమేమంటే: విప్లవంలో పాల్గొనగల అన్ని వర్గాలను, తరగతులను, జాతులను, వ్యక్తులను సమైక్యపరచి విదేశ సామ్రాజ్యవాదాన్ని, స్వదేశఫ్యూడలిజాన్ని పూర్తిగా నిర్మూలించి, అన్ని విప్లవవర్గాల కలయికతో, అన్నిజాతుల స్వేచ్ఛానుబంధంతో నూతనప్రజాస్వామ్య రిపబ్లిక్‌ను చైనాలో స్థాపించడం. ఈ విప్లవం పూర్తియైన తర్వాతనే, నూతన ప్రజాస్వామ్యదశలో చైనాదేశపు సాంఘిక ఆర్థిక వ్యవస్థ మహోన్నతస్థాయికి చేరుకున్న మీదటనే, అవసరమైన సన్నాహాలన్నీ జరిగిన పిమ్మటనే, చైనా ప్రజల అవసరాలూ, అభిప్రాయాలూ తెలుసుకున్న తర్వాతనే — చైనాలో కార్మికవర్గం సోషలిస్టు, కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించగల్గుతుంది. గతంలో కొంత గందరగోళానికీ, పార్టీలో బోలెడు చర్చలకూ కారణమైన యీ సమస్యపై ఖచ్చితమైన స్పష్టీకరణ నేడు మనకు లభించింది.

చైనా విప్లవంయొక్క యితర లక్షణాలనుకూడా పార్టీ కార్యక్రమం పేర్కొంటూంది. ఉదాహరణకు దాని అభివృద్ధి కమం ఎగుడు దిగుడుగా ఉంటుందనీ, దీర్ఘకాలం కొనసాగు

తుందనీ, పోరాటం క్లిష్టంగా ఉంటుందనీ, ఒకానొక దశలో సాయుధపోరాటమూ, గ్రామసీమల్లో విప్లవ స్థావరాలూ అవసరమవుతాయనీ కార్యక్రమం వివరించింది. ఈ అంశాలన్నిటి పైనకూడా మనకు స్పష్టీకరణ లభించింది.

గతంలో చైనా విప్లవంయొక్క స్వభావమేమిటి అనే సమస్య పార్టీలో అత్యంత వివాదగ్రస్తమైన సమస్యగా ఉండేది. పార్టీలో బయల్దేరిన రకరకాల అవకాశవాద పోకడలకు ఇంచుమించు ఎల్లప్పుడూ మూలం, యీ సమస్యపై తప్పుడు అవగాహనేనని చెప్పవచ్చు. అట్టి సమస్యలపైవచ్చిన అవకాశవాద ధోరణులకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో మావ్ చైనా విప్లవసిద్ధాంతం పరిపూర్ణత పొందింది. అందుచేత యీ లక్షణాలను గురించి పార్టీ కార్యక్రమంలో ఖచ్చితంగా వివరించవలసియుంది. ప్రతి పార్టీ సభ్యుడు వాటిని పూర్తిగా అర్థం చేసుకోవాలి.

మన పార్టీ చరిత్రలోనే చైనా విప్లవంయొక్క లక్షణాలు స్పష్టంగా కనిపిస్తాయి. 1919 మే నాల్గవ తేదీ ఉద్యమానంతరం ఒకచిన్న మార్క్సిస్టు గ్రూపుగా ఉద్భవించిన మన పార్టీ, యీ లక్షణాల కనుగుణ్యంగా మావ్ రూపొందించిన యీ మహోత్కృష్ట చారిత్రకపంథాను అనుసరించడంవల్లనే నేటికింత శక్తివంతమైన పార్టీగా అభివృద్ధిచెంది బలమైన విప్లవ స్థావరాలకు నాయకత్వం వహించగల్గుతోంది.

కార్మికోద్యమ ప్రాతిపదికపై, చైనాప్రజల స్వాతంత్ర్య పోరాటాల్లో, విదేశ సామ్రాజ్యవాదుల పీడనకూ, స్వదేశ భూస్వామ్యవర్గాల దోపిడీకీ వ్యతిరేకంగా జరిగిన విప్లవ పోరా

టాల్లో చైనా కమ్యూనిస్టుపార్టీ పుట్టిపెరిగింది. చైనాజాతికి, చైనాప్రజలకు బద్ధశత్రువులైన వారికి వ్యతిరేకంగా జరిగిన విప్లవ పోరాటాల్లో అది అభివృద్ధి చెందింది. చైనా జాతినంతటినీ అణచియుంచినవిదేశ సామ్రాజ్యవాదానికి, చైనా ప్రజలందరినీ పీడిస్తున్న స్వదేశ భూస్వామ్య వ్యవస్థకు, ఈ రెండింటికీ రహస్యంగా సహాయంచేస్తున్న వారికి వ్యతిరేకంగా ప్రజలందరినీ సమైక్యపరచి నడిపిన చైనా కార్మికవర్గ చరిత్రే చైనా కమ్యూనిస్టుపార్టీ చరిత్ర.

చైనా కమ్యూనిస్టుపార్టీ మూడు బ్రహ్మాండమైన విప్లవ సమరాల్లో కాకలుతీరి అభివృద్ధి చెందింది. మొదటిది ఉత్తర దేశయాత్ర; రెండవది వ్యవసాయ విప్లవం; మూడవది జపాన్ వ్యతిరేక యుద్ధం. అంటే చైనా కమ్యూనిస్టుపార్టీ దీర్ఘకాల సాయుధపోరాటంలో కాకలుతీరి అభివృద్ధి చెందిందన్న మాట. మనపార్టీ చరిత్రలో అత్యధికభాగం యీ మూడు విప్లవయుద్ధాల చరిత్రే.

చైనా కమ్యూనిస్టుపార్టీ రైతాంగ ప్రజాసామాన్యంతోను, మధ్యతరగతులతోను సన్నిహితమైన సమైక్యతను సాధించడంద్వారా అభివృద్ధి చెందింది. ఉమ్మడి శత్రువుతో పోరాడ్డానికి పెట్టుబడిదారీవర్గంతో కలిసి పనిచేయడంలోను, రెండోవైపు ఆ వర్గంయొక్క అభివృద్ధి నిరోధక రాజీ ధోరణిని బహుముఖంగా ఎదుర్కోవడంలోను అది బలపడింది. అందుచేత మనపార్టీచరిత్ర రైతాంగ ప్రజాసామాన్యంతోనూ, పట్టణ మధ్యతరగతులతోనూ సాధించిన సమైక్యతయొక్క చరిత్రే

గాక, పెట్టుబడిదారీవర్గాన్ని కలుపుకువస్తూ, వ్యతిరేకిస్తూ సాగించిన పోరాటచరిత్ర కూడా.

చైనా కమ్యూనిస్టుపార్టీ గొప్ప విప్లవ స్థావరాలను నెలకొల్పడం ద్వారా, ముఖ్యంగా వాటిని గ్రామసీమల్లో నెలకొల్పడం ద్వారా అభివృద్ధి చెందింది. వాటిలోనూ నూతన ప్రజాస్వామ్యవిధానాని కనుగుణ్యమైన రాజకీయ, సైనిక, ఆర్థిక, సాంస్కృతిక సంస్కరణ లెన్నిటినో ప్రవేశపెట్టింది. చాలకాలంవరకు మన పార్టీయొక్క చరిత్ర గ్రామసీమల్లో విప్లవ స్థావరాల నిర్మాణ చరిత్ర అని చెప్పవచ్చు. ఈ స్థావరాల్లో రకరకాలైన నూతన ప్రజాస్వామ్య సంస్కరణలను అమలు జరుపుతూ వచ్చాం. ఇవి జయప్రదంగా దేశం మొత్తంమీద పార్టీనీ, ప్రజల్నీ తరిఫీదు చేయడాని కెంతో సహాయపడింది.

చివరి విషయమేమంటే, చైనా విప్లవం యొక్క లక్షణాలను విస్మరించడం, లేదా తప్పుగా అవగాహన చేసుకోవడం వల్ల పార్టీలో ఏర్పడిన అవకాశవాదానికి వ్యతిరేకంగా అంటే-పిడివాదం, స్వీయానుభవవాదం, చెన్ తూ - సియూాయిజం, లి-లీ-సానిజం, ఆ తర్వాత వచ్చిన 'అతివాద'ధోరణి, లొంగుబాటుతత్వం వీటికి వ్యతిరేకంగా - పోరాడ్డం ద్వారా చైనా కమ్యూనిస్టుపార్టీ బలపడింది. మార్క్సిజం - లెనినిజం అనే విశ్వమానవ సత్యాన్ని చైనా విప్లవ అనుభవంతో జోడించడం ద్వారా అది అభివృద్ధి చెందింది. మన పార్టీయొక్క చరిత్ర నానావిధ అవకాశవాద ధోరణుల నిర్మూలన చరిత్ర. మార్క్సిజం - లెనినిజం అనే విశ్వమానవ సత్యాన్ని నిరం

తరం చైనా విప్లవాచరణతో జోడిస్తూ మావ్ చైనా విప్లవ సిద్ధాంతాన్ని అమలుజరుపుతూ వచ్చిన చరిత్ర.

ఇదంతా మనపార్టీయొక్క చారిత్రకపథాన్ని నిరూపిస్తుంది.

చైనా విప్లవంయొక్క స్వభావం, దాని చోదకశక్తి, అసమాన అభివృద్ధి, దీర్ఘకాలిక స్వభావం, సాయుధపోరాట ప్రాముఖ్యత, గ్రామసీమల్లో విప్లవ స్థావరాల ప్రాధాన్యత - వీటిని యీ చారత్రకపథం ఎంతో స్పష్టంగా వివరిస్తుంది. చైనా విప్లవానికి కొన్నిప్రత్యేక లక్షణాలున్నట్లు యిది సూచిస్తుంది. ఈ విప్లవంలో శ్రామికవర్గంయొక్క మార్క్సిస్టు - లెనినిస్టు నాయకత్వ మెలాంటిపాత్ర నిర్వహిస్తోందో తెలియజేస్తుంది.

మనపార్టీ నాయకుడు, కామ్రేడ్ మావ్ సె-టుంగ్ చాల కాలంక్రిందటే, చైనా విప్లవ లక్షణాలను ప్రాతిపాదికగా తీసుకొని ఈ చారత్రక పథాన్ని నిర్వచించాడు. కామ్రేడ్ మావ్ చూపిన మార్గం ఖచ్చితంగాను, సమగ్రంగాను మన పార్టీ చరిత్రను తెలియజేస్తుంది; చైనా జాతి, చైనా ప్రజలు సాగించిన విప్లవ పోరాటాల చరిత్రను అది నిరూపిస్తుంది. కొన్ని చారిత్రక దశల్లో కామ్రేడ్ మావ్ మొత్తం పార్టీయొక్క కార్యకలాపాల్ని నిర్మాణం దృష్ట్యా నిర్ణయించలేకపోయినప్పటికీ, ఆయన ఎక్కడుంటే అక్కడ నిజమైన పార్టీ చరిత్ర నిర్మింపబడింది. చైనా కార్మిక వర్గంయొక్క చైనా ప్రజల యొక్క విప్లవ కార్యాచరణ అక్కడే ఉండేది. కామ్రేడ్ మావ్ ఉన్నచోటే అవి అభివృద్ధి చెందాయి; ఇతరచోట్లగాని, యితర వ్యక్తులుచుట్టూ గాని అవి అభివృద్ధి చెందలేదు.

మావ్ చైనా విప్లవ సిద్ధాంతాని కనుగుణ్యంగా మన పార్టీ, కొన్ని ప్రత్యేకలక్షణాలుగల చైనా విప్లవ గమనంలో అభివృద్ధిచెంది రాటుదేరింది. ఇకముందుకూడా అది చాల సంవత్సరాలవరకు తన గమ్యస్థానం చేరుకొనేవరకూ పోరాడుతూనే ఉంటుంది; అంతకంతకు లోతైన అవగాహనతో పై సిద్ధాంతాని కనుగుణ్యంగా యీ ప్రత్యేక లక్షణాలను మరింత చక్కగా వినియోగించుతూ మరింత అభివృద్ధి చెందుతుంది; మరింత రాటుదేరుతుంది. కనుకనే, పార్టీ తన కార్యక్రమంలో యీ లక్షణాలకు ప్రత్యేక ప్రాముఖ్యత యిచ్చింది. చైనాలో నూతన ప్రజాతంత్ర విప్లవం సంపూర్ణ విజయాన్ని సాధించేవరకు వాటికి యీ ప్రాముఖ్యత ఉంటుంది. అందుచేత ప్రతి పార్టీ సభ్యుడు ఆ లక్షణాలను జ్ఞాపకముంచుకోవాలి. పొరబాట్లు జరక్కుండా ఉండాలంటే, వాటిని ఒక్క నిమిషమైనా మరచిపోకూడదు. అలా మరచిపోతే, గతంలో జరిగిన పొరబాట్లన్నీ తిరిగి తలయెత్తనవచ్చు.

ఉదాహరణకు, ప్రస్తుతదశలో చైనా విప్లవంయొక్క నూతన ప్రజాతంత్ర లక్షణాన్నిగురించి తెలుసుకోకపోవడం వల్ల మన పార్టీపాలసీలో మితవాద పెడమార్గాలు, "అతివాద" పెడమార్గాలు బయలుదేరాయి. అంతేకాదు. చైనా విప్లవం అసమానస్థాయిలో అభివృద్ధిచెందుతుందనీ, తత్ఫలితంగా విప్లవపోరాటాలు క్లిష్టస్వభావాన్ని కలిగియుంటాయనీ తెలుసుకోకపోవడంవల్ల అతి కేంద్రీకృత నాయకత్వం, ఆచరణ కనుగుణ్యంకాని ఫార్మలిజం, అతి సులభంగా నిర్ణయాలకు రావడం, సాధారణసూత్రాల్నే వల్లిస్తూ ఉండడం, మన కార్య

కలాపాల్లో పట్టు విడుపులు లేకపోవడం - యివన్నీ బయల్దేరాయి. చైనా విప్లవం చాలకాలం కొనసాగుతుందనే విషయాన్ని కొందరు గుర్తించకపోవడంవల్ల, కఠినమైన దీర్ఘకాల పోరాటాలకు మానసిక సన్నాహం తగినంత లేకుండాపోయింది; తత్ఫలితంగా కష్టసమయాల్లో దుందుడుకుతనం లేదా నిస్పృహ వివిధరూపాల్లో తలయెత్తాయి.

చైనా విప్లవంలో సాయుధపోరాటంయొక్క ప్రాధాన్యతను గ్రహించకపోవడంవల్ల సైన్యంలో చేయవలసిన పనిని గురించి తక్కువ అంచనా వేయడం, సైనిక విషయాలను గురించి తెలుసుకోవడంలో అశ్రద్ధచూపడం జరిగింది. గ్రామ సీమల్లో విప్లవస్థావరాల ప్రాముఖ్యతను గుర్తించక పోవడం వల్ల గ్రామీణ సమస్యల్లో పట్టణ దృక్పథాని కెక్కువ విలువ యిచ్చి, గ్రామసీమల్లో చేయవలసిన పనిని నిర్లక్ష్యం చేయడం జరిగింది. మరోవైపు, కొన్నిదశల్లో పట్టణాల కీయవలసిన ప్రాధాన్యతను గుర్తించక పోవడంవల్ల పట్టణ కార్యకలాపాలను నిర్లక్ష్యం చేయడం, గ్రామీణ ఛాందసత్వాన్ని పట్టుకు వేళ్ళాడ్డం జరిగింది. అన్ని తరగతుల ప్రజల్లో ఓపికగా చాల కాలం పనిచేయవలసిన అవసరాన్ని తెలుసుకోకపోవడంవల్ల బాధ్యతా రహితమైన దుందుడుకుచర్యలు హుకూమత్ తత్వం బయల్దేరాయి.

మన కామేడ్స్ ఈ లక్షణాలను సామాన్య పద్ధతిలో అర్థం చేసుకున్నంత మాత్రం చేత సరిపోదు. తప్పులు జరక్కుండా చూడాలన్నా, కనీసం ఎక్కువ తప్పులు జరక్కుండా చూడాలన్నా మన కార్యకలాపాలన్నిటిలోను, ప్రతి సమస్యను

పరిశీలించేటప్పుడు ఈ లక్షణాలను దృష్టిలో ఉంచుకోవాలి. అందుచేత ఈ లక్షణాలు మన పార్టీయొక్క ప్రధాన కార్యక్రమంలో, కనీసం ప్రస్తుత దశలో ఒక భాగంగా ఉండాలి.

## 4. ప్రజా సాన్నిహిత్య పంథా

మన పార్టీ కార్యక్రమం, పార్టీ నిబంధనావళి ప్రజా సాన్నిహిత్య పంథానుగురించి నొక్కి చెబుతున్నాయి. ఇది మన నూతన నిబ ధనావళిలో మరొక ముఖ్య లక్షణం. ఎందుచేతంటే, ప్రజా సాన్నిహిత్య పంథా మన పార్టీయొక్క ప్రధాన రాజకీయ, నిర్మాణ పంథా. దీని అర్థం మన పార్టీ యూనిట్లన్నీ, పార్టీ కార్య కలాపాలన్నీ ప్రజా సామాన్యంతో సన్నిహిత సంబంధం కలిగి యుండాలని.

మన కార్యకలాపాలన్నీ ప్రజాసాన్నిహిత్యపంథాను బట్టి ఉండాలని కామ్రేడ్ మావ్ పదే పదే చెప్పాడు. ప్రస్తుత పార్టీ మహాసభకు ఆయన సమర్పించిన నివేదికలోకూడా, యీ పంథానుబట్టి పనిచేయవలసిందని మనల్ని ప్రబోధించాడు. ప్రజా బాహుళ్యంతో మనకు చాల సన్నిహితమైన సంబంధం ఉండడమే, యితర రాజకీయపార్టీలకూ మన పార్టీకీ గల ప్రధాన వ్యత్యాసమని ఆయన చెప్పాడు. "ప్రజలనుంచి ఒక్క నిమిషమైనా వేరుపడక, త్రికరణశుద్ధిగా వారికి సేవ చేయండి. ప్రజల శ్రేయస్సుకోసమే ప్రతిపనీ చేయండి. స్వప్రయోజనాల కోసంగాని, గ్రూపుల ప్రయోజనాల కోసంగాని పనిచేయవద్దు," అని ఆయన చెప్పాడు.

"అంత్యపరిశీలనలో, కమ్యూనిస్టు చెప్పే మాటలకూ చేసే పనులకూ గీటురాయి, ప్రజల్లో అత్యధికసంఖ్యాకుల

ప్రయోజనాలకవి అనుగుణ్యమైనవేనా? వాటిని ప్రజా సామాన్యం బలపరుస్తున్నారా? అనే విషయాన్నిబట్టి ఉంటుంది," అన్నాడు కామ్రేడ్ మావ్. దీన్ని మన కామ్రేడ్స్ అర్థంచేసుకోవాలన్నాడు. అంతేకాదు. "ప్రజలపైనే ఆధార పడుతూ, వారిలో అనంతంగా ఉన్న సృజనాత్మకశక్తిలో విశ్వాసముంచితే అనగా ప్రజల్లో గట్టినమ్మకం ఉంచి వారిలో మనం ఒకటైపోతే" మనలనెవరూ ఓడించలేరని ఆయన చెప్పాడు. "మన కార్యకలాపాల్లో హుకూమత్ తత్వం చాల చెడ్డది. ఎందువల్లనంటే, అది ప్రజల రాజకీయ చైతన్యాన్ని మించిపోతుంది; ప్రజలు ఐచ్ఛికంగా కార్యరంగంలో ప్రవే శించేటట్లు చూడాలనే సూత్రానికది వ్యతిరేకం; మనలో ఓపికలేకపోవడంవల్ల అది బయల్దేరుతుంది," అని ఆయన అన్నాడు.

ఇంకా యిలా అన్నాడు: "ప్రజల్ని గుడ్డిగా అనుసరించే ధోరణికూడా తప్పే. కారణమేమంటే అది ప్రజల రాజకీయ చైతన్యానికి వెనుకబడుతూంది. ప్రజల్ని ఒక్కొక్క అడుగే ముందుకు నడపాలన్న సూత్రానికది వ్యతిరేకం. మరీ నెమ్మదిగా నడవడమే దాని లోపం".

ఈ ఉపదేశాలన్నీ చాల ముఖ్యమైనవి. వాటిని ప్రతి పార్టీ సభ్యుడు జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి; త్రికరణశుద్ధిగా అమలు జరపాలి.

ప్రజా సాన్నిహిత్య పంథా శ్రామికవర్గ పార్టీలోనే సాధ్యం. మన ప్రజాసాన్నిహిత్య పంథా ఒక వర్గ పంథా; శ్రామిక వర్గం యొక్క ప్రజా సాన్నిహిత్య పంథా అది. ప్రజల

యెడ, ప్రజలతో ఉండవలసిన సంబంధాల యెడ మనకున్న అభిప్రాయాలు దోపిడీ వర్గాల అభిప్రాయాలకు పూర్తిగా భిన్న మైనవి.

ప్రజా విముక్తి పోరాటంలో ప్రజల అగ్రదళం నిర్వహించవలసిన పాత్ర ఎలాంటిదో మనకు పూర్తిగా తెలుసు. మన పార్టీవంటి అగ్రదళం ఒకటి ఉన్నప్పుడే, ప్రజల సంపూర్ణ విముక్తి సాధ్యం. అది లేనప్పుడు విప్లవ నాయకత్వం ఉండదు. అట్టి విప్లవ నాయకత్వం లేకపోతే, ప్రజా విప్లవం విఫల మవుతుంది. మన పార్టీయొక్క ఖచ్చితమైన, సరియైన నాయకత్వం క్రిందనే, మన పార్టీ యిచ్చే రాజకీయ పంథా ననుసరించి పోరాటం సాగించడం ద్వారానే — చైనా ప్రజలు సంపూర్ణ విముక్తిని సాధించగల్గుతారు.

రెండవ దృక్పథ మేమంటే: అగ్రదళం ప్రజలతో సరియైన, సన్నిహితమైన సంబంధాలుంచుకోవాలి. అన్నిరంగాల్లోను — ముఖ్యంగా రాజకీయరంగంలో — అది ప్రజల ప్రయోజనాల కోసం నిలబడాలి. ప్రజలయెడ అది సరియైన వైఖరితో మెలగాలి; సరియైన పద్ధతులద్వారా వారిని నడపాలి. అలా చేయడం ద్వారానే అగ్రదళం ప్రజలతో కలిసి పోగల్గుతుంది. లేకపోతే అది ప్రజలనుంచి దూరమయే ప్రమాదము ఏర్పడుతుంది. అలాంటప్పుడు ఆ అగ్రదళం ప్రజల అగ్రదళంగా ఉండదు. ప్రజల్ని విముక్తిచేసే కర్తవ్యాన్ని అది నెరవేర్చ లేకపోవడమేగాక, శత్రువు దాన్ని తుడిచిపెట్టే ప్రమాదం కూడా ఉంటుంది. దీని అర్థమేమంటే, ప్రజల అగ్రదళంచేసే

ప్రతి పనిలోను సమగ్రమైన స్పష్టమైన ప్రజాసాన్నిహిత్య పంథా ఉండాలి.

ఎందువల్ల అగ్రదళం ప్రజలనుంచి దూరమవుతుంది ?

మొదటికారణం: ప్రజల అగ్రదళంగా అది నెరవేర్చవలసిన కర్తవ్యాన్ని నెరవేర్చలేకపోతే ప్రజలనుంచి దూరమవుతుంది; అన్నిసమయాల్లోను, అన్ని పరిస్థితుల్లోను ప్రజల్లో అత్యధికసంఖ్యాకుల ప్రయోజనాల రక్షణకు నిలబడకపోతే అది ప్రజలకు దూరమవుతుంది; సరియైన సమయంలో సరియైన విధుల్నీ, విధానాల్నీ, పద్ధతుల్నీ నిర్ణయించలేకపోతే ప్రజలకు దూరమవుతుంది; సత్యానికి కట్టుబడకుండా, తాను చేసిన పొరబాట్లను సకాలంలో దిద్దుకోకపోతే కూడా అది ప్రజలకు దూరమవుతుంది.

ప్రజావుద్యమం దానంతట అది బయలుదేరినప్పుడు పార్టీ గుడ్డిగా దాని అడుగుజాడల్లో నడవాలనే "సిద్ధాంతాన్ని" గాని, శ్రామికవర్గపార్టీ తన నాయకత్వపాత్రను ఒదులుకోవాలనే వాదననుగాని యింతవరకు మన పార్టీలో ఎవరూ బహిరంగంగా బలపర్చలేదు. కాని 1924-27 విప్లవదశ చివరి రోజుల్లో బయల్దేరిన చెన్-తూ-సియూయిజం, జపాన్ వ్యతిరేక యుద్ధం మొదటిరోజుల్లో బయల్దేరిన లొంగుబాటు ధోరణి - యీ రెండూ ఒకవిధమైన గుడ్డి అనుసరణక్రిందికే వస్తాయి. వీటివల్ల ఆనాటి ప్రజావిప్లవోద్యమానికి వెనుకబడ్డమే జరిగింది. ఈ రెండు ధోరణులూ కూడా, ప్రజల్ని ఉత్తేజపరిచి ముందుకు తీసుకెళ్ళడాని కవసరమైన కర్తవ్యాలను, విధానాలనూ, పద్ధతులను చూపలేకపోయాయి. అందువల్ల పార్టీ ప్రజలనుంచి

దూరమయింది; విప్లవం అనేక నష్టాలకు లోనై పరాజయం పొందింది.

ఉదాహరణకు, కొందరు కామ్రేడ్స్ తమ కార్యకలాపాల్లో పార్టీని ఒక సైన్యానికో ప్రభుత్వానికో ట్రేడ్ యూనియన్‌కో అనుబంధ సంస్థగా పరిగణించేవారు; ఒక ఉన్నతోన్నతమైన వర్గ సంస్థగా దాన్ని చూచేవారు కారు. మరికొందరు కామ్రేడ్స్ తమ కార్యకలాపాల్లో బద్ధకాన్ని, సాంప్రదాయానుగత ధోరణిని ప్రదర్శించేవారు; ఉన్న పరిస్థితులతోనే సంతృప్తి చెందేవారు; ఏది యెలాజరిగినా ఊరుకొనేవారు; పరిస్థితుల్ని చక్కబరచడానికి కుతూహలం చూపేవారు కారు. ఒకానొక సమయంలో, లేదా ఒకానొకచోట ప్రజల వాస్తవ పరిస్థితిని గమనించి, దాని కనుగుణ్యంగా సరియైన కర్తవ్యాలను విధానాన్ని, పద్ధతుల్ని చూపడంలో విఫలులయేవారు; ఆ విధంగా వారు ప్రజల్ని ముందుకు నడపలేక పోయారు. ప్రజల్ని ఒక్కొక్క అడుగే ముందుకు నడపాలన్న సూత్రాన్ని వారు ఉల్లంఘించారు. ప్రజల్లో వెనుకబడియున్న వారి భావాలకు లొంగిపోయి, సామాన్య కార్మికుల-రైతుల స్థాయికి వారు దిగజారేవారు. ఆ విధంగా తమ నాయకత్వ పాత్రను వారు విసర్జించారు. ఒక్కొక్కప్పుడు వారు ప్రజల అపసవ్య భావాలకు తలబగ్గి, వాటంతట అవి బయల్దేరే ప్రజా ఉద్యమాలకు తోకగా తయారయారు. ప్రజలకు వారు సరియైన, దూరదృష్టి గలిగిన నాయకత్వమీయలేక పోయారు. ఈ ధోరణివల్ల ప్రజలనుంచి మనం వేరు అవుతాం. కారణమేమంటే, ప్రజలెన్నటికీ అట్టివారు తమ్ము నడపాలని కోరరు.

రెండవ కారణం: అగ్రదళం అనుసరించే వైఖరి, నాయకత్వ పద్ధతి అపసవ్యంగా ఉన్నప్పుడు, ప్రజలనుంచి అది దూరమవుతుంది. పార్టీ నినాదాల ఔచిత్యాన్ని ప్రజలు స్వానుభవంద్వారా గుర్తించేటట్లు, తదనుగుణ్యంగా వారు నడిచేటట్లు చేయకపోతే; లేదా ఆ నినాదాలు, విధానం ప్రజల కందుబాటులో లేకుండా ఎక్కువ "అతివాదం"గా ఉంటే; లేదా పార్టీ సూచించిన పోరాటరూపాలు, నిర్మాణ పద్ధతులు ప్రజలు అమలు జరిపే విధంగాను, వారి ఆమోదం పొందే విధంగాను లేకపోతే — అగ్రదళం ప్రజలకు దూరమవుతుంది. మరోవిధంగా చెప్పాలంటే హుకూమత్ తత్వం, దుందుడుకు తత్వం, అతివాద పాక్షిక వైఖరి (సెక్టేరియనిజం) ప్రజలనుంచి మనం దూరమవడానికి దారితీస్తాయి.

కొంతమంది కామ్రేడ్స్ హుకూమత్ తత్వంతో, దుందుడుకు తత్వంతో, అతివాద పాక్షిక వైఖరితో చాల తప్పులు చేశారు. ఉదాహరణకు కొందరు తమ కార్యకలాపాల్లో ప్రజలయెడ బాధ్యతా రహితంగా వ్యవహరించారు. ప్రజలే తమ్మతాము విముక్తి చేసుకొంటారను విషయాన్ని వారు నమ్మలేదు. ప్రజలకు బదులు తామే పోరాడ్డానికి, తామే విముక్తని ప్రసాదించడానికి, ఉత్తరువులు జారీచేయడానికి తయారయారు. ప్రజలకంటె ఉన్నత స్థానంలో, వారు నిలబడ్డారు. అట్టి కామ్రేడ్స్ అతి ఉద్రేకపరులు. పైకి మాత్రమే వారు గట్టిగా పనిచేస్తున్నట్లు కనబడేవారు. పార్టీ నినాదాలను, కర్తవ్యాలను ప్రజల నినాదాలుగా, కర్తవ్యాలుగా మార్చడమెలాగో వారికి తెలియదు. ప్రజల్ని చైతన్య

వంతులుగా చేయడం, అందుకోసం అవసరమైతే కొంతకాలం వేచియుండడం ఎలాగో కూడా వారెరుగరు. ప్రజల్ని విప్లవ సన్నద్ధులు చేయడానికి తాము ఏయే చర్యలు తీసుకోవాలో వారికి తెలియదు. కేవలం నిరంకుశ ఉత్తరువుల ద్వారా, బల వంతంగా ప్రజల్ని కార్యరంగంలోకి తీసుకురావడం ద్వారా వారు పార్టీ నినాదాలను, కర్తవ్యాలను ప్రజలచేత మింగించ డానికి ప్రయత్నించారు.

ఈవిధంగా ప్రజలయెడ అనుసరించవలసిన ఐచ్ఛిక సూత్రాన్ని వారు ఉల్లంఘించారు. ముఖ్యంగా నినాదాలు మరీ అందకుండాపోయి, విధానాలు మరీ "అతివాదం"గా ఉండడంవల్ల ప్రజల్లో అనుమానాలు, అసంతృప్తి వ్యాపిస్తే ఉత్తరువులివ్వడంద్వారాను, శిక్షలు విధించడంద్వారాను మరింత కఠినంగా వాటిని అమలుజరపడానికి వారు ప్రయత్నించారు. ఈవిధమైన పొరబాటుధోరణికి మరీ వికృతరూపం, అందరిమీద నేరాలు మోపడం; లోపాలు, చెడు ఉదాహరణలకోసం వెదకడం; మాటిమాటికీ విమర్శించడం; పని చురుగ్గా జరిగే టట్లు చేయడానికి ప్రజల్నీ, కార్యకర్తల్నీ భయపెట్టేవిధంగా వారి చర్యలను ఖండించడం, శిక్షలు విధించడం. మంచి విషయాలను, మంచి ఉదాహరణలను యితరులు నేర్చుకొనేటట్లు వాటిని అభివృద్ధిచేసేటట్లు, క్రమబద్ధమొనర్చే టట్లు చూడ్డానికి అట్టి ఉదాహరణలను వారు ఎత్తి చూప లేదు. పార్టీసభ్యుల్నీ, ప్రజల్నీ ఉత్సాహపరచి అభివృద్ధి చేయడానికీ, వారు తమ తప్పుల్ని దిద్దుకోడానికీ సహాయం చేసేవారు కారు. వీరుల్నిగాని, ఆదర్శ

వంతుల్ని గాని యితరులందరి దృష్టికీ తెచ్చేవారు కారు. అన్ని వైపులకూ వారు తమ కొరడాను ఝుళిపించేవారు; కేవలం ఉత్తరువులద్వారా పనులు చేయించుకోడానికి ప్రయత్నించేవారు. ప్రజలనుంచి నేర్చుకుంటూ, ప్రజల నూతనభావాల నుంచి, సూచనలనుంచి జ్ఞానం సంపాదించడానికి బదులు తమకు తోచినట్లు యితరులచేత బలవంతంగా పనిచేయించేవారు. ఇట్టి ధోరణి ప్రజలనుంచి ఎక్కువగా దూరమవడానికి కారణమయింది. వ్యక్తిగత కామ్రేడ్స్‌మీద, ఒకొక్కప్పుడు మొత్తం పార్టీమీద ప్రజలు ఆగ్రహం చెందడానికికూడ యిది దారితీసింది.

పై రెండు ధోరణులతోబాటు, కొందరు కామ్రేడ్స్‌లో నిరంకుశత్వం, యుద్ధ ప్రభువుల ధోరణికూడా గోచరించాయి. వాటివల్లకూడా ప్రజలకు దూరమవడమే జరిగింది.

ప్రజలకు సేవచేయాలనే దృష్టితో పనిచేయకుండా, ప్రజలయెడల, పార్టీయెడల బాధ్యతారహితంగా వ్యవహరించే కామ్రేడ్స్‌లో నిరంకుశత్వం బయల్దేరింది. అట్టివారు, రోజల్లా యిక్కడికీ, అక్కడికీ తిరుగుతూ, ఉత్తరువులు జారీచేయడం తప్ప మరో పనిచేసేవారుకారు. ఏ సమస్యనూ పరిశీలించకుండా, విచారించకుండా, ప్రజలనుంచి నేర్చుకోకుండా వారు నిర్ణయాలు చేసేవారు. ప్రజలనుంచి వచ్చే విమర్శలను తృణీకరించేవారు; ప్రజల హక్కులను త్రోసిపుచ్చేవారు; అంతేగాక ప్రజలు తమకు సేవచేయాలనికూడా కోరేవారు. అట్టివారు తమ ప్రయోజనాలకోసం ప్రజల ప్రయోజనాలను

విసర్జించేవారు. లంచగొండులుగాను, నీచులుగాను, పెత్తం దార్లుగాను ప్రవర్తించేవారు.

యుద్ధ ప్రభువుల ధోరణి గల కామ్రేడ్స్, మన సైన్యం ప్రజల సైన్యమని గుర్తించలేదు. ప్రజలు తమ శత్రువుల్ని ఓడించి విముక్తి జెందడానికి వారి చేతుల్లో సైన్యం ఒక ఆయుధమని తెలుసుకోలేదు. ప్రజలకు దూరంగానో, పైగానో ఉండే ఒక ప్రత్యేకసంస్థగా దాన్ని పరిగణించేవారు. కొద్దిమంది వ్యక్తుల పలుకుబడిని, లేదా హోదాను కాపాడ్డానికి దాన్ని వినియోగించుకొనేవారు. తత్ఫలితంగా ప్రజా సైన్యంలో నిరంకుశ పద్ధతుల్ని, నియంతృత్వ విధానాల్ని ప్రవేశపెట్టేవారు.

ఇట్టి ప్రవర్తనయొక్క ఫలితాలు అధికారులకూ, సైనికులకూ మధ్య, వివిధ హోదాలకు చెందినవారిమధ్య సంబంధాలలో కనిపించాయి. కేవలం ఉత్తరువులద్వారా, శిక్షల ద్వారా సైన్యం నడుపబడేది; చొరవమీద, చైతన్యంమీద ఆధారపడ్డంద్వారా కాదు. సైన్యానికీ, ప్రజలకూ మధ్య సంబంధాల్లో కూడా దాని ఫలితాలు గోచరించాయి. ప్రజలతో సంబంధా లుంచుకొనేటప్పుడు కఠినమైనశిక్షణతో మెలగాలని కొందరు కామ్రేడ్స్ గ్రహించలేదు. ప్రజల్ని ప్రేమించే లక్షణం యీ కామ్రేడ్స్‌లో లేదు. పైగా ప్రజల్ని నిర్బంధించడం, హింసించడం, అవమానించడం చేసేవారు. తత్ఫలితంగా సైన్యం ప్రజలనుంచి వేరయింది. మూడవ విషయం: విప్లవ సైన్యానికీ, విప్లవ ప్రభుత్వానికీ మధ్య సంబంధాల్లో కేవలం సైనిక దృక్పథాన్నే ప్రదర్శించడం జరిగేది. కొందరు కామ్రేడ్స్ సైన్యానికి ప్రభుత్వంకన్న అధికస్థానమిచ్చేవారు;

యుద్ధప్రభువులవలె సైన్యంద్వారా ప్రభుత్వాన్ని నడప జూచారు.

ఇట్టి ధోరణులు ప్రజాసైన్యంలో ఉండవలసినవి కావు.

మన దేశంలో కష్టజీవులు సాంస్కృతికంగా వెనుకబడి యుండడంవల్ల, పాత సమాజం యొక్క దోపిడీవర్గాల ప్రభావం వల్ల యిలాంటి చెడుధోరణులు - ప్రజలనుంచి దూరమవడానికి దారితీసిన ధోరణులు - బయల్దేరాయి. మన పార్టీలో సభ్యులుగా ఉంటూ, చాలకాలంనుంచి సామాజిక ఉత్పత్తితో ఎట్టి సంబంధం లేని పెటీబూర్జువావర్గాలు, తదితరులు యిట్టి ప్రభావానికి తరచు లోనయేవారు. తత్ఫలితంగా ప్రజలనుంచి దూరమయే ధోరణులు చాల బయల్దేరాయి. అందుచేత ఈ ధోరణులకు లోతైన సాంఘిక పునాదులున్నాయి. పార్టీకార్యక్రమంలో సహితం వీటెని పేర్కొనడం జరిగింది. విప్లవం అభివృద్ధిచెంది, ఇంకా ఎక్కువ కష్టపడవలసిన సమయాల్లో యిట్టి ధోరణులు మనలో సహితం ప్రవేశించేప్రమాదం ఉంది. అందుచేత, ప్రజలతో ఎప్పటికప్పుడు మన సంబంధాలను వృద్ధి చేసుకోవాలంటే, పై ధోరణులను ఎడ తెగకుండా ప్రతిఘటిస్తూ ఉండాలి. కామ్రేడ్ మావ్ సె-టుంగ్ చెప్పినట్లు ఎప్పటికప్పుడు మనం "నేలను చిమ్ముకొంటూ ఉండాలి; ముఖం కడుక్కొంటూ ఉండాలి." అలా చేసినప్పుడే, మన కామ్రేడ్సనీ, పార్టీనీ రాజకీయధూళి కప్పివేయకుండా, రాజకీయ క్రిములు విషపూరితంచేయకుండా చూచుకోగల్గుతాం.

ప్రజల కొరకు బలీయమైన అగ్రదళం - వారి సొంత అగ్ర దళం - ఉండితీరాలి. దానికి అన్నితరగతుల ప్రజలతోను అతి

సన్నిహితమైన సంబంధాలుండాలి. అలా ఉన్నప్పుడే ప్రజల విముక్తి సాధ్యమవుతుంది. అందుచేత మన పార్టీ, అంటే చైనా ప్రజల అగ్రదళం, పై ధోరణులను నిర్మూలించుకోవలసి యుంది; ప్రజలతో మరింత సన్నిహితమైన సంబంధాలుంచుకోవాలి. ఇదే మన పార్టీయొక్క ప్రజా సాన్నిహిత్య పంథా. కామ్రేడ్ మావ్ సెటుంగ్ చూపిన ప్రజా సాన్నిహిత్య పంథా అంటే యిదే. పార్టీకీ, ప్రజలకూ మధ్య సరియైన సంబంధాలుంచుకోడాని కిది ఉద్దేశించబడింది. ప్రజలకు నాయకత్వం వహించడంలో పార్టీ సరియైన వైఖరి, సరియైన పద్ధతులు అనుసరించడాని కిది తోడ్పడుతుంది. పార్టీ పై కమిటీలకూ, సభ్యులకూ మధ్య, మరోవైపు పై కమిటీలకూ ప్రజలకూ మధ్య, సరియైన సంబంధాలుంచుకోవడ మెలాగో యిది తెలియజేస్తుంది.

కామ్రేడ్ మావ్ చెప్పినట్లు, మన పార్టీ పాలసీ, కార్యవిధానం ప్రజలనుంచి ఉద్భవించాలి; తిరిగి అది ప్రజల్లో సమైక్యమవాలి. మరోవిధంగా చెప్పాలంటే, మన రాజకీయ, నిర్మాణ పంథా ప్రజలనుంచి సరియైనవిధంగా రావాలి; ప్రజల్లోకి సరియైనవిధంగా వెళ్ళాలి. మన పార్టీ అనుసరించవలసిన రాజకీయపంథాను, నిర్మాణపంథానుంచి వేరుచేసి చూడ్డానికి వీల్లేదు. రెండిటిమధ్య తాత్కాలికంగా సమన్వయం కుదరనప్పటికీ, అపసవ్యమైననిర్మాణపంథాకూ, సవ్యమైన రాజకీయపంథాకూ ఎన్నటికీ పొత్తుకుదరదు; అదేవిధ[illegible] నిర్మాణపంథాకూ, అపసవ్యమైన రాజకీయపం[illegible] వదు. ఈ రెండిటినీ విడదీయడానికి వీలులేద[illegible]

పంథా అంటే అర్థం ప్రజాసాన్నిహిత్యపంథా; పార్టీలోనూ బయటా ఉండే ప్రజలతో పార్టీ నాయకులు సన్నిహిత సంబంధాలుంచుకొనే పంథా; ప్రజలనుంచి వచ్చి తిరిగి ప్రజల్ని చేరుకొనే పంథా; నాయకత్వం వహించేటప్పుడు సాధారణ పిలుపుల్ని వ్యక్తిగత గైడెన్స్ (మార్గం చూపడం) తో జోడించే పంథా.

మన పార్టీయొక్క, కామ్రేడ్ మావ్ యొక్క ప్రజా సాన్నిహిత్య పంథాను సమగ్రంగా అమలు జరపడానికి పార్టీ కార్యక్రమం, నిబంధనావళి యీ క్రింది విషయాలను అందరి దృష్టికీ తీసుకొచ్చాయి. అవి ప్రతి పార్టీసభ్యుని హృదయంలో నాటుకునేటట్లు చేయాలి.

మొదటివిషయం: ప్రతిపనీ ప్రజలకోసం చేయాలి; హృదయపూర్వకంగా ప్రజల్ని సేవించాలి. మన పార్టీ ప్రజలకు సేవచేయడానికి స్థాపింపబడింది. పార్టీసభ్యులు ప్రజలక్షేమం కోసం, విముక్తికోసమే త్యాగాలు, పోరాటాలు, కృషి చేశారు; మరొకందుకు కాదు. ఇది కమ్యూనిస్టులమైన మనం గర్వించదగ్గ విషయం; ఇందులోనే ఉంది మన గొప్పదనం. అందుచేత వ్యక్తిగత ప్రయోజనాలకోసం, లేదా ముఠా ప్రయోజనాలకోసం ప్రజల ప్రయోజనాల్ని త్యజించడం చాల తప్పు; తమ విధుల్ని సరిగా నిర్వర్తించడంలో ఏమాత్రం శ్రద్ధచూ [illegible] న్నా, మన పార్టీ సభ్యులూ, విప్లవకారులూ
[illegible] ష్టున్నట్లే లెక్క. ఆ విషయం వారికి తెలిసినా,
[illegible] నాయకత్వ హోదాల్లో ఉన్నా, సాధా
[illegible] ఉన్నా, వంటచేసేవాళ్ళుగా ఉన్నా,

సుఖ్రాలకు దాణాపెట్టేవాళ్ళుగా ఉన్నా - అందరూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రజలకు సేవచేస్తున్న వారే. అందుచేత వారంతా సమానులు. గౌరవింపదగిన వారు. పార్టీసభ్యుల, సైనికుల చైతన్యస్థాయిని మనం పెంపొందించాలి; అప్పుడు వారు ప్రజలకు మరింత ఎక్కువగా సేవ చేస్తారు; ప్రజలయెడ మరింత బాధ్యతతో మెలగుతారు.

రెండవ విషయం: మనమంతా ప్రజలకు పూర్తిగా బాధ్యత వహించాలి. ప్రజలకు సేవచేయడంలో మనం బాధ్యత వహిస్తూ, మన సేవవల్ల వారు నిజంగా లాభం పొందేటట్లు, విముక్తి చెందేటట్లు చూడాలి. ప్రజలకు హానిజరక్కుండా చూడ్డానికి, నష్టం కలుగకుండా చూడ్డానికి మనం సాధ్యమైనంత వరకు తప్పులు చేయకుండా, కనీసం ఎక్కువ తప్పులు చేయకుండాఉండాలి. ప్రజలకు మేలు చేకూర్చడానికి మనం తీసుకొనే కర్తవ్యాలు అనుసరించే విధానాలు, చేబట్టే పద్ధతులు సరియైనవిగా ఉండాలి. అలా ఉండకపోతే, ప్రజలకు హాని జరుగుతుంది. అలా హాని జరిగినప్పుడు, తప్పులు దిద్దుకోడానికి త్వరగాను, త్రికరణశుద్ధిగాను ఆత్మవిమర్శన చేసుకోవాలి. దీని అర్థమేమంటే, ప్రజలకెలా సేవచేయాలో, సవ్యంగా సేవచేయడమెలాగో తెలుసుకోవాలి. అందుచేత మనం ఏ పరిస్థితుల్లోనూ ప్రజలయెడ చులకనభావంతో మెలగకూడదు; చాల బాధ్యతతో మెలగాలి.

అంతేకాదు. ప్రజలకు బాధత్య, పైకమిటీలకు బాధ్యత- అనే రెండిటి మధ్యగల సమన్వయాన్ని మనం అర్థం చేసుకోవాలి. అంటే, మన పార్టీసభ్యులు పై కమిటీల ఉత్తరువును

లేదా ఒక నాయకుని ఉత్తరువును అమలు జరిపేటప్పుడు ఆ కమిటీకి, లేదా నాయకునికి బాధ్యత వహించాలి. అయితే, పార్టీ నాయకులకు బాధ్యత వహించడానికీ, ప్రజలకు బాధ్యత వహించడానికీ మధ్య భేదం ఉందనుకోవడం తప్పు. ప్రజలకు బాధ్యత వహించడం ద్వారా పార్టీ సభ్యులు మహోత్కృష్టమైన బాధ్యత వహిస్తున్న వారవుతారు. పార్టీ ప్రయోజనాలూ, ప్రజల ప్రయోజనాలూ ఒకటేనను విషయాన్ని మన మర్థం చేసుకోవాలి. ప్రజలకు జరిగే మేలు పార్టీ మేలే గనుక ప్రతి పార్టీసభ్యుడు మనోవాక్కాయ కర్మలతో అందుకు పాటు పడాలి. అలాగే, ప్రజలకు జరిగే హాని పార్టీ హానే గనుక, ప్రతి పార్టీ సభ్యుడు దాన్ని నివారించాలి; ఎదుర్కోవాలి. ప్రజల ప్రయోజనాలు తప్ప ప్రత్యేకమైన సొంత ప్రయోజనాలేవీ పార్టీకిలేవు. అత్యధిక సంఖ్యాక ప్రజలకు అత్యధిక మేలు— ఇదీ సత్యంయొక్క మహోన్నతరూపం.

అందుచేత మనపార్టీ సభ్యులు తమ కార్యకలాపాలన్నిటినీ దీనిమీదే కేంద్రీకరించాలి. ప్రజలకు బాధ్యత వహించే ప్రతిపార్టీ సభ్యుడు పార్టీకి కూడా బాధ్యుడే. ప్రజలయెడ బాధ్యతారహితంగా ప్రవర్తించే వ్యక్తి పార్టీయెడ కూడా బాధ్యతారహితుడే. ప్రజలకు బాధ్యత వహించడమన్నా, పార్టీకి బాధ్యత వహించడమన్నా ఒకటే. ఈ రెండిటినీ సమన్వయ మొనర్చాలి; వేరు చేయకూడదు; రెండిటి మధ్య పోటీ పెట్టకూడదు.

పార్టీనాయకత్వం గాని, వ్యక్తిగత నాయకులుగాని, కర్తవ్యాలు, పాలసీలు, కార్యవిధానం గురించి యిచ్చే

ఉత్తరువుల్లో లోపాలుగాని, పొరబాట్లుగాని కనిపించినప్పుడు, ప్రజలపట్ల ఎంతో బాధ్యతతో సూచనలు చేయాలి. మంచి ఏదో, చెడుఏదో తెలుసుకోవడం చాల అవసరం. దేన్నీ చులకనభావంతో చూడకూడదు. లేకపోతే, ప్రజలయెడ మాత్రమే కాక పార్టీయెడ కూడా బాధ్యతారహితంగా మెలగడమే అవుతుంది.

పార్టీలో క్రమశిక్షణ, ఐక్యత ఎందు కవసరమంటే, వాటిని కాపాడ్డం పైనా ప్రజల ప్రయోజనాలకు అవసరం. ప్రజలకు బాధ్యతవహించే సాకుతో పార్టీశిక్షణను, ఐక్యతను నాశనం చేయకూడదు. ఆదేసమయంలో ఒక నాయకత్వ సంస్థగాని, వ్యక్తిగత నాయకుడుగాని పొరబాటుచేస్తే దాన్ని సరి దిద్దాలి. ఈ విషయంలో సహాయంచేయడం ప్రతి పార్టీసభ్యుని కర్తవ్యం; హక్కు. ఎందుచేతంటే, అట్టి లోపాలూ, పొర బాట్లూ ప్రజలకు హానిచేస్తాయి; అందుచేత పార్టీకికూడా అవి హానిచేస్తాయి. నిష్కపటమైన ఆత్మవిమర్శన యెడల మన పార్టీసభ్యుల వైఖరి, తమ లోపాలయెడ తమ నాయకుల లోపాలయెడ విమర్శనాదృష్టి, పార్టీలో శిక్షణను పాటించడం-యివన్నీ ప్రజలయెడ బాధ్యత వహించడంలో భాగాలే.

మూడవది, ప్రజలే స్వయంగా తమ విముక్తిని సాధించు కోగలరన్న విషయంలో మనం నమ్మకముంచాలి. ప్రజలు నిజంగా గొప్పవారనీ, వారి సృజనాత్మక శక్తి అంతులేనిదనీ, వారిమీద ఆధారపడ్డప్పుడే మనం అజేయులమనీ, ప్రజలే చరిత్ర నిర్మాతలనీ, ప్రజల చరిత్రే నిజమైన చరిత్ర అనీ-కామ్రేడ్ మావ్ పదేపదే ఉపదేశించాడు. మార్క్సు చాలాకాలం

క్రిందనే, కష్టజీవులు తమను తాము విముక్తి చేసుకుంటారని చెప్పాడు. ప్రపంచ కమ్యూనిస్టు సమాఖ్య చెప్పినట్లు, వారి విముక్తి చక్రవర్తులమీదగాని, దేవుళ్ళమీదగాని, సాహసవంతులమీదగాని ఆధారపడదు. దీని అర్థం, ప్రజలు స్వయంగా తాము జరిపే పోరాటాలద్వారాను, ప్రయత్నాలద్వారాను తమ విముక్తిని సాధించుకోగల్గుతారు. దాన్ని నిలబెట్టుకోగల్గుతారు; గట్టిపరచుకోగల్గుతారు; బయటివారెవరో దయాధర్మంగా ప్రసాదించేది కాదు అది. ప్రజలు తప్ప మరొకరెంత ప్రయత్నించినా, ఎంత పోరాడినా అది లభించదు. అందుచేత, దయాధర్మంగా ప్రజలకు విముక్తిని ప్రసాదించే ధోరణి, అందుకై వారి తరఫున పోరాడే ధోరణి తప్పు.

ప్రజలే తమ చరిత్రను తాము నిర్మించుకుంటారు. ప్రజల చైతన్యంమీద, ఇచ్ఛమీద వారి విముక్తి ఆధారపడుతుంది. వారే తమ అగ్రదళాన్ని ఎంచుకుంటారు. ఈ అగ్రదళంయొక్క నాయకత్వంక్రింద వారు సంఘటితులై, సొంత ప్రయత్నాలద్వారా తమ విముక్తికోసం పోరాడాలి. అలా జరిగినప్పుడే వారు తమ పోరాటాల ఫలితాన్ని పొందగల్గుతారు; దాన్ని నిలబెట్టుకోగల్గుతారు; గట్టిపరచుకోగల్గుతారు. ప్రజాశత్రువుల్ని ఓడించగలవారు ప్రజలే. మరోపద్ధతివల్ల ఇది సాధ్యంకాదు. ప్రజల చైతన్యంతోను, సమీకరణతోను నిమిత్తం లేకుండా, అగ్రదళం మాత్రమే ప్రజల విముక్తిని సాధించడం అసాధ్యం. ఇలాంటి పద్ధతివల్ల చరిత్ర ముందుకు పోదు; ఇట్టి పద్ధతివల్ల మనం దేన్నీ సాధించలేము. ప్రజల తక్షణ ప్రయోజనాలకు సంబంధించిన శిస్తుల తగ్గింపు, వడ్డీ

రేట్ల తగ్గింపు, స్వయం సహాయకసంఘాలు, సహకారసంఘాలు మొదలైన వాటికి సహితం యిదే వర్తిస్తుంది. వీటిని ప్రజలు స్వచ్ఛందంగాను, చైతన్యంతోను స్వీకరించకపోతే, బయటి వారెవరో వాటిని ప్రసాదించబోతే శిస్తుల తగ్గింపు కాగితం మీద మాత్రమే ఉంటుంది. సహకార సంఘాలు, స్వయం సహాయకసంస్థలు పేరుకు మాత్రమే ఉంటాయి.

కమ్యూనిస్టుల ఆశయం, ప్రజల ఆశయం ఒకటే. మన కార్యక్రమం, పాలసీ ఎంత సరియైన దైనప్పటికీ, ప్రజల ప్రత్యక్ష సహకారంగాని పోరాటంగాని లేకపోతే అవి అమలు జరగవు.

అందుచేత, మనకు సంబంధించినంతవరకు ప్రతీది ప్రజల చైతన్యం మీద, వారి స్వచ్ఛంద కార్యాచరణమీద ఆధార పడి యుంటుంది; వాటిని బట్టే ప్రతీది నిర్ణయింపబడుతుంది. అవి లేకపోతే మన మేమీ చేయలేము; మన మెన్ని ప్రయ త్నాలు చేసినా అవన్నీ వ్యర్థ మవుతాయి. మనం ప్రజల చైతన్యంమీద, వారి స్వచ్ఛంద కార్యాచరణమీద ఆధార పడుతూన్నంతకాలం, ఆ చైతన్యమూ కార్యాచరణా సరియై నవిగా ఉన్నంతకాలం, పార్టీ యిచ్చే సరియైన నాయకత్వం కూడా వాటికి కలిస్తే పార్టీ ఆశయం చివరకు సిద్ధించి తీరు తుంది. అందుచేత, ప్రజలు పూర్తిగా చైతన్యవంతులు కానప్పుడు, ప్రజల అగ్రదళమైన కమ్యూనిస్టులు అన్ని సమ యోచిత పద్ధతులద్వారా వారి చైతన్యాన్ని వృద్ధిచేయాలి. ఇది తొలిమెట్టు. ఇది ఎంత కష్టమయినా, ఎంతకాలం పట్టినా మొదట యీ కర్తవ్యాన్ని చక్కగా నెరవేర్చాలి.

తొలి మెట్టు యెక్కినతర్వాతే మనం రెండవ మెట్టు యెక్కగల్గుతాం. మరోవిధంగా చెప్పాలంటే, ప్రజలు తగినంత చైతన్యవంతు లయినప్పుడు, వారి కార్యకలాపాలను నడప డంలో మనం బాధ్యత వహించవలసి యుంటుంది. వారెలా సంఘటితపడాలో, ఎలా పోరాడాలో మార్గం చూపవలసి యుంటుంది. ఈ కర్తవ్యాన్ని నెరవేర్చగలిగిననాడు, ప్రజల ప్రత్యక్ష చర్యలద్వారా మనం వారి చైతన్యాన్ని మరింతగా వృద్ధిచేయవచ్చు. పార్టీ రూపొందించిన నినాదాలపై ప్రజలు పోరాడేటట్లు ఒక్కొక్క అడుగే వారిని నడపడం అంటే అర్థం ఇదే. ప్రజల ఆశయసిద్ధికి కమ్యూనిస్టులమైన మనమూ, ప్రజల్లోని అభ్యుదయకాముకులూ యింతకన్న ఉత్తమపాత్ర నిర్వహించడం కష్టం. ఇంతకన్న మనం ఎక్కువ ఆశించడంకూడా పొరబాటే. అలా ఆశిస్తే అనేక పొరబాట్లు - వ్యక్తిగత సాహసప్రదర్శన, హుకూమత్ తత్వం, నియంతృత్వం, ప్రజల యెడ దయాధర్మవైఖరి - బయల్దేరవచ్చు.

ప్రజల విముక్తికై జరిగే పోరాటంలో ప్రజలకు నాయకుడుగా, మార్గదర్శిగా మాత్రమే కమ్యూనిస్టు పనిచేయాలి. ప్రపంచాన్ని జయించేవీరుడుగా అతడు ప్రజలస్థానంలో ప్రవేశించి "వీరుడు"గా వ్యవహరించకూడదు. ప్రజలు విప్లవపోరాటంలో నాయకత్వం వహించడానికి దూరాలోచనగల, దృఢ నిశ్చయంగల నాయకుల్ని కోరుకుంటారు. విజయసాధనకు అట్టి నాయకులు వారికి చాల అవసరం. అంతేగాని, ప్రపంచాన్ని జయించే "వీరులు" వారి కవసరంలేదు. ఎందుచేతంటే, ప్రజలకు దూరంగావుండే "వీరులు" ప్రజల్ని విముక్తిచేయలేరు.

నాల్గవ విషయం : ప్రజలనుంచి మనం పాఠాలు నేర్చుకోవాలి. ప్రజలకు చక్కగా సేవచేయాలంటే, వారి చైతన్యాన్ని వృద్ధి చేయాలంటే, వారి కార్యకలాపాలను నడపాలంటే, కమ్యూనిస్టులమైన మనకు మొదట కొన్ని లక్షణా లుండాలి. ఉదాహరణకు దూరదృష్టి, లేక దూరాలోచన మనకెంతో అవసరం. దీని అర్థం, మనం విజ్ఞానవంతులమై యుండాలన్న మాట; మనకన్న తక్కువ విజ్ఞానం గలవారికి సహాయం చేయగలగాలన్నమాట. ప్రజల విముక్తికొరకు మన మెంత త్రికరణ శుద్ధిగా పనిచేసినా, ఎంత ఉత్సాహవంతులమైనా, ఎంత త్యాగ శీలురమైనా ప్రజల చైతన్యాన్ని విజయవంతంగా వృద్ధి చేసేటందుకు, వారిని నడిపేటందుకు, వారికి చక్కగా సేవచేసేటందుకు తగినంత విషయ పరిజ్ఞానం, అనుభవం, అప్రమత్తత ఉండాలి. ఇందుకై మనం నేర్చుకోవలసింది ఎంతో ఉంది.

మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలను అధ్యయనం చేయడం ద్వారా, విదేశాలలో ప్రజలు జరిపిన పోరాటాల చరిత్రను, వాటి పాఠాలను తెలుసుకోవడం ద్వారా మనం విజ్ఞానాన్ని పెంపొందించుకోవచ్చు. మన శత్రువులనుంచి కూడా కొన్ని విషయాలు నేర్చుకోవచ్చు. కాని అన్నిటికన్న ముఖ్య విషయ మేమంటే, ప్రజలనుంచి మనం పాఠాలు నేర్చుకోవాలి. ఎందు చేతంటే వారి అనుభవం, విషయపరిజ్ఞానం ఇంతా అంతా కాదు; అది ఆచరణకు సంబంధించినది. వారి సృజనాత్మక శక్తి అనంతం. కనుకనే కామ్రేడ్ మావ్, ప్రజలకు నేర్పే ముందు మనం వారినుంచి నేర్చుకోవాలని పదేపదే హెచ్చరించాడు.

మన కామ్రేడ్స్ నమ్రతతో ప్రజలనుంచి నేర్చుకున్నప్పుడే, వారి అనుభవాన్నీ విషయ పరిజ్ఞానాన్నీ క్రోడీకరించి క్రమబద్ధ మొనర్చినప్పుడే, వారిచైతన్యాన్ని వృద్ధిచేసేటందుకు నిర్దిష్టమైన చర్యలు తీసుకోగల్గుతారు; సరియైన నాయకత్వం వహించగల్గుతారు. ఇలా చేయడానికిబదులు, ప్రజలకు నాయకత్వం వహించే ఉద్దేశంతోను, వారి చైతన్యాన్ని వృద్ధిచేసే ఉద్దేశంతోను మనం కొన్ని అహంభావ పూరితమైన ఊహాజనితమైన స్కీములు తయారుచేస్తే, లేదా కొన్ని చారిత్రక అనుభవాలమీద విదేశాల అనుభవాలమీద ఆధారపడి కొన్ని కార్యక్రమాలు తయారు చేస్తే, అవన్నీ నిష్ప్రయోజన మవుతాయి. ప్రజల నుంచి మనం ఎడ తెగకుండా నేర్చుకోవాలనుకుంటే, ఒక్కనిమిషమైనా మనం ప్రజలకు దూరం కాకూడదు. అలా దూరమైతే, మన జ్ఞానం చాల పరిమితమవుతుంది; ప్రజల్ని నడపడాని కవసరమైన కుశాగ్రబుద్ధిగాని, విషయ పరిజ్ఞానంగాని, శక్తి సామర్థ్యాలుగాని మనకప్పుడు ఉండవు.

కామ్రేడ్ స్టాలిన్ యిలా చెప్పాడు:

"మనలో కొన్ని పై కమిటీలకంటె ఒక సామాన్య వ్యక్తి తరచు యదార్థానికి దగ్గరగా ఉంటాడు.

"...మన లక్ష్యసాధనకు నాయకత్వం వహించడానికి కేవలం మన అనుభవాలమీదనే, నాయకుల అనుభవాల మీదనే ఆధారపడితే చాలదు. సరియైన నాయకత్వం వహించడానికి నాయకుల అనుభవాలే కాక, పార్టీలో సాధారణ సభ్యుల అనుభవాలు, కార్మిక వర్గంయొక్క అనుభవాలు, కష్ట

జేష్ఠుల అనుభవాలు, 'అనామకులు'గా పరిగణింపబడే వారి అనుభవాలు కూడా మన కవసరం.

"ఇది యెలా సాధ్యమవుతుంది? నాయకులకూ ప్రజలకూ మధ్య, నాయకులకూ సాధారణసభ్యులకూ మధ్య, నాయకులకూ కార్మికవర్గం—రైతాంగం – కష్టజీవులైన మేధావులకూ మధ్య అత్యంతసన్నిహితమైన సంబంధాలున్నప్పుడే యివి సాధ్యమవుతుంది.

"ప్రజలతో సన్నిహిత సంబంధాలుంచుకొంటూ వాటిని గట్టిపరచుకోవడంలో, ప్రజలు చెప్పేదేమిటో వినడానికి సంసిద్ధత చూపడంలో – బోల్షివిక్ నాయకుల బలంవుంటుంది. నాయకులు అజేయంగా తయారవడానికి యిది తప్పనిసరిగా అవసరం." (స్టాలిన్: "పార్టీ కార్యవిధానంలో లోపాలు; ట్రాట్స్కీ-స్టుల్నీ యితర కపటవేషధారుల్నీ తొలగించడానికి తీసుకోవలసిన చర్యలు")

సోవియట్ యూనియన్‌లో కమ్యూనిస్టులకు స్టాలిన్ యిచ్చిన సలహా యిది. ఇది ప్రపంచానికంతకూ వర్తిస్తుంది.

నాయకుల, నాయకత్వసంస్థల కర్తవ్యం, ప్రజలకు సరిగా నాయకత్వం వహించడం; పరిస్థితిని గురించి సరియైన అభిప్రాయానికి రావడం; దాని కీలక మెక్కడుందో తెలుసుకోవడం; కర్తవ్యాలను నిర్వచించడం; నిర్ణయాలు తీసుకోవడం; ఆ నిర్ణయాలను అమలు జరపడానికి ప్రజల్ని సమీకరించి సంఘటిత పరచడం; ఈ మొత్తంపనిని అజమాయిషీ చేయడం. ఇవన్నీ సక్రమంగా జరగాలంటే, ప్రజలనుంచి ఎప్పటికప్పుడు నేర్చుకోవాలి; "ప్రజల్లో [illegible]యద్దరి, తిరిగి

ప్రజల్నే చేరుకోవడం" అనే పద్ధతిని అనుసరించాలి. లేకపోతే, సంతృప్తి కరమైన నాయకత్వం అసంభవమవుతుంది.

ప్రజలనుంచి నేర్చుకోవడమనే సూత్రాని కర్థ మిదే.

"సర్వం ప్రజల కోసమే" అను సూత్రం, ప్రజలకు బాధ్యత వహించాలనే సూత్రం, ప్రజల శక్తిలో విశ్వాస ముంచాలనే సూత్రం, ప్రజలనుంచి నేర్చుకోవాలనే సూత్రం —ఈ నాలుగూ మన ప్రజా సాన్నిహిత్య సూత్రాలు. అగ్రదళం ప్రజల విషయంలో పాటించవలసిన సూత్రాలు యివి. ఇట్టి ఖచ్చితమైన సూత్రాలతోనే మన కామ్రేడ్స్ తమ కార్యకలాపాల్లో, నాయకత్వం వహించడంలోను స్పష్ట మైన ప్రజాసాన్నిహిత్యపంథా అలవరచుకో గల్గుతారు.

కొంతమంది కామ్రేడ్స్ ట్రేడ్ యూనియన్, రైతు సంఘాలవంటి ప్రజా సంస్థల్లో పనిచేయడమే నిజంగా ప్రజల్లో పనిచేయడమని భావిస్తారు. ఇతర కార్యకలాపాల విషయం పట్టించుకోరు. ఇది చాల పొరబాటు. పార్టీ కార్య కలాపాలన్నీ లేదా పార్టీ నాయకత్వం అమలు జరపదలచిన కార్యక్రమా లన్నీ ప్రజల కార్యకలాపాలే. వాటిని అందరు ప్రజల సహ కారంతో, ప్రజా సాన్నిహిత్య సూత్రాల కనుగుణ్యంగా, ప్రజా సాన్నిహిత్య పంథాను ఆధారంగా చేసుకొని అమలుజరపాలి. ప్రతి పనిలోనూ ప్రజా సాన్నిహిత్య పంథా, ప్రజా సాన్నిహిత్య సూత్రాలు పాటించడం అవసరం.

పార్టీలో పనిచేయడంకూడా ఒకవిధంగా ప్రజల్లో పని చేయడమే. ఆ పని ప్రజాసాన్నిహిత్య పంథా ననుసరించి

ఉండాలి. కారణమేమంటే, పార్టీకూడా ప్రజల్లో ఒకభాగం; అది ప్రజాసేవకు తన యావచ్ఛక్తినీ వినియోగిస్తుంది.

సైన్యంలో పనిచేయడంకూడా ఒక విధంగా ప్రజల్లో పనిచేయడమే. ఈ పని ప్రజాసాన్నిహిత్య పంథా ననుసరించి ఉండాలి. కారణ మేమంటే, సైన్యంకూడా ప్రజల్లో ఒక భాగం; అదికూడా తన యావచ్ఛక్తినీ ప్రజాసేవకే వినియోగిస్తుంది.

వేర్వేరురంగాల్లో మనంచేసే పని వేర్వేరు పద్ధతుల్లో ఉంటుంది. ఉదాహరణకు కార్మిక సంఘాల్లోనూ, రైతుసంఘాల్లోనూ చేసే పని విధానం పార్టీలోనూ సైన్యంలోనూ చేసే పనివిధానంతో భేదిస్తుంది. అయినప్పటికీ, యివన్నీ ప్రజల్లో చేసే పనులే.

ప్రజలందరూ సహజంగా ఒకేవిధంగా ఉండరు. అందుచేత మన పనివిధానంకూడా వేర్వేరుగా ఉంటుంది. వివిధ రంగాల్లో పనిచేసే మన కామ్రేడ్స్ ఒక్కొక్కరూ ఒక్కొక్క తరగతి ప్రజలకు – ఉదాహరణకు ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికులకు, లేదా ఒక గ్రామంలో నివసించే రైతులకు, లేదా ఒక ఆఫీసులో పనిచేసే సిబ్బందికి, లేదా ఒక దళానికిచెందిన సైనికులకు, లేదా కేవలం కొంతమంది ప్రజలకు-ప్రత్యక్షంగా సేవ చేయాలి. అయితే అందరి ఆశయం చైనాప్రజలకు సేవ చేయడమే.

అందుచేత మన కామ్రేడ్స్ మొత్తంలో భాగానికీ, మొత్తానికీ గల సంబంధాన్ని సరిగా అర్థంచేసుకోవాలి. ఒక వైపు వారు ఏదో ఒకతరగతి ప్రజలకు ప్రత్యక్షంగా సేవ

చేస్తూనే, మరో వైపు మొత్తం విప్లవోద్యమానికి పరోక్షంగా బలం చేకూర్చుస్తున్నారు; మొత్తం ప్రజలకు సేవజేస్తున్నారు. వారిది, మొత్తంలో భాగానికి, మొత్తానికీకూడా సంబంధించిన పని. మొత్తంలో భాగాన్ని మాత్రమే చూస్తూ, మొత్తాన్ని నిర్లక్ష్యంచేయడం తప్పు; అలాగే మొత్తాన్ని మాత్రమే చూస్తూ మొత్తంలో భాగాన్ని నిర్లక్ష్యచేయడం పొరబాటు. మొత్తాన్నీ, మొత్తంలో భాగాన్నీ మనం సమన్వయ మొనర్చాలి.

ప్రజల పాక్షిక లేదా తాత్కాలిక ప్రయోజనాలకూ, మొత్తం లేదా దీర్ఘకాల ప్రయోజనాలకూ మధ్య సంఘర్షణ ఏర్పడినప్పుడు, మొత్తం ప్రయోజనాలు పాక్షిక ప్రయోజ నాలకన్న ప్రాధాన్యత వహించాలి; అలాగే దీర్ఘకాల ప్రయో జనాలు తాత్కాలిక ప్రయోజనాలకన్న ప్రాధాన్యత వహించాలి.

అంటే ఒక చిన్న కారణం కన్న పెద్దకారణా, చిన్న సిద్ధాంతం కన్న పెద్ద సిద్ధాంతం ప్రాధాన్యత వహించాలన్న మాట. ఇది చాల జటిలమైన సమస్య. ఒకానొక పరిస్థితిలో మన కామ్రేడ్స్ ఎలా ఆలోచించాలో, ప్రజల పాక్షిక ప్రయోజనాలనూ, మూల ప్రయోజనాలనూ ఎలా తెలుసు కొని సమన్వయ పరచాలో అర్థం చేసుకున్నప్పుడే, సమగ్ర మైన ప్రజా సాన్నిహిత్య పంథా ఏర్పడుతుంది. లేకపోతే, తెలిసిగాని తెలియకగాని ప్రజల్లో అధిక సంఖ్యాకుల దీర్ఘకాల ప్రయోజనాలకు విరుద్ధంగా కొందరి తాత్కాలిక ప్రయోజ

నాలను మాత్రమే బలపరచడం జరుగుతుంది. అప్పుడు ప్రజలకు మనం దూరమవుతాం.

అన్ని తరగతుల ప్రజల్లోను సర్వసాధారణంగా యితరులకంటె చురుకైన వారు కొందరు, మధ్యస్థంగా ఉండేవారు కొందరు, వెనుకబడినవారు కొందరూ ఉంటారు. ప్రాథమిక దశలో చురుకైనవారు సాధారణంగా అల్పసంఖ్యాకులుగా ఉంటారు. మధ్యస్థంగా ఉండేవారు, వెనుకబడి యున్నవారు అధిక సంఖ్యాకులుగా ఉంటారు. ప్రజా సాన్నిహిత్యపంథా ప్రకారం అధిక సంఖ్యాకులయెడ మనం ఎక్కువ శ్రద్ధవహించాలి. లేకపోతే, చురుకైనవారు ప్రజలనుంచి దూరమవుతారు; అప్పుడు ఏపనీ సంతృప్తికరంగా జరగదు. మనం ప్రజల ముందుంచే క్రియాత్మక నినాదాలు, పోరాట పద్ధతులు, నిర్మాణరూపాలు మధ్యస్థంగా ఉన్నవారి, వెనుకబడియున్న వారి ఆమోదాన్ని పొందేవై యుండాలి. వీరి విషయంలో సొంత చైతన్యం, సొంత చొరవ ఎక్కువ ప్రధానం. ప్రజా సామాన్యం మేల్కొన్నప్పుడే, కార్యరంగంలో ప్రవేశించడానికి వారు ఉత్సాహపడినప్పుడే ప్రజావుద్యమం సాధ్యమవుతుంది.

అందరికన్న చురుకైనవారు ప్రజా సామాన్యంలో నాయకులుగా తయారయేటట్లు చూడాలి. ఇందుకు వారిని విజ్ఞానవంతులుగా చేయడంలో, ఐక్యపరచడంలో, సంఘటిత పరచడంలో ప్రత్యేక శ్రద్ధవహించాలి. అయితే, ఒక విషయం మాత్రం అర్థంచేసుకోవాలి. వారికోసమే వారిని సంఘటిత పరచడం సరికాదు; వారిని మధ్యస్థంగా ఉన్నవారినుంచి, వెనుకబడి యున్నవారినుంచి వేరుచేయరాదు. మన ఉద్దేశం

చురుకైనవారిద్వారా మధ్యస్థంగా ఉన్నవారినీ, వెనుకబడి యున్నవారినీ ఆకర్షించి, వారిచేత పనిచేయించడం. మరో విధంగా చెప్పాలంటే, ప్రజల్లో సాధ్యమైనంత ఎక్కువమందిని సమీకరించడానికే చురుకైనవారిని సంఘటితపరచాలి. మధ్యస్థంగా ఉన్నవారు, వెనుకబడియున్నవారు నిద్రనుంచి ఇంకా మేల్కొనకపోతే, వారిని లేపడ మెలాగో మనం తెలుసుకోవాలి. అంతేకాదు, వారికోసం వేచియుండడ మెలాగో కూడ తెలుసుకోవాలి. అలా వేచియుండడాని కిష్టపడకపోతే, కొద్దిమంది చురుకైనవారితో మాత్రమే ముందు కురికితే, ప్రజలనుంచి మనం దూరమై విఫలులమవుతాం.

చైనా జనాభాలో రైతాంగం 100 కి 80 వంతు లున్నారు. అందుచేత, ప్రజల్లో అధిక సంఖ్యాకుల భావాలకు విలువ యివ్వడమంటే అర్థం, రైతుల అభిప్రాయాలకు విలువ యివ్వడ మన్నమాట. మన ప్రజాదృక్పథం గ్రామీణ దృక్పథంతో సన్నిహిత సంబంధం కలిగియుంది. ప్రస్తుత పరిస్థితుల్లో చైనా కార్మికవర్గం రైతాంగాన్ని నిర్లక్ష్యం చేసినా, గ్రామసీమల విముక్తికి ప్రత్యేక ప్రాముఖ్యత యివ్వకపోయినా, అది తన కర్తవ్యాన్ని నెరవేర్చజాలదు.

చైనా రైతాంగం, యితర తరగతుల ప్రజలు (విద్యార్థులు తప్ప) సాంస్కృతికంగా వెనుకబడి యున్నారు. అందుచేత, మన పనుల్లో వ్యక్తిగత గైడెన్సును జనరల్ ఆ దేశాలతో జతపరచడం చాల అవసరం. ప్రజల సాంస్కృతిక స్థాయి తక్కువగా ఉన్నప్పు జనరల్ ఆదేశాలు మాత్రమే ఉపయోగపడవు. కా మంటే: ప్రజలు, ముఖ్యంగా రైతాంగం

సర్వసాధారణంగా ప్రతి సమస్యనూ మన జనరల్ ప్రచారం, నినాదాల ఆధారంపై కాకుండా తమ సొంత అనుభవాల ప్రాతిపదికపై పరిశీలిస్తారు. మనం చేసేపనిలో ఒక్కొక్క అంశానికి ఉదాహరణలు చూపుతూ ఒక్కొక్కచోట గండికొట్టి, మిగతా విషయాలను ప్రజలే అర్థం చేసుకొనేటట్లు చూడాలి. ప్రజలకు ముఖ్యంగా మధ్యస్థంగా ఉన్నవారికి, వెనుకబడియున్న వారికి ఖచ్చితమైన ఉదాహరణ లివ్వడంద్వారానే వారిని ఉత్సాహపరచగల్గుతాం; వివిధ సమస్యలను వారు అర్థం చేసుకొనేటట్లు చేయగల్గుతాం; తద్వారా పార్టీ నినాదాలపై కార్యరంగంలో ప్రవేశించగల ధైర్యాన్ని, ఆత్మ విశ్వాసాన్ని వారిలో కలిగించ గల్గుతాం. అప్పుడే ప్రజల్లో మనం బ్రహ్మాండమైన ఉత్సాహాన్ని రేకెత్తించ గలం.

ఈ మధ్య సైనికయోధులు, కార్మికవీరులు, ఆదర్శ కార్మికులు వివిధప్రాంతాల్లో ప్రముఖపాత్ర వహించుతున్నారు; ప్రజల్లో అందరికన్న మంచి ప్రచారకులుగాను, నిర్మాతలుగాను వారు పనిచేస్తున్నారు. ఇందుకు కారణమేమంటే, అలాంటి ఉత్తమవ్యక్తులద్వారా, ఉదాహరణలద్వారా, అనుభవాలద్వారా ప్రజలు సులభంగా సమస్యలను అర్థం చేసుకొనేటట్లు చేయగల్గడం, ప్రజల చైతన్యమూ ఆత్మవిశ్వాసమూ వృద్ధి అయేటట్లు చేయగల్గడం. ఇదువల్లనే, విప్లవ స్థావరాలలో పునర్నిర్మాణ కార్యక్రమం చైనా ప్రజలందరినీ విజ్ఞానవంతు లొనర్చుతోంది; వారి చైతన్యాన్ని ఆత్మవిశ్వాసాన్ని అది వృద్ధిచేస్తూంది. నాయకులు తమ జనరల్ ఆదేశాలకు సహాయంగా ప్రజల అనుభవాలనుకూడా వాటికి జోడించేందుకు

ఒక్కొక్కచోట గండికొట్టేటప్పుడుకూడా యిట్టి సత్ఫలి తాలే కలుగుతాయి. ప్రజలు సాధారణంగా తమ అనుభ వాలతో సంబంధంలేని జనరల్ ఉత్తరువులను అర్థం చేసు కోడం కష్టం.

ఈ విధంగా మనం మొత్తాన్ని మెజారిటీనీ దృష్టిలో ఉంచుకొంటూ పాక్షికతత్వాన్నీ,సంకుచితత్వాన్నీ విడనాడాలి. ప్రజలతో మన మెప్పుడూ సన్నిహిత సంబంధా లుంచుకోవాలి. నిరంకుశత్వాన్నీ, యుద్ధప్రభువుల తత్వాన్నీ వ్యతిరేకించాలి.

ప్రజల్ని మనం ముందుకు నడపాలని కోరుతాం; ఐతే హుకూమత్ తత్వాన్ని ఎదుర్కొంటాం. ప్రజలతో మనం సన్నిహిత సంబంధా లుంచుకోవాలని కోరుతాం; అయితే గుడ్డిగా అనుసరించే పద్ధతిని కోరం. ప్రజల చైతన్యాన్ని వృద్ధి చేసే టప్పుడు, వారిని ముందుకు నడిపేటప్పుడు మనం జ్ఞాపక ముంచుకోవలసిన విషయ మేమంటే: ఏ స్థాయిలో ప్రజ లున్నారో అక్కడే మనం ప్రారంభించాలి. మన కార్యకలా పాల్లో అత్యున్నతమైన సిద్ధాంతాలను ప్రజాసాన్నిహిత్య పంథాతో సమన్వయ పరచాలి. ఇదే మన ప్రజాసాన్ని హిత్య పంథా. దీన్ని అమలు జరపడం కష్టమనేమాట నిజమే. అయితే మంచి మార్క్సిస్టుగా, కమ్యూనిస్టుగా తయారు కావ డానికి యిదొక్కటే మార్గం.

పై వివరణ కార్యక్రమానికి సంబంధించినది.



శిర

# 2

# పార్టీ సభ్యత్వం

**18** సంవత్సరాల వయస్సు వచ్చినతర్వాతనే ఎవరినైనా పార్టీసభ్యులుగా తీసుకోవాలని నిబంధనావళిలో ఉంది. ఎందుచేతంటే ఆ వయస్సు తర్వాతనే సాధారణంగా ప్రతివ్యక్తి స్థిరత్వంగల రాజకీయనిర్ధారణలకు రాగలుగుతాడు.

అయితే, పార్టీ నిబంధనావళి సవరింపబడకముందు, 18 సంవత్సరాలకంటె తక్కువ వయస్సుగలవారిని పార్టీసభ్యులుగా తీసుకొనియుంటే, అట్టివారు తమ సభ్యత్వాన్ని కోల్పోరు.

అంతకన్న తక్కువ వయస్సు ఉన్నప్పటికీ ఒక యువకుడు రాజకీయంగా పరిపక్వత సంపాదించియుంటే, అనగా 18 సంవత్సరాల వయస్సు రాకముందే పార్టీసభ్యత్వానికి అర్హత సంపాదించియుంటే, అట్టి వ్యక్తిని ప్రత్యేకపరిస్థితుల్లో తాత్కాలిక సభ్యుడుగా (ప్రొబేషనరీ) తీసుకోవచ్చు. అలా తీసుకోకపోతే పార్టీకి నష్టం కలుగుతుందని కూడా భావిస్తేనే వారిని తీసుకోవాలి. అట్టివారికి పూర్తి సభ్యత్వం 18 సంవత్సరాల వయస్సు వచ్చినతర్వాత యివ్వాలి. ఈ వయో పరిమితితోపాటు, కొత్తసభ్యుల్ని చేర్చుకొనేటప్పుడు పార్టీ వారి

వారి సాంఘిక హోదానుబట్టి 4 తరగతులుగా విభజించింది. చైనాలో నేటి సామాజిక పరిస్థితులదృష్ట్యా అట్టి వర్గీకరణ అవసరమైంది.

మొదటి తరగతి క్రిందికి కార్మికులు, రోజు కూలీలు, పాలేర్లు, పేదరైతులు, పట్టణపేదలు, విప్లవ సైనికులు వస్తారు. ఇట్టివారిని సిఫార్సు చేసేవారి అర్హతలు, తాత్కాలిక సభ్యత్వానికి విధింపబడే షరతులు ఇతరులకంటె సులభంగా ఉంటాయి. అనగా పార్టీలోకి శ్రామికుల్నీ, అర్థశ్రామికుల్నీ సభ్యులుగా తీసుకొనేటప్పుడు ప్రత్యేక నిబంధన లేవీ లేవన్న మాట. చిన్నప్పటినుంచీ విప్లవకారులతోనే జీవితం గడిపిన వారి విషయం కూడా ఇంతే.

పట్టణ పేదలు అంటే అర్థం, దివాళాతీసిన చేతివృత్తుల వారు, మూటల వర్తకులు, పట్టణాలలో ఉద్యోగాలు సంపాదించడంలో విఫలమనోరథులైన రైతులు, ఏరోజు కూలి ఆరోజే సంపాదించుకొని పొట్టపోసుకొనే రోజు కూలీలు.

మధ్య తరగతినుంచి వచ్చిన విప్లవకారులు రెండవ తరగతికి చెందుతారు. వారిని సభ్యులుగా చేర్చుకోవడానికి ఎక్కువ అనుభవం గల పార్టీ సభ్యులు సిఫార్సు చేయాలి; అంతేగాక, సంవత్సరం వరకూ వారు తాత్కాలిక సభ్యులుగా వుండాలి. ఇందుకు కారణం ఏమంటే ఈ తరగతికి చెందిన వారి ఆలోచనా విధానం సాధారణంగా ఎక్కువ క్లిష్టమైనది. అంతేకాక, వారు తరచు మనపార్టీలో క్రమశిక్షణనుగురించి, విప్లవ పోరాటాలలో పాల్గొనడాన్ని గురించి అనేక సందేహాలు కలిగి వుంటారు. అందుచేత వీరిని ఇతరులకంటె ఎక్కువ

కాలం తాత్కాలిక సభ్యులుగా వుంచాలి. వారిని సిఫారసు చేసేవారు ఎక్కువ అనుభవంగల పార్టీ సభ్యులై వుండాలి.

నిబంధనావళిలో పేర్కొన్న "జీతం తీసుకొనే ఉద్యోగులు" అనే శబ్దం క్రిందికి పాత ప్రభుత్వపు ఉన్నతాధికారులెవరూ రారు.

చైనా విప్లవం ఇంకా దేశవ్యాపితంగా విజయం సాధించనందున, అధిక ప్రాంతంలో పార్టీ ఇంకా రహస్యంగానే వున్నందున, మన పార్టీలో సభ్యులుగా చేరడానికి కుతూహల పడుతూ అందుకు మార్గం దొరకని విప్లవకారులు అనేక మంది ఉన్నారు. అందుచేత ఇటీవల విప్లవం వ్యాపించిన ప్రాంతాలలో మొదటి తరగతివారిని, రెండవ తరగతివారిని పార్టీ సభ్యులుగా తీసుకొనేటప్పుడు సిఫారసు చేసేవారి అర్హతలను తాత్కాలికంగా తగ్గించాలనీ, తాత్కాలిక సభ్యత్వ కాలాన్ని కూడా తగ్గించాలనీ నిబంధనావళి చెబుతూంది. ఐతే యిట్టి నిర్ణయాలను రాష్ట్రకమిటీ లేదా సరిహద్దు రీజియన్ కమిటీమాత్రమే చేయాలి.

మూడవ తరగతి క్రిందికి వచ్చేవారు పూర్వపు దోపిడీ వర్గాలలో పై శ్రేణికి, మధ్య శ్రేణికి చెందిన విప్లవకారులు. వీరి ఆలోచనా విధానం మరింత క్లిష్టమైనది. పార్టీ కార్యక్రమాన్ని, క్రమశిక్షణను మరింత కష్టంతో వీరు అంగీకరిస్తారు. అందుచేత, పార్టీలో చేరడానికి వారు పంపుకునే దరఖాస్తులు అనుభవంగల పార్టీసభ్యుల సిఫారసుపొందాలి. ఉన్నతస్థాయి గల పై కమిటీ ఆమోదించాలి. అట్టివారిని రెండేండ్లవరకు

తాత్కాలిక సభ్యులుగా ఉంచాలి. ఇదీ నిబంధనావళిలో ఉన్న షరతు.

ఇతర రాజకీయవిశ్వాసాలు కలిగి, యితర రాజకీయ పార్టీలలో లేదా గ్రూపులలో చేరినవారు నాల్గవ తరగతిక్రిందికి వస్తారు. అట్టివారి సభ్యత్వదరఖాస్తును ఇంకా ఎక్కువ అనుభవముగల పార్టీసభ్యులు సిఫార్సుచేయాలి. ఇంకా ఉన్నత స్థాయి గల పై కమిటీ పరిశీలించి ఆమోదించినతర్వాతే, వారిని తీసుకోవాలి. ఇలా తీసుకోనేటప్పుడు ఆ వ్యక్తి మరొక రాజకీయపార్టీలో సాధారణసభ్యుడా? బాధ్యతగల సభ్యుడా? లేక ప్రముఖస్థానంలో ఉన్న నాయకుడా-అని ఆలోచించాలి. ఒకవ్యక్తి, తన్ను బలవంతంగా కోమింటాంగ్ పార్టీలో చేర్చుకున్నారని, లేదా అందులో గ్రూపులుగా చేర్చుకోనేటప్పుడు తాను చేరడానికి వ్యతిరేకించానని, లేదా చేరినతర్వాత తాను ఆ సంస్థతాలూకు రాజకీయ కార్యకలాపాల్లో పాల్గొనలేదని - ఋజువుచేస్తే, అతని సాంఘిక హోదాకు వర్తించే నిబంధనలకనుగుణ్యాంగా అతన్ని పార్టీలోకి తీసుకోవచ్చు. అతన్ని ఇతర రాజకీయసంస్థలకు చెందిన వ్యక్తిగా పరిగణించకూడదు.

సాధారణంగా యితర రాజకీయపార్టీలకు చెందినవారు ఆయాపార్టీలను విడిచిపెట్టిన తర్వాతనే మనపార్టీలో సభ్యులుగా చేర్చుకోబడతారు.

ట్రేడ్ యూనియన్లు, రైతు సంఘాలు, సాంస్కృతిక సమితులవంటి సంస్థలలో సభ్యులుగా ఉంటూ, ఏ రాజకీయ పార్టీలోగాని గ్రూపుల్లోగాని చేరని వ్యక్తుల్ని వారి వారి సాంఘిక హోదానుబట్టి పార్టీలో చేర్చుకోవాలి.

పార్టీలో యిదివరకు సభ్యుడుగా ఉండి, తరువాత పార్టీ నుంచి వెళ్ళిపోయిన ఒక వ్యక్తి తిరిగి సభ్యత్వం కోసం దరఖాస్తు పెట్టుకుంటే, అతడు నాల్గవ తరగతి నిబంధనను అనుసరించాలి. కారణ మేమంటే రాజకీయంగా అతను ఊగిసలాట ప్రదర్శించడంవల్ల, ఎక్కువ అనుభవంగల పార్టీ సభ్యులు సిఫార్సు చేయవలసి వుంటుంది. ఉన్నతమైన పై కమిటీయే విచారణ జరపవలసి వుంటుంది. అయితే, అతని తాత్కాలిక సభ్యత్వ కాలాన్ని జనరల్ గా తగ్గించవచ్చు.

పార్టీతో ఒక సభ్యునికి గల సంబంధాలు తన ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా తెగిపోయినట్లైతే, తిరిగి అతడు పార్టీలో చేరడానికి పెట్టుకొన్న దరఖాస్తును అంగీకరించాలి. రాష్ట్ర కమిటీగాని, సరిహద్దు రీజియన్ కమిటీగాని, మరొక పై కమిటీగాని అతని దరఖాస్తును ఆమోదించిన వెంటనే అతనికి సభ్యత్వమియ్యాలి. కొత్త సభ్యులు దరఖాస్తు పెట్టుకొన్నప్పుడు అనుసరించవలసిన పద్ధతులన్నిటినీ అతడు అనుసరించ నవసరం లేదు.

పార్టీలో చేరడానికి దరఖాస్తు పెట్టుకొన్న ప్రతి కొత్త సభ్యుడు అందు కవసరమైన పద్ధతులన్నిటినీ స్వయంగా పాటించాలని నిబంధనావళి చెప్తోంది. అంటే, అతడు స్వయంగా వెళ్ళి దరఖాస్తు ఈయాలి. దరఖాస్తు ఫారంమీద అతడు సంతకం చేయాలి. ఎవరైతే సిఫార్సు చేస్తారో వారి ఉత్తరాలు తీసుకెళ్లాలి. అప్పుడు అతని దరఖాస్తును పార్టీ శాఖయొక్క సర్వసభ్య సమావేశం చర్చించి నిర్ణయం చేస్తుంది. ఆ తరువాత పై కమిటీ ఆమోదించాలి. గ్రూపులుగా చేర్చుకొనే సభ్యత్వం

చెల్లదు. సభ్యుల్ని చేర్చుకొనేటప్పుడు అనుసరించవలసిన ఉత్సవాలు వేర్వేరు ప్రాంతాలలో వేర్వేరుగా ఉండవచ్చు.

సిఫారసు చేసిన వారి బాధ్యతలు, కొత్త సభ్యుల్ని చేర్చుకొనే విషయంలో నిర్ణయాలు తీసుకొనే పార్టీకమిటీల బాధ్యతలు నిబంధనావళిలో పేర్కొనబడ్డాయి. అవి చాల ముఖ్యమైన నిబంధనలు. వాటిని అన్ని స్థాయిల పార్టీ కమిటీలు ఖచ్చితంగా అమలు జరపాలి.

జపాను వ్యతిరేకయుద్ధం ప్రారంభమైన తర్వాత మన పార్టీ ఎంతగానో అభివృద్ధి చెందింది. పదివేలమంది సభ్యులు మన పార్టీలో చేరారు. దాదాపు 1000 కౌంటీ కమిటీలు, అనేకవేల పార్టీశాఖలు ఏర్పడ్డాయి. ఈ విధంగా మనపార్టీ విముక్తప్రాంతాల్లో $9\frac{1}{2}$ కోట్ల ప్రజల్ని అనేక వీరోచిత పోరాటాల్లో సంఘటిత పరచి నడిపింది. జపాన్ ఆక్రమితప్రాంతంలోను, కొమింటాంగ్ పాలనక్రింద ఉన్నచోట్ల ప్రజల విప్లవ పోరాటాల కది నాయకత్వం వహించింది. ఇవన్నీ అద్భుతమైన విజయాలు. కాని కొన్ని పార్టీ కమిటీలు కొత్తసభ్యుల్ని చేర్చుకొనే విషయంలోను, పార్టీయూనిట్లను సంఘటితపరచే విషయంలోను కొన్ని పొరబాట్లు చేశాయి.

కొన్ని పార్టీకమిటీలకు – ముఖ్యంగా రాష్ట్ర, సరిహద్దు ప్రాంత కమిటీలకు, రీజినల్ కమిటీలకు, కౌంటీ కమిటీలకు – బాధ్యతగల నాయకత్వం లేకపోయింది. నిర్దిష్టమైన కార్యక్రమంగాని, నాయకత్వంగాని అవి యివ్వలేకపోయాయి. గత అనుభవాలను క్రోడీకరించలేకపోయాయి. పార్టీని నిర్మించడంలో కొత్త సభ్యుల రిక్రూట్‌మెంటు ఎంతో ప్రాధాన్యత

వహిస్తున్నప్పటికీ, యీ కమిటీలు సాధారణ పార్టీ శాఖలకో, సబ్ డిస్ట్రిక్టు కమిటీలకో యీ బాధ్యత యిచ్చారు. లేదా ఫలానా తేదీకి ఫలానా సంఖ్య అని కోటాలుమాత్రమే ఇచ్చారు. తత్ఫలితంగా, సభ్యత్వాన్ని విస్తృతపరిచే కార్యక్రమం దాదాపు వదలివేయబడింది; బాధ్యతతో నడిపేవారు లేకపోయారు. అంతేకాదు. రుజువర్తనగాని, రాజకీయ నిజాయితీగాని, అనుభవంగాని లేనివారికిసైతం కొత్తసభ్యుల్ని చేర్చుకొనే బాధ్యత, క్రింది యూనిట్లను నిర్మించేబాధ్యత యివ్వబడింది. ఇందువల్ల పార్టీయొక్క నిర్మాణ పారిశుధ్యం, కాఠిన్యం చాలవరకు దెబ్బ తిన్నాయి. పార్టీలోకి అన్నిరకాలైన దుర్జనులు, అనుమానాస్పదులు ప్రవేశించడమే గాక, కొన్ని పార్టీ శాఖలు సహితం అవాంఛనీయులతో నిండిపోయాయి. పై కమిటీలలో సరియైన నాయకత్వం లేకపోవడంవల్లనే మన పార్టీ శాఖల్లో యిట్టి ఘటనలు జరిగాయి. ఈ పరిస్థితిని తొలగించాలన్నా, తిరిగి అలాంటి ఘటనలు జరక్కుండా చూడాలన్నా బలోపేతమైన కార్మిక వర్గ పార్టీని నిర్మించాలన్నా – అన్ని పార్టీ కమిటీలు, ముఖ్యంగా పై కమిటీలు, కొత్త సభ్యుల్ని చేర్చుకొనే కార్యక్రమానికి తగినంత ప్రాముఖ్యత యివ్వాలి. ఈ కర్తవ్యాన్ని సరిగా నెరవేర్చడానికి గత అనుభవాన్ని కూడా క్రోడీకరించాలి.

గ్రామసీమల్లోఎలాంటివారినిపార్టీలోకితీసుకోవాలి:శత్రువుకు వ్యతిరేకంగా జరిగిన పోరాటాల్లో, శిస్తులతగ్గింపు, వడ్డీరేట్ల తగ్గింపుకోసం జరిగినపోరాటాల్లో, ఉత్పత్తిని ఎక్కువచేసే కార్యక్రమంలో, తదితర విప్లవ పోరాటాల్లో చురుకుగా పాల్గొన్న వారినీ, సిద్ధాంతరీత్యా నిజాయితీగల వారినీ పార్టీలో చేర్చు

కోవాలి. అట్టి పోరాటాలుగాని ఉద్యమాలుగాని అభివృద్ధి చెందనిచోట్ల కొంతమంది చైతన్యవంతుల్ని మాత్రమే తీసుకుంటే సరిపోతుంది. అలాంటిచోట్ల పెద్ద యెత్తున సభ్యుల్ని చేర్చుకోకూడదు. అనేక ఉద్యమాలు అభివృద్ధిచెంది, చురుకైనవారు అనేకమంది బయల్దేరితేనే, తగినంత ప్రచారం పరిశీలన జరిగిన తర్వాతనే చాలమందిని సభ్యులుగా తీసుకోగలం. అట్టి ఉద్యమాలు మన గ్రామసీమల్లో అసమానస్థాయిలో అభివృద్ధి చెందుతున్నాయి. అందుచేత చురుకైన వారుకూడా అసమాన స్థాయిలోనే బయలుదేరుతున్నారు. కాబట్టి కొత్త సభ్యుల్ని చేర్చుకొనే కార్యక్రమం అన్నిప్రాంతాల్లోనూ ఒకే విధంగా ఉండదు. కొత్త సభ్యుల్ని చేర్చుకోవలసిందని అన్ని ప్రాంతాలకూ ఒకసర్వవ్యాపిత విజ్ఞప్తి చేయకూడదు. ప్రత్యేక పరిశీలనపై, నిర్దిష్టమైన విజ్ఞప్తులపై ఆధారపడి మన మిందుకు పూనుకోవాలి.

సాయుధ దళాల్లో, ఫ్యాక్టరీల్లో, ప్రభుత్వ కార్యాలయాల్లో, విద్యాలయాల్లో కొత్త సభ్యుల్ని చేర్చుకొనే పద్ధతి కూడా యిలాగే ఉంటుంది. అట్టిచోట్ల తగినంత ప్రచారం, ప్రబోధం చేసిన తర్వాత, యుద్ధాలు తదితర పోరాటాల్లో మంచి లక్షణాలు ప్రదర్శించిన వారిని పార్టీలోకి తీసుకోవచ్చు.

కొత్త సభ్యుల్ని చేర్చుకొనే ఉద్యమాన్ని ప్రారంభించే ముందు పార్టీ కార్యక్రమాన్ని, పాలసీని, నిబంధనావళిని చురుకైన వారిలో ప్రచారం చేయాలి.

ఈ బాధ్యత అంతా నిజాయితీగల కార్యకర్తలకు, పార్టీ నిర్మాణంలో అనుభవజ్ఞులకు, సిద్ధాంత పారిశుద్ధ్యం

గలవారికి, సరియైన కార్యవిధానంగలవారికిమాత్రమే వప్ప గించాలి. వారంతా పోరాటాల్లో రాటుదేరినవారై యుండాలి. అట్టివారు దొరక్కపోతే కొందరిని తరిఫీదుచేయాలి. ఈ కార్య క్రమాన్నంతటినీ అమలుజరిపేటప్పుడు ఎడ తెగకుండా స్పష్ట మైన సలహాలు, సూచనలు యిస్తూ వుండాలి. పార్టీ ఆర్గ నైజర్లంటే వీరే. ఇలా రాటుదేరిన, తరిఫీదు పొందిన ఆర్గ నైజర్లు ప్రతి రీజినల్, కౌంటీ కమిటీలోను, సబ్ డిస్ట్రిక్టు కమిటీ లోను ఉండాలి. కొత్తసభ్యుల దరఖాస్తులను ఆమోదించే విష యంలో వీరు జరిపే సంభాషణలమీద, విచారణలమీద పార్టీ కమిటీలు పూర్తి విశ్వాసముంచాలి. ఈ విధంగా, కొత్త సభ్యుల రిక్రూట్ మెంటు క్రమబద్ధమయిన ఒక కార్యక్రమంగా రూపొందుతుంది; పార్టీ యొక్క నాయకత్వం, కంట్రోలు ఇందుకు చాల అవసరం.

కొత్తసభ్యుల రిక్రూట్ మెంటు ప్రతి పార్టీశాఖయొక్క రెగ్యులర్ కార్యకలాపాల్లో ఒకభాగం. ఇందుకు కొందరు ఆర్గ నైజర్లు ఉన్నారుకదా అని, ఏపార్టీశాఖ యీవిషయంలో మౌనం వహించకూడదు. అయితే, పార్టీశాఖ లోకనైపు కొత్తసభ్యుల్ని చేర్చుకుంటూంటే, పై కమిటీలుకూడా ఎప్పటి కప్పుడు సలహాలు, సూచనలు యిస్తూఉండాలి. ఇలా సల హాలు, సూచనలు యివ్వడంలో అవి అన్నిపరీక్షలకు నిలబడ్డ ఆర్గనైజర్లమీద ఆధారపడాలి.

నిబంధనావళిలో పేర్కొన్నట్లు, కొత్తసభ్యుల్ని సిఫారసు చేసేవారు దరఖాస్తుదారుని గురించి యదార్థమైన, బాధ్యతతో కూడిన సమాచారం యివ్వాలి. దరఖాస్తుదారునికి సభ్యత్వ

మీాయవచ్చునని పైకమిటీ నిర్ణయించేటప్పుడు లాంఛన ప్రాయంగా కాక ఎంతో బాధ్యతతో ఆలోచించాలి.

క్లుప్తంగా చెప్పాలంటే, పార్టీ సభ్యత్వాన్ని పెంచే పని సక్రమపద్ధతిలో జరగాలి. అప్పుడు ప్రజల్లో ఎక్కువ చైతన్యవంతులైనవారు పార్టీలో సభ్యులుగా చేరుతారు. ఇందుకు పార్టీశాఖలు, సాధారణ సభ్యులు తీవ్రకృషి చేయడంతోపాటు, పై కమిటీలుకూడ సరియైన నాయకత్వం వహించాలి.

విముక్తప్రాంతాల్లో పార్టీసభ్యత్వం చాల హెచ్చుగా ఉన్నప్పటికీ, సగంగ్రామాల్లో పార్టీశాఖలే లేవు. వీటిలో ఒక్క పార్టీసభ్యుడుకూడా లేని గ్రామాలున్నాయి. సగంకన్న ఎక్కువ పార్టీశాఖలున్న గ్రామాలు కొద్దిపాటి సరిహద్దు ప్రాంతాల్లోనే ఉన్నాయి. మిగతాప్రాంతాల్లో పార్టీసభ్యులే లేని గ్రామాలు సగానికిపైగా ఉన్నాయి.

పార్టీ నాయకత్వాన్ని శక్తివంత మొనర్చాలంటే, ప్రతి గ్రామంలోను ఒక పార్టీశాఖ ఉండాలి; ఒక్కొక్క శాఖలో కొద్దిమంది లగాయతు అనేకమందివరకు సభ్యులుండాలి. అందుచేత, విముక్త ప్రాంతాల్లో కొత్త సభ్యుల్ని చేర్చుకోవడం, కొత్త శాఖలను నిర్మించడం యథాప్రకారంగా కొనసాగాలి. ఈమధ్య పార్టీశాఖలుగల గ్రామాల్లో శత్రువుకు వ్యతిరేకంగా అనేక పోరాటాలు జరగడంవల్ల, శిస్తుల తగ్గింపు, వడ్డీరేట్లతగ్గింపుకోసం పోరాటాలు జరగడంవల్ల, ఉత్పత్తినిపెంచడానికతీవ్రకృషిజరగడంవల్ల, కార్యవిధానంలో త్రైమార్గసంస్కరణను అవలంబించడంవల్ల, కార్యకర్తలను పరిశీలించే కార్య

క్రమం తీసుకోవడంవల్ల కార్యకర్తలు లనేకమంది ముందుకు వచ్చారు. వారిలోనుంచే మనం పార్టీసభ్యుల్ని చేర్చుకోవాలి. కొత్తగా విముక్తి చేయబడిన ప్రాంతాల్లో పార్టీసభ్యుల్ని రిక్రూట్ చేసుకోడానికి ఉద్యమం కొనసాగించవలసిన అవసరం మరింతగా ఉంది. విముక్తప్రాంతాల్లో ఇంకా ఎక్కువసభ్యుల్ని చేర్చుకోవడం పార్టీయొక్క ప్రధాన నిర్మాణ కర్తవ్యాలలో ఒకటి. ఈ కర్తవ్యాన్ని పైన చెప్పిన విధంగా సక్రమపద్ధతిలో నెరవేర్చాలి. ఇదివరలో జరిగిన పొరపాట్లు తిరిగి జరక్కుండా జాగ్రత్తపడాలి.

కొత్త సభ్యుల రిక్రూట్ మెంటుగాని, పార్టీ యూనిట్లను శక్తివంత మొనర్చే కార్యక్రమం గాని యితర కార్యకలాపాలతోనూ, ప్రజా పోరాటాలతోనూ, సంబంధం లేకుండా జరక్కూడదు. ఈ కార్యకలాపాల్లోను, పోరాటాల్లోను చురుగ్గా పాల్గొన్నవారి నుంచే కొత్త సభ్యుల్ని చేర్చుకోవలసి యుంటుంది. ఈ కార్యకలాపాల ద్వారానే, పోరాటాల ద్వారానే పార్టీశాఖలను సబ్ డిస్ట్రిక్టు కమిటీలను, కౌంటీకమిటీలను శక్తివంత మొనర్చ గల్గుతాం. ఉదాహరణకు ఒక గ్రామపార్టీ యూనిట్ను తీసుకుందాం. అక్కడప్రజలు శిస్తురేట్లు, వడ్డీరేట్లు తగ్గింపును సాధించుకోవడంలో ఉత్పత్తిని ఎక్కువచేయడంలో ఆ యూనిట్ నాయకత్వం వహించాలి. తద్వారా అక్కడి ప్రజల వర్గచైతన్యాన్ని పెంపొందించాలి. వారి జీవనప్రమాణాన్ని వృద్ధిచేయాలి. అంతేకాదు. శత్రువుకు వ్యతిరేకంగా ప్రజలు సాగించే పోరాటంలో వారిని కాపాడ్డాని కొక మంచి సాయుధదళాన్ని

నిర్మించాలి. ఎన్నికలద్వారా ప్రజలు రాజకీయాధికారంయొక్క ప్రాధాన్యతను గ్రహించేటట్లు చేయాలి. సహకారోద్యమం లోను, సాంస్కృతిక రంగంలోను, ఆరోగ్యరక్షణలోను సత్ఫలితాలనిచ్చే పనులు చేయాలి. ఇవన్నీ జయప్రదంగా నెరవేర్చడంద్వారానే ఆ యూనిట్ సంఘటితపడుతుంది. ఇట్టి కార్యకలాపాలద్వారా స్థానికపార్టీయూనిట్లు ప్రజలతో సన్నిహిత సంబంధా లేర్పరుచుకొని, వారి చైతన్యాన్ని అభివృద్ధిచేసి, వారి అనుభవాన్ని పెంపొందించగల్గుతాయి గనుక, అవి ఎక్కువ బలాన్ని సంపాదించగల్గుతాయి. అంతేగాక, వాటి ఆంతరంగిక బలంకూడా పెరిగి, పార్టీపాలసీని మరింత చక్కగా అర్థంచేసుకోగల్గుతాయి; క్రియారంగంలో మరింత అనుభవం సంపాదించగల్గుతాయి.

ఆరవపార్టీ మహాసభలో ఆమోదింపబడిన నిబంధనావళి క్రొత్త పార్టీ సభ్యులకు తాత్కాలిక సభ్యత్వగడువెంత ఉండాలో చెప్పలేదు. కాని ఆచరణలో స్థానిక పరిస్థితులనుబట్టి రెండు నెలలనుంచి సంవత్సరంవరకు తాత్కాలిక సభ్యత్వానికి గడువు నిర్ణయింపబడుతోంది. గ్రామసీమల్లో తాత్కాలిక సభ్యత్వం రెండు లేక మూడు నెలలు అంటే అర్థం ఇంచుమించు లేదనే చెప్పవచ్చు. ప్రభుత్వ కార్యాలయాలు, స్కూళ్లు, సాయుధ దళాల విషయంకూడా యింతే. తాత్కాలిక సభ్యుల కత్యంత ప్రధానమైన విద్యాబోధ, సిద్ధాంత ప్రచారం ఎక్కడా అమలు జరగడంలేదు.

క్రొత్త నిబంధనావళి తాత్కాలిక సభ్యులకు మూడు విధాలైన సభ్యత్వగడువులు నిర్ణయించింది. కొందరికి 6 నెలలు,

మరికొందరికి ఏడాది, యితరులకు రెండేళ్లు. అయితే, ఏపార్టీ కమిటీలో కొత్తసభ్యుడుంటాడో ఆకమిటీ సభ్యత్వగడువును పెంచవచ్చు; లేదా తగ్గించవచ్చు. నిబంధనావళిలో స్పష్టంచేసి నట్లు తాత్కాలిక సభ్యత్వానికి గడువు నిర్ణయించడంలో ఉద్దేశం, అట్టి సభ్యులకు ప్రాథమికమైన పార్టీ విద్యగరపడం, వారి రాజకీయగుణగణాలను తెలుసుకొనే అవకాశం ఆ కమిటీకి కలిగించడం. అంటే కొత్త సభ్యునికి విద్యగరపడం, అతన్ని పరిశీలించడం పార్టీయొక్క నిర్మాణబాధ్యతల్లో ఒకటన్నమాట. లేకపోతే, తాత్కాలిక సభ్యత్వమనే మాటకు అర్థమేఉండదు. ప్రతి తాత్కాలిక సభ్యుడు పార్టీ నిబంధనావళిని, కార్యక్రమాన్ని, పార్టీ పాలసీని అర్థంచేసుకునేటట్లు సహాయం చేయాలి. కమ్యూనిస్టు దృక్పథం అలవరచుకొనేటట్లు, నిర్మాణం యెడల, శ్రమయెడల, ప్రజలయెడల సరియైన దృక్పథమేర్పరచుకొనేటట్లు చూడాలి. వాస్తవ విషయాల లోని యదార్థం తెలుసుకోవడ మెలాగో - అంటే భౌతికవాద దృక్పథమంటే ఏమిటో - అతనికి నేర్పాలి.

పార్టీని విడిచి వెళ్లిపోయే హక్కు ప్రతి పార్టీసభ్యునికీ వుంది. కనుకనే, పార్టీ నిబంధనావళి ప్రకారం, ఏ సభ్యుడైనా తాను పార్టీనుంచి వెళ్లిపోతానని దరఖాస్తు పెట్టుకుని, తన వద్ద నున్న పార్టీ డాక్యుమెంట్లను, రికార్డులను స్వాధీనం చేసిన తర్వాత, అతని పేరు పార్టీసభ్యుల జాబితాలో లేకుండా కొట్టి వేయాలి. దీని అర్థమేమంటే, పార్టీనుంచి వైదొలగడం నిర్నిబంధం, స్వేచ్ఛాయుతం. పార్టీలో చేరడానికిమాత్రం నిబంధన లుంటాయి.

పార్టీసభ్యుల్ని తొలగించే హక్కునుగురించి నిబంధనావళి పేర్కొంది. ఒక వ్యక్తి ఏ స్థాయిగల పార్టీకమిటీలో సభ్యుడుగా ఉన్నప్పటికీ, అతన్ని పార్టీనుంచి తొలగించాలంటే, ఆ కమిటీ యొక్క విస్తృత సమావేశం అట్టి నిర్ణయంచేయాలి; ఆ నిర్ణయాన్ని పై కమిటీ ఆమోదించాలి.



99



3

# పార్టీసభ్యుల విధులు, హక్కులు

నూతన నిబంధనావళిలో పార్టీసభ్యుల విధులు, హక్కులు పేర్కొనబడ్డాయి. వాటి సహాయంతో పార్టీ అంతరంగిక జీవితం మరింత చక్కగా అభివృద్ధిచెందుతుంది; పార్టీ సభ్యుల కార్యకలాపాలు మరింత ఉన్నతస్థాయి నందుకొంటాయి; వారు పార్టీయెడల మరింత బాధ్యతతో వ్యవహరించగలరు; క్రియారంగంలో పార్టీ మరింత ఐక్యతను సాధించగల్గుతుంది.

ప్రతి పార్టీసభ్యుడు తన చైతన్యస్థాయిని పెంపొందించుకోడానికి ప్రయత్నించాలని, నిబంధనావళి చెబుతోంది. మార్క్సిజం - లెనినిజం యొక్క మూలసూత్రాలనూ, మావ్ చైనా విప్లవ సిద్ధాంతాన్నీ అర్థంచేసుకోవాలని అది నిర్దేశిస్తూంది. ఎందుచేతనంటే, పార్టీ సభ్యుడు ప్రజల హక్కులను కాపాడే విషయంలో తగినంతగా కృషిచేయగలడా, లేడా అనేది దీనిపైనే ఆధారపడియుంటుంది. ఉన్నతమైన చైతన్యస్థాయి, మూలసిద్ధాంతాల అవగాహన లేకపోతే, పార్టీ సభ్యుడు చైతన్యంతోనూ సరిగానూ ప్రజల హక్కులకోసం కృషిచేయలేడు; మంచి పార్టీసభ్యుడుగా తయారుకాలేడు.

మార్క్సిజం - లెనినిజం, మావ్ చైనా విప్లవసిద్ధాంతం నిర్దేశిస్తున్న ప్రకారం పార్టీయొక్క నిర్మాణ ఐక్యత, పార్టీ సభ్యుల సిద్ధాంత ఐక్యతపై ఆధారపడి యుంటుంది. అది లేక పోతే, నిర్మాణంలోనూ, ఆచరణలోనూ ఐక్యతకు పునాదు లుండవు; స్వచ్ఛంద ప్రాతిపదికపై పార్టీలో క్రమశిక్షణ ఏర్పడదు; ఒండొరుల మధ్య తగాదాలు బయల్దేరుతాయి. ప్రజల హక్కులకోసం పార్టీ చేసే కృషికి ఆటంకాలేర్పడవచ్చు. అందుచేత పార్టీలో సభ్యులకుండవలసిన చైతన్యాన్నిగురించి నొక్కిచెప్పడం అవసరం. మొత్తం పార్టీకార్యకలాపాలన్నీ ప్రధా నంగా సభ్యుల చైతన్యంమీద, చొరవమీద ఆధారపడాలి. ఒకవైపు పార్టీ సర్వవిధాలా తన సభ్యుల చైతన్యాన్ని అభివృద్ధి చేస్తుంది; మరోవైపు ప్రతి పార్టీసభ్యుడు సొంతంగా నేర్చుకో డానికి శాయశక్తులా ప్రయత్నించాలి; తన భావాలు మరింత స్పష్టంగా ఉండేందుకతడు ఎప్పటికప్పుడు తన చైతన్యస్థాయిని వృద్ధిచేసుకోడానికి ప్రయత్నించాలి. అందుచేత పార్టీసభ్యుల విధులలో యిది ప్రథమస్థాన మలంకరిస్తుంది.

పార్టీ నిబంధనావళిలో యీ అంశాన్ని ప్రత్యే కంగా పేర్కొనడంలో అర్థం ప్రతి పార్టీసభ్యుడు ప్రజల హక్కులకై పోరాడ్డానికే అధ్యయనం చేయాలన్నమాట; మరొక ఉద్దేశంతో కాదన్నమాట. ఇంకోవిధంగా చెప్పా లంటే మార్క్సిజం - లెనినిజంగురించీ, మావ్ చైనా విప్లవ సిద్ధాంతంగురించీ నిర్విరామంగా తెలుసుకోవడం, తన చైతన్యస్థాయిని వృద్ధిచేసుకోడం, తన భావాలను తీర్చి దిద్దుకోవడం పార్టీపట్ల, ప్రజలపట్ల ప్రతిసభ్యుడూ తప్పక

నిర్వర్తించవలసిన విధి. పార్టీసభ్యులు తమదృష్టిని అధ్యయనం మీద కేంద్రీకరించకపోతే, దానియెడల అపసవ్యనైఖరిని ప్రదర్శిస్తే, అహంభావంతో తమ్ము తాము చక్కజేసుకోడానికి ప్రయత్నించకపోతే, ప్రజలయెడల వారు బాధ్యతారహిత నైఖరిని ప్రదర్శిస్తున్నారన్నమాట.

తర్వాతివిషయం: ప్రతి పార్టీసభ్యుడు ఖచ్చితంగా క్రమశిక్షణను పాటించాలనీ, పార్టీయొక్క రాజకీయ జీవితంలో చురుగ్గా పాల్గొనాలనీ, పార్టీవిధానాన్నీ, పార్టీయూనిట్ల నిర్ణయాలనూ అమలుజరపాలనీ, పార్టీ శ్రేయస్సుకు విరుద్ధమైన ప్రతివిషయాన్నీ పార్టీలోను, బయిట ఎదుర్కోవాలనీ - నిబంధనావళి ఆదేశిస్తోంది. ఈ విధులు చాలకాలంనుంచి అందరిచేత గుర్తింపబడ్డవే.

పార్టీయొక్క నిర్మాణకార్యకలాపాల్లోనే గాక, దాని ఆంతరంగిక రాజకీయ జీవితంలోకూడ ప్రతి పార్టీసభ్యుడూ చురుగ్గా పాల్గొనవలసిన అవసరాన్ని నొక్కి చెప్పాలి. కారణమేమంటే, పార్టీకి సంబంధించిన అన్ని విషయాల్లోనూ పార్టీసభ్యులు రాజకీయ ప్రాతిపదికపై పాల్గొనాలి; రాజకీయంగా పార్టీకి వారు బాధ్యతవహించాలి. పార్టీ ఎన్నికల్లోను, సమావేశాల్లోను, నిర్ణయాలు చేయడంలోను చురుగ్గా పాల్గొనడం ద్వారా ప్రతి పార్టీసభ్యుడు బాధ్యతాయుత నైఖరిని ప్రదర్శించగల్గుతాడు.

ఎట్టి పరిస్థితులలోనూ పార్టీసభ్యులు పార్టీకి హాని చేయకూడదు; పార్టీ ప్రయోజనాలకు నష్టంకలిగించే ఏపనీ చేయ

కూడదు. పార్టీ ప్రయోజనాలకు ప్రమాదం తెచ్చిపెట్టే ప్రతి విషయాన్నీ పార్టీలోను, బయట ఎదుర్కోవాలి.

నిబంధనావళి ప్రకారం, పార్టీకి ప్రజలతోగల సంబంధాలను దృఢతరంచేయడానికి ప్రతి పార్టీసభ్యుడు ప్రజలకు సేవ చేయాలి; సకాలంలో ప్రజల అవసరాలను తెలుసుకుని రిపోర్టు చేయాలి. వారికి పార్టీ పాలసీని వివరించాలి.

ప్రతి పార్టీసభ్యుడు పార్టీ శిక్షణను పాటించడమే గాక, విప్లవ ప్రభుత్వంయొక్క చట్టాలను, ఉత్తరువులనుకూడా అమలుజరపడంలో ఆదర్శప్రాయంగా మెలగాలనీ, విప్లవ సైనిక దళాల, విప్లవ ప్రజాసంస్థల, విప్లవ సంఘాల శిక్షణను పాటించాలనీ నిబంధనావళి పేర్కొంటూంది. పార్టీ సభ్యులంతా విప్లవ కార్యకలాపాల్లో ఆదర్శప్రాయులుగా మెలగాలి; పార్టీ శిక్షణను విప్లవ ప్రభుత్వంయొక్క, విప్లవసంస్థల యొక్క శిక్షణతో జోడించి అమలుజరపాలి. ఏ పార్టీసభ్యుడైనా యీ విషయంలో విఫలమైతే, పార్టీ శిక్షణను ఉల్లంఘించిన వాడవుతాడు. ఈ రెండు విధులు ఒకదాని కొకటి విరుద్ధమనుకొనే కామ్రేడ్స్ తమ పొరపాటును సవరించుకోవాలి.

చాలకాలంనుంచీ మనపార్టీ పెద్దదిగానే ఉంటూ వచ్చింది; ఇప్పుడది యింకా పెద్దది. అంతేగాక విముక్త ప్రాంతాల్లో అది ప్రభుత్వాధికారంలోకూడా ఉంది. విప్లవ జీవితమే వృత్తిగాగల కొద్దిమందితప్ప, అత్యధిక సంఖ్యాకులైన పార్టీసభ్యులు ఏదో ఒకవృత్తి చేసుకుంటూ ఉండాలి; అందులో నైపుణ్యం సంపాదించాలి. మన మెంత విప్లవోత్సాహం ప్రదర్శించినా, వేర్వేరు వృత్తులలో నైపుణ్యం సంపాదించకపోతే

ప్రజల్ని సరిగా నడపలేం; బలీయమైన, సుభిక్షమైన దేశాన్ని నిర్మించలేం.

ప్రతి పార్టీసభ్యునికి యీ క్రింది హక్కులుంటాయని నిబంధనావళి స్పష్టంచేస్తూంది :

1. పార్టీ సమావేశాల్లోను, పార్టీ పాలసీని అమలుజరిపే విషయంలోను ఉత్పన్నమయే వివిధసమస్యలపై, సాహిత్యం ప్రచురించే విషయంలోను స్వేచ్ఛాయుతమైన, సమగ్రమైన చర్చలలో పాల్గొనేహక్కు.

2. పార్టీలో ఎన్నుకొనే హక్కు, ఎన్నుకోబడేహక్కు.

3. కేంద్రకమిటీవరకు ఏ పార్టీయూనిట్కైనా సూచనలుగాని, స్టేట్మెంట్లుగాని పంపే హక్కు.

4. పార్టీ సమావేశాల్లో ఏ పార్టీకార్యకర్తనైనా విమర్శించేహక్కు.

పార్టీసభ్యుల హక్కులనుగురించి పేర్కొన్న పైవిషయాలు సాధారణసభ్యుల కార్యకలాపాలనూ, వారి బాధ్యతాయుత వైఖరినీ నిస్సందేహంగా పెంపొందిస్తాయి. పార్టీ శ్రేయస్సుకు భంగకరమైన విషయాలన్నిటినీ ఎదుర్కొనడాని కివి చక్కని అవకాశమిస్తాయి. అహంభావపూరితమైన, తలబిరుసుతో కూడిన నిరంకుశత్వాన్ని, హుకూమత్ తత్వాన్ని సమర్థవంతంగా ప్రతిఘటించడంలో ఇవి పార్టీ చేతిలో బలమైన ఆయుధాలుగా ఉపయోగపడతాయి. నాయకులకూ, సాధారణ సభ్యులకూ మధ్యగల సంబంధాన్ని చక్కజేయడంద్వారా మొత్తం పార్టీకార్యకలాపాల్ని చక్కజేయడాని కివి తోడ్పడతాయి.

సభ్యుల యీ హక్కులను మనమంతా గౌరవించాలి. అయితే తరుచు యిందుకు విరుద్ధంగా జరుగుతూవచ్చింది. ఉదాహరణకు పార్టీసమావేశాల్లో కొంతమంది కామ్రేడ్స్ తమ అభిప్రాయాలకు విరుద్ధమైన అభిప్రాయాలను ప్రకటించకుండా చేయడానికి అనేక ఉపాయాలు కనిపెట్టారు. ఎన్నికల్లో ప్రతిబంధకాలు పెట్టారు. పార్టీసభ్యులు పై కమిటీలకు తమ సూచనలుగాని, స్టేట్‌మెంట్లుగాని పంపరాదని నిషేధం పెట్టారు. పార్టీసభ్యుల అప్పీళ్ళను పై కమిటీలకు పంపకుండా ఆపియుంచడమో, కాలయాపన చేయడమో చేశారు. పార్టీసమావేశాల్లో బాధ్యతగల నాయకుల్ని సాధారణ సభ్యులు విమర్శించకుండా ఆంక్షలు విధించారు. పార్టీసభ్యులు విమర్శన, ఆత్మ విమర్శనల్లో పాల్గొన్నందుకు ప్రతీకారచర్యలు సహితం తీసుకున్న ఉదాహరణలు లేకపోలేదు; హానికరమైన యిట్టి పద్ధతులను పూర్తిగా నిర్మూలించాలి.

మన పార్టీలో మైనారిటీ, మెజారిటీ నిర్ణయాలను పాటించితీరాలనే సూత్రాన్ని అమలు జరుపుతూనే, మైనారిటీ యొక్క హక్కులనుకూడా మనం గౌరవించాలి. మెజారిటీ నిర్ణయాలకు కట్టుబడియుండే షరతుపై, మైనారిటీ సభ్యులు తమ అభిప్రాయాలను తెలియజేయడానికి, సమావేశాల్లో మెజారిటీకి వ్యతిరేకంగా ఓటు చేయడానికి హక్కు ఉంది. మైనారిటీ పట్ల చెడుగా ప్రవర్తించకుండా, మెజారిటీచే మైనారిటీ అన్యాయానికి గురికాకుండా చూడవలసినబాధ్యత పార్టీ యూనిట్లమీద ఉంది. తమ అభిప్రాయమే సరియైనదని మైనా

రిటీ భావిస్తే, తమ అభిప్రాయాలను తాము ఉంచుకోవచ్చు. అయితే మెజారిటీ నిర్ణయాలకు వారు కట్టుబడియుండాలి.

పార్టీలో ప్రజాస్వామ్యం అమలు జరగాలంటే, మైనారిటీ సభ్యుల ఈ ప్రాథమిక హక్కులను కాపాడాలి; అలా కాపాడ్డం అందరి విధి. కారణమేమంటే, కొన్ని పరిస్థితుల్లో, మైనారిటీ అభిప్రాయమే సరియైనది కావచ్చు, మెజారిటీ అభిప్రాయం తప్పుకావచ్చు. సాధారణ పరిస్థితుల్లో మెజారిటీ అభిప్రాయమే సరియైనప్పుడు, మనం మైనారిటీకి పై హక్కులిస్తాం. వారు తమ పొరబాటు అభిప్రాయాలను సరిదిద్దుకోడానికి అవకాశమివ్వడమే దీని ఉద్దేశం.

పార్టీ సమావేశాల్లో ఏ కార్యకర్తనైనా, ఎంతబాధ్యత గల సభ్యుణ్ణయినా విమర్శించడం ప్రతిపార్టీ సభ్యుని జన్మహక్కు అని నిబంధనావళి స్పష్టం చేస్తోంది. కొన్ని ప్రదేశాల్లో ప్రస్తుతం అమలు జరుగుతున్న పద్ధతి యిందుకు వ్యతిరేకంగా ఉంది. బాధ్యులైనవారిని విమర్శించకుండా కొన్నిచోట్ల ఆంక్షలు విధిస్తున్నారు. ఇది చెడ్డఅలవాటు అనీ, దుష్టపద్ధతి అనీ చెప్పవలసి యుంటుంది. ఎందుచేతంటే, యిది నిరంకుశత్వాన్ని, హుకూమత్ తత్వాన్ని ప్రోత్సహిస్తుంది. సాధారణసభ్యుల చొరవను, బాధ్యతాయుత వైఖరిని ఇది స్తంభింపజేస్తుంది. అందుచేత యీ అలవాటును సరిదిద్దుకోవలసియుంది. ఇందుకు సంబంధించిన నిబంధన పార్టీ మహాసభచే ఆమోదింపబడిన తర్వాత ఈ అలవాటు యిక సహింపబడదు. ఒక పార్టీసభ్యుడు ఏ పార్టీ కార్యకర్తనైనా విమర్శించదలచుకున్నప్పుడు,

ఆ విమర్శనను ఆటంకపరిస్తే అది పార్టీ నిబంధనావళిని ఉల్లం ఘించే చర్యగా పరిగణింపబడుతుంది.

ఒకవ్యక్తి, తాను యితరుల్ని నొప్పిస్తున్నానని భయ పడకుండా, తన అభిప్రాయాన్ని స్వేచ్ఛగా ప్రకటించగలిగి నప్పుడే, పార్టీసభ్యులు అన్ని విషయాలనూ దాపరికంలేకుండా చెప్పగల్గుతారు. దీన్ని మనం అర్థంచేసుకోవాలి. ఇలాంటి దృక్పథం ఉన్నప్పుడే, పార్టీలో ఆంతరంగిక ఐక్యతను, క్రమ శిక్షణను బలీయమొనర్చగల్గుతాం.

ఎన్నికలు సాధ్యమైనప్పుడు, అవసరమైనప్పుడు పార్టీ నిబంధనావళి ప్రకారం ఆ ఎన్నికల్లో పాల్గొనేహక్కు ప్రతిపార్టీ సభ్యునికి ఉంది. నాయకత్వకమిటీలకు ఎన్నుకోబడే హక్కు ప్రతిపార్టీసభ్యునికి ఉంది. నిబంధనావళి విధించిన షరతులుతప్ప అదనపు షరతులేవీ విధింపబడకూడదు.

పార్టీసభ్యుల సూచనలనుగాని, స్టేట్‌మెంట్లనుగాని, అప్పీళ్ళనుగాని అన్ని స్థాయిలలోని కమిటీలు ఆలస్యం చేయ కుండా పైకమిటీలకు పంపాలి.

పార్టీసభ్యుల యీ ప్రజాస్వామ్య హక్కులను రక్షిం చడంద్వారానే, మనం నిర్మాణానికిగాని, రాజకీయాలకుగాని, సిద్ధాంతాలకుగాని సంబంధించని మాటలను, చేతలను సాధ్య మైనంతవరకు తగ్గించగల్గుతాం; బాతాఖానీలను అరికట్ట గల్గుతాం. అప్పుడు సాధారణ సభ్యుల విమర్శనలు, మాటలు, చేతలు బాధ్యతతో, సవ్యమైన మార్గంలో, పార్టీశ్రేయస్సు కనుగుణ్యంగా ఉంటాయి.

ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని అవకాశంగా తీసుకొని, పార్టీలో సభ్యులుగా ఉండేకొందరు విధ్వంసకులు, గూఢచారులు, పార్టీవ్యతిరేకులు విధ్వంసకచర్యలకు పూనుకొనే ప్రమాదం ఉన్నమాట నిజమే. కాని సాధారణ సభ్యులు అలాంటి కార్యకలాపాలను ఎన్నటికీ సహించరు. అట్టివారిని తొలగించడంలో నాయకత్వకమిటీలకు పూర్తిసహకారమిస్తారు.

మన పార్టీలో ఉన్న లోపాలన్నిటినీ సరిదిద్దుకోవాలనే మాట నిజమే. అయితే, పార్టీ సభ్యులలో చొరవను, బాధ్యతాయుత వైఖరిని ప్రోత్సహించడంద్వారానే యిది సాధ్యమవుతుంది. అప్పుడే పార్టీయొక్క జీవశక్తిని కాపాడుతూ, దాన్ని అత్యున్నత స్థాయికి అభివృద్ధిచేయగల్గుతాం. పార్టీ సభ్యులందరిలోను చొరవను పెంపొందించడానికి, బాధ్యతాయుత వైఖరిని వృద్ధిచేయడానికి నిబంధనావళిలో పైహక్కులు యివ్వబడ్డాయి. పార్టీసభ్యులందరూ ఒండొకరుల లోపాలను సరిదిద్దవలసిన బాధ్యతను నిర్వర్తించడానికి, పార్టీలో మంచిఅలవాట్లను ప్రోత్సహించడానికి, పార్టీ కార్యకలాపాలను వృద్ధిచేయడానికి, పార్టీని అత్యంత బలీయమైన పునాదులమీద నిర్మించడానికి— ఈ హక్కులను వినియోగించుకొంటారని ఆశిస్తున్నాను.



108

4

# పార్టీలో కేంద్రీకృత ప్రజాస్వామ్యం

మన పార్టీ కేవలం పార్టీసభ్యుల సముదాయం మాత్రమే కాదు. అదొక నిర్దిష్టమైన సిద్ధాంతాని కనుగుణ్యంగా స్థాపింపబడిన ప్రత్యేక సంఘటితసంస్థ. నాయకుల్నీ, సాధారణ సభ్యుల్నీ అది సమైక్యపరుస్తుంది. కేంద్రీకృత ప్రజాస్వామ్య మనే ఖచ్చితమైన సిద్ధాంతాన్ననుసరించి కేంద్రకమిటీ, వివిధ స్థాయిలలో ఏర్పడ్డ పార్టీయూనిట్లు, పార్టీ సాధారణసభ్యులు కలిసి పనిచేసే నిర్మాణస్వరూపమే పార్టీ.

ఒక ఫ్యాక్టరీలోగాని, గ్రామంలోగాని ముగ్గురు పార్టీ సభ్యులు అన్యోన్యంగా కలిసిఉన్నంతమాత్రంచేత పార్టీ యూనిట్ ఏర్పడదు. వారు కేంద్రీకృత ప్రజాస్వామ్యమనే సిద్ధాంతానికే కట్టుబడి సంఘటితమవాలి. సాధారణ పరిస్థితుల్లో ఆ ముగ్గురిలో ఒకడు నాయకుడుగా ఉంటాడు. మిగతా యిద్దరూ సభ్యులు. ఈ విధంగా అన్ని కార్యకలాపాల్లోను ఒక నాయకుడు, యిద్దరు అనుచరులు ఉంటారు. అప్పుడే ఆ గ్రూపు పార్టీయూనిట్ అవుతుంది. ఈ విధమైన నిర్మాణం నూతనశక్తి నిస్తుంది. కార్మికవర్గంయొక్క బలం నిర్మాణంలోనే ఉంటుంది.

పార్టీ నిబంధనావళి ప్రకారం, కేంద్రీకృత ప్రజాస్వామ్యమంటే అర్థం, ప్రజాస్వామ్యంపై ఆధారపడు కేంద్రీకృత విధానం; కేంద్ర నాయకత్వంక్రింద అమలుజరిగే ప్రజాస్వామ్యం. ఇందులో ప్రజాస్వామ్యం, కేంద్రీకృత విధానం కూడా వున్నాయి. నాయకులకూ,అనుచరులకూ గల సంబంధం, పై కమిటీలకూ, క్రింది కమిటీలకూ గల సంబంధం, వ్యక్తిగత పార్టీసభ్యులకూ, మొత్తం పార్టీకీ మధ్యగల సంబంధం, కేంద్ర కమిటీనుంచి, అన్నిస్థాయిల కమిటీలకూ, సాధారణ సభ్యులకూ గల సంబంధం ఇందులో ప్రతిబింబిస్తుంది.

ప్రజాస్వామ్యంపై ఆధారపడు కేంద్రీకృత విధానమంటే అర్థమేమిటి? పార్టీయొక్క నాయకత్వ కమిటీలన్నీ సాధారణ సభ్యులచే ప్రజాస్వామ్య పద్ధతిప్రకారం ఎన్నుకోబడతాయి; వారి విశ్వాసాన్ని అవి పొందుతాయి. సాధారణ సభ్యులు, లేదా వారి ప్రతినిధులు పార్టీతీర్మానాలను, పాలసీలను నిర్ణయిస్తారు. అవి ప్రజాస్వామ్య పద్ధతిప్రకారం సాధారణ సభ్యులనుండి కేంద్రీకృతరూపం ధరిస్తాయి. వాటిని నాయకులు, సాధారణ సభ్యుల సహకారంతో నిర్విరామంగా అమలు జరుపుతారు. నాయకత్వ కమిటీకిగల అధికారం పార్టీ సభ్యులిచ్చేదే. అందుచేత పార్టీసభ్యుల తరఫున అవి పార్టీ వ్యవహారాలన్నిటిలోను కేంద్రీకృత నాయకత్వం వహించడానికి, క్రింది కమిటీలచేత పార్టీసభ్యులచేత, తాము చెప్పినట్లు చేయించడానికి అధికారం కలిగియుంటాయి. ప్రతి వ్యక్తీ సంస్థకు, మైనారిటీ మెజారిటీకి, క్రింది యూనిట్లు పై యూనిట్లకు, అన్ని యూనిట్లూ కేంద్ర కమిటీకి లోబడి యుండాలనే సూత్రాన్ని

బట్టి పార్టీలో ఒక క్రమవిధానం ఏర్పడుతుంది. అంటే, పార్టీ యొక్క కేంద్రీకృత విధానం ప్రజాస్వామ్యం నుంచి వేరుపడకుండా, దాని ఆధారంమీద అభివృద్ధి చెందుతుందన్నమాట. అది వ్యక్తుల నియంతృత్వం కాదన్నమాట.

కేంద్ర నాయకత్వంక్రింద అమలుజరిగే ప్రజాస్వామ్యమంటే ఏమిటి? ప్రతిపార్టీ సమావేశాన్ని నాయకత్వ కమిటీ పిలవాలి; సరియైన నాయకత్వంక్రింద ఆ సమావేశం జరగాలి. ప్రతి తీర్మానాన్ని లేదా నిర్ణయాన్ని చర్చకుపెట్టేముందు సమగ్రంగా, జాగ్రత్తగా ఆలోచించాలి. ప్రతి ఎన్నికకు ముందు అభ్యర్థుల జాబితాను జాగ్రత్తగా తయారుచేయాలి. పార్టీ కంతకూ ఒక సమైక్య నిబంధనావళి, సమైక్యశిక్షణ ఉంటాయి. వీటిని పార్టీసభ్యులందరూ పాటించాలి. సమైక్య కమిటీ చెప్పినట్లు సభ్యులంతా చేయాలి. దీన్నిబట్టి ఆంతరంగిక ప్రజాస్వామ్య మంటే నాయకత్వం లేని ప్రజాస్వామ్యం కాదన్నమాట; అతిప్రజాస్వామ్యం కాదన్నమాట; అరాచకత్వం కాదన్నమాట.

కేంద్రీకృత ప్రజాస్వామ్య మంటే, పార్టీ నాయకుల్నీ సాధారణ సభ్యుల్నీ ఐక్యపరిచే ఒక క్రమపద్ధతి. మరోవిధంగా చెప్పాలంటే నాయకత్వ కమిటీ సాధారణ సభ్యుల అభిప్రాయాలన్నిటినీ సమన్వయపరచి, వాటిని సభ్యులందరిచేత అమలు జరిపిస్తుంది. ఇట్టి క్రమవిధానమే కేంద్రీకృత ప్రజాస్వామ్యం. ఇది పార్టీలో ప్రజా సాన్నిహిత్యపంథాయొక్క వ్యక్తీకరణ.

కొంతమంది కామ్రేడ్స్, పార్టీలో కేంద్రీకృత విధానం ప్రజాస్వామ్యంపై ఆధారపడియుండాలనే విషయం అర్థంచేసు

కోసు. అందుచేత వారు తమ నాయకత్వాన్ని ఆంతరంగిక ప్రజాస్వామ్యంతోగాని, సాధారణసభ్యుల అభిప్రాయాలతో గాని సంబంధంలేనట్లు వేరుచేసి చూస్తారు. కేంద్రీకృత ప్రజా స్వామ్యం అంటే "కేంద్రీకృత విధాన"మని అర్థంచెబుతారు. తాము నాయకులుగా అధికారంలో ఉండడానికి పార్టీసభ్యుల ఆదేశం అవసరమని వీరు గుర్తించరు; తామే దాన్ని స్వయముగా హస్తగతం చేసుకోవచ్చుననుకుంటారు. ఎన్నికల అవసరంగాని, పార్టీసభ్యుల, క్రింది కమిటీల విశ్వాసంగాని లేకుండానే నాయకత్వహోదాల్లో ఉండవచ్చుననుకుంటారు. తమ పాలసీలు, తీర్మానాలు సాధారణ సభ్యులచే ప్రజాస్వామ్య పద్ధతిపై కేంద్రీకృతమవాలనీ, ఆ తర్వాత తాము నిర్ణయాలు చేయాలనీ వీరు భావించరు; వాటిని నిరంకుశంగా జారీచేయవచ్చుననుకుంటారు. సాధారణసభ్యులతో కలిసిఉండడానికి బదులు, వారికంటె ఎత్తుగా అందలమెక్కి కూర్చుంటారు. పార్టీకి వీరు హుకుములు జారీచేస్తారు; పార్టీయంత్రాన్ని కంట్రోలుచేస్తారు. పార్టీయూనిట్లపై పెత్తనం చెలాయిస్తారు. పార్టీనిర్మాణంలోనే ఉండి పనిచేయాలనిగాని, పార్టీ కంట్రోలుకు లోబడాలనిగాని వీరనుకోరు. ఆంతరంగిక ప్రజాస్వామ్యం పేరుతో వీరు పై కమిటీల ప్రసక్తిలేకుండా స్వతంత్రంగా వ్యవహరించగోరుతారు. కాని ఆంతరంగిక కేంద్రీకృతం పేరుతో పార్టీసభ్యుల, క్రింది యూనిట్ల ప్రజాస్వామ్య హక్కులను మాత్రం కాలరాస్తారు. నిజానికి వీరు క్రింది వారియెడల ప్రజాస్వామ్యంగాని, పై వారియెడల కేంద్రీకృత విధానంగాని పాటించరు.

ఇతరులు మెజారిటీనిర్ణయాలను, పార్టీశిక్షణను అమలు జరపాలని వీరు ఆదేశాలిస్తారు; కాని తాము మరోవిధంగా చేయవచ్చు ననుకుంటారు. వ్యక్తి సంస్థకు, మైనారిటీ మెజారిటీకి, క్రింది కమిటీలు పై కమిటీలకు లోబడియుండాలని వీరు గుర్తించరు. వీరి అభిప్రాయంలో పార్టీనిబంధనలు, తీర్మానాలు సాధారణసభ్యులకేగాని, నాయకులకు కాదు. ఇది పార్టీలో ప్రజాస్వామ్యానికి వ్యతిరేకమైన నిరంకుశధోరణి. సమాజంలో ఐశ్వర్యవంతుల ఆలోచనావిధానం ఈ ధోరణిలో ప్రతిబింబిస్తుంది. మన పార్టీయొక్క కేంద్రీకృత విధానంతో దీని కెట్టి సంబంధం లేదు. అయితే యీ పెడమార్గం మన పార్టీలో ఇప్పటికీ ఉంది. అందుచేత దీన్ని పూర్తిగా నిర్మూలించాలి.

మరికొందరు కామ్రేడ్స్, పార్టీలో ప్రజాస్వామ్యం అంటే అర్థం కేంద్రనాయకత్వంక్రింద అమలుజరిగే ప్రజాస్వామ్యం అని అర్థం చేసుకోరు. అందుచే తమకు తమ చర్యలను కేంద్ర నాయకత్వంనుంచి, మొత్తం పార్టీనుంచి వేరుచేసి చూస్తారు. మొత్తం పరిస్థితిని గాని, మొత్తం పార్టీయొక్క దీర్ఘకాల ప్రయోజనాలనుగాని వారు పట్టించుకోరు. తమ ప్రయోజనాలను, తమ అభిప్రాయాలను బట్టి వారు పార్టీలో విశృంఖలంగా వ్యవహరిస్తారు. పార్టీశిక్షణను వారు పాటించరు. పై కమిటీల నిర్ణయాలను అమలు జరపరు. నిర్మాణంతో గాని, రాజకీయాలతోగాని, సిద్ధాంతాలతోగాని ఎట్టి సంబంధం లేని మాటలలోను, చేతలలోను వారు నిమగ్నులౌతారు. పార్టీలో తగాదాలు వ్యాపింపచేయడానికి వారు ఉద్దేశపూర్వకంగా

అపేక్షయోక్తులకైనా దిగుతారు; లేక అంతులేని బాతాఖానీ లలో, వాగ్వాదాలలో కాలంగడుపుతారు. క్లిష్టపరిస్థితిగాని, అసాధారణ స్థితిగాని ఏర్పడిందా లేదా అని ఆలోచించరు. పార్టీ సమావేశాల్లో తమ సూచనలను గురించి తగినంత చర్చ జరగని ఫలితంగా పార్టీసభ్యులలో తాత్కాలికంగా సరియైన అవగాహన లేకపోవడాన్ని అవకాశంగా తీసుకుని ఆ సూచనలపై ఓటింగు జరిపి, మెజారిటీ నిర్ణయమనే పేరుతో వారు తమ కోర్కెలను సాధించుకుంటారు.

అతి ప్రజాస్వామ్యం అంటే ఇదే. దీనికీ, మన పార్టీలో ఉండవలసిన ప్రజాస్వామ్యానికీ పోలిక ఎక్కడా లేదు; ఇట్టి పోకడలలో ఎంత ప్రమాదం వుందో వివరిస్తూ కామ్రేడ్ మావ్ ఇలా చెప్పాడు: "ఈ పోకడ పార్టీ నిర్మాణాన్ని నష్ట పరచడమేకాక పూర్తిగా నాశనంచేస్తుంది. పార్టీయొక్క పోరాటశక్తిని బలహీనపరచడమేకాక పూర్తిగా మంటగలుపు తుంది." ఈ పోకడకు మూలమేమిటోకూడ కామ్రేడ్ మావ్ తెలియజేశాడు. అతడిలా చెప్పాడు: "పెటీబూర్జువా వర్గం యొక్క స్వభావంనుంచి ఈ పోకడ ఉద్భవిస్తుంది. సాధారణంగా పెటీబూర్జువావర్గంలోని వారు కులాసాజీవితం గడుపుతారు. క్రమశిక్షణను వ్యతిరేకిస్తారు. ఇట్టిలక్షణాలు పార్టీలో ప్రవేశించి నప్పుడు, రాజకీయంగాను, నిర్మాణ విషయాల్లోను అతి ప్రజా స్వామ్యంగా బయటపడుతుంది. ఈ పోకడ కార్మికవర్గంయొక్క పోరాట కర్తవ్యాలకు పూర్తిగా విరుద్ధం." (మావ్ సే-టుంగ్: పార్టీలో అపసవ్యభావాల సంస్కరణ.)

ప్రజాస్వామ్యానికి వ్యతిరేకమైన నియంతృత్వధోరణి, అతి ప్రజాస్వామ్య పోకడ — ఈ రెండూ పార్టీ ఆంతరంగిక జీవితంలో రెండు కొసలకు చెందిన పెడమార్గాలు. కాని అతి ప్రజాస్వామ్యం తరచు నియంతృత్వపోకడకు ఒక విధమైన ఎదురు దెబ్బగా ఉద్భవిస్తుంది. ఎక్కడైతే నియంతృత్వపోకడ బలంగా వ్యాపిస్తుందో అక్కడ అతి ప్రజాస్వామ్యం బయలు దేరుతుంది. ఇవి రెండూ వక్రధోరణులే. నిజమైన పార్టీ ఐక్యతను, సంఘటిత శక్తిని ఇవి నాశనంచేస్తాయి. ఇవి తల యెత్తకుండా చూడ్డానికి యావత్తుపార్టీ అతి మెళుకువతో ఉండాలి.

మన పార్టీలో ప్రజాస్వామ్యపద్ధతిని పూర్తిగా అభి వృద్ధిచేయాలి. ఆంతరంగిక ప్రజాస్వామ్యం ఉన్నతస్థాయిలో ఉండేటట్లు చూడాలి. అదే సమయంలో ఈప్రజాస్వామ్యాన్ని ఆధారంచేసుకుని పార్టీ నాయకత్వంలో కేంద్రీకృతవిధానాన్ని కూడా ఉన్నతస్థాయిలో నెలకొల్పాలి.

కామ్రేడ్ మావ్ సే-టుంగ్ 6 వ పార్టీమహాసభచే ఎన్నుకోబడిన కేంద్రకమిటీ విస్తృత సమావేశానికి సమర్పిం చిన నివేదికలో ఇలా తెలియ చేశాడు:

"ప్రస్తుతం మన దేశంలో పితృస్వామికపద్ధతి అమల్లో వుంది. ఇది చిన్నఎత్తున జరిగే ఉత్పత్తివిధానంనుంచి పుట్టింది. ఇంతవరకు దేశవ్యాపితంగా ఎట్టిప్రజాస్వామ్య జీవితం లేదనే చెప్పవచ్చు. ఈ పరిస్థితి పార్టీలోకూడ ప్రతిబింబించినప్పుడు ప్రజాస్వామ్య జీవితం తగినంతగా వుండదు. మొత్తం పార్టీ యొక్క కార్యకలాపాలకు ఇది ఆటంకంగా పరిణమిస్తుంది. ఈ

లోగా ప్రజాఉద్యమంలోను, ఐక్యసంఘటనలోను ప్రజా స్వామ్యం లోపించడానికి కారణమౌతుంది."

పై సమావేశం తరువాత పరిస్థితి మారింది. విముక్త ప్రాంతాల్లో ప్రజాతంత్ర ఉద్యమం, పార్టీ ఆంతరంగిక ప్రజా స్వామ్యం చాల అభివృద్ధిచెందాయి. ఇందుకు పార్టీలో మూడు పెడమార్గాలకు వ్యతిరేకంగా జరిగిన పోరాటం, పార్టీ కార్యకలాపాల సమీక్ష చాల సహాయపడ్డాయి. 7 వ పార్టీ మహాసభకు ముందు కార్యకర్తలు పార్టీ చరిత్రనుగురించి, పార్టీ విధానాన్నిగురించి స్వేచ్ఛగాను, లోతుగాను పరిశీల నలు జరపడంవల్ల పార్టీలో ఆంతరంగిక ప్రజాస్వామ్యం చాల వరకు అభివృద్ధి చెంది, మహాసభకు విపులంగా సన్నాహాలు జరిగాయి. ఐతే మొత్తం పార్టీని దృష్టిలోకి తీసుకున్నా, స్థానిక పార్టీయూనిట్లను వేరువేరుగా పరిశీలించినా పార్టీలో ప్రజాస్వామ్యం ఇప్పటికీ తక్కువగానే వుందనీ, ఎంతో అభి వృద్ధి అవసరమనీ బోధపడుతుంది. కనుకనే, పార్టీ నిబంధనా వళిలో ఆంతరంగిక ప్రజాస్వామ్యంయొక్క విస్తరణనుగురించి అనేక నిబంధనలున్నాయి.

మనపార్టీ ఇప్పటికీ శత్రువుతో యుద్ధం చేస్తూనేఉంది. ఇదొక దీర్ఘకాలయుద్ధమని చెప్పాలి. మన సాంకేతికబలం, శత్రువుయొక్క స్థితిగతులు మార్పుచెందేవరకు ఈ యుద్ధం ప్రధానంగా గెరిల్లాయుద్ధంగానే ఉంటుంది. అందుచేత, యుద్ధ పరిస్థితులు అనుకూలంగా ఉంటేనే పార్టీ సమావేశాలు, ఎన్ని కలు జరపాలి. అయితే, యుద్ధపరిస్థితుల్ని సాకుగాతీసుకొని

పార్టీలో ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని అక్రమంగా సంకుచిత పరచకూడదు.

విముక్త ప్రాంతాల్లో పెద్ద సమావేశాలు, ఎన్నికలు జరపడానికవకాశమున్నప్పుడల్లా వివిధ స్థాయిలలో నాయకత్వ కమిటీలను ఎన్నుకోడానికి, పార్టీ మహాసభలు, సర్వ సభ్య సమావేశాలు జరపాలి.

పార్టీ నిబంధనావళి ప్రకారం నాయకత్వ కమిటీని ఎన్నుకొనేటప్పుడు మహాసభయొక్క అధ్యక్షవర్గం అభ్యర్థుల జాబితాను ప్రవేశపెట్టే హక్కును కలిగియున్నప్పటికీ ప్రతి ప్రతినిధి వర్గమూ, ప్రతి ప్రతినిధీ అభ్యర్థుల్ని సూచించవచ్చు. అట్టి హక్కు అందరికీ ఉంటుంది. ఏ అభ్యర్థినైనా, అభ్యర్థులనైనా విమర్శించే హక్కుకూడా ప్రతి ఓటరుకు ఉంటుంది. వారి స్థానే యితర అభ్యర్థుల్ని సూచించవచ్చు. మొత్తం అభ్యర్థుల జాబితా పూర్తిగా చర్చింపబడాలి. దాన్ని ఆధారంగా చేసుకొని రహస్యంగా గాని, బహిరంగంగా గాని ఓటింగు జరగాలి.

క్రింది పార్టీయూనిట్ల మహాసభలు * రెండేండ్ల కొకసారి జరగాలని పార్టీ నిబంధనావళిలో ఉంది. అంటే, ప్రతి రెండేండ్లకు క్రింది పార్టీయూనిట్లు తమ నాయకత్వ కమిటీలను ఎన్నుకోవాలన్నమాట. మహాసభల మధ్య తక్షణ కర్తవ్యాలపై నిర్ణయాలు తీసుకోడానికి కాన్ఫరెన్సులు జరపడం అవసరం; అది సాధ్యమేకూడ. గతంలో, మన పనిని మనం సమీక్షించుకొనేందుకు అనేక రకాలైన కార్యకర్తల సమా

---

* క్రింది పార్టీ యూనిట్లంటే, కేంద్రకమిటీతప్ప మిగతా అన్ని పార్టీ యూనిట్లు.

వేశాలు జరిపేవాళ్ళం. ఇకముందు కాన్ఫరెన్సులలోను, మహా సభలలోను మాత్రమే ఈ పని జరగాలి. ఎన్నికలు మాత్రం రెండేండ్ల కొకసారి జరగాలి. ఎందుచేతంటే, తరుచు ఎన్నికలు జరపడం అనవసరమేగాక, మన కార్యకలాపాలకు అవి విఘ్నం కలుగజేస్తాయి. అందుచేత, మన పనిని మనం సమీక్షించుకోడానికి, ప్లాను తయారు చేసుకోడానికి మహా సభలతోబాటు కాన్ఫరెన్సులు కూడా అవసరం. అట్టి కాన్ఫరెన్సులు స్థానిక అవసరాలను బట్టి సంవత్సరాని కొకసారి, లేదా రెండుసార్లు జరపవచ్చు. ఇట్టి కాన్ఫరెన్సులకు క్రిందికమిటీలచే ఎన్నుకోబడు ప్రతినిధులు హాజరవుతారు. పార్టీకమిటీలోని సభ్యుల్ని తొలగించడానికీ, వారి స్థానంలో కొత్తసభ్యుల్ని ఎన్నుకోడానికీ ఈ కాన్ఫరెన్సుల కధికారం ఉంటుంది. అయితే, యిందుకు ఆ పార్టీకమిటీ ఆమోదించాలి. ఎందుచేతంటే, ఇట్టి కాన్ఫరెన్సుఅధికారాలు పూర్వపు కార్యకర్తల సమావేశాలకుండే అధికారాల కన్న ఎక్కువే అయినప్పటికీ, కాన్ఫరెన్సు అధికారాలు పార్టీకమిటీ అధికారాలకన్న తక్కువే.

రాష్ట్ర, సరిహద్దుప్రాంత, రీజియన్, కౌంటీ, సబ్ డిస్ట్రిక్టు పార్టీ మహాసభలు, కాన్ఫరెన్సులు వంతులప్రకారం జరగవచ్చు; ఉదాహరణకు ఈయేడు రాష్ట్ర, సరిహద్దుప్రాంత కౌంటీ మహాసభలూ రీజియన్, సబ్ డిస్ట్రిక్టు కాన్ఫరెన్సులూ జరిగితే, మరుసటి సంవత్సరం రీజియన్, సబ్ డిస్ట్రిక్టు మహాసభలూ రాష్ట్ర, సరిహద్దుప్రాంత, కౌంటీ కాన్ఫరెన్సులూ జరగవచ్చు.

పార్టీ కమిటీలలో అన్ని రంగాలకు చెందినవారు, ప్రజలతో చక్కని సంబంధాలున్న కార్యకర్తలు సభ్యులుగా ఉండేటట్లు వాటిని వివిధస్థాయిలలో విస్తృత పరచాలి. నిబంధనావళి ప్రకారం ప్రతిపార్టీ కమిటీలోను స్థాయిసంఘ మొకటివుండాలి. అది రోజువారీ కార్యకలాపాలను అజమాయిషీ చేస్తుంది. స్థాయిసంఘంలోకూడ వివిధ రంగాలకు చెందిన కార్యకర్తలుండాలి. అప్పుడు అది తన ప్రాంతంలో జరిగే వివిధరంగాల పనిని నిర్విరామంగా నడుపగలుగుతుంది. నాయకత్వకమిటీ అవసరమనుకున్నప్పుడు కార్యదర్శికి సహాయం చేసే ఒకరిద్దరు సహాయ కార్యదర్శుల్నికూడా తీసుకోవచ్చు. అప్పుడు పార్టీపని అవాంతరాలు లేకుండా జరిగే అవకాశం వుంటుంది. ఏ కమిటీకూడ ఆంతరంగిక నిర్మాణానికి మాత్రనే తన కార్యకలాపాలను పరిమితంచేయకూడదు. ప్రతి కమిటీ తన ప్రాంతంలో అన్ని కర్యాకలాపాలను నడిపే సంస్థగా తయారవాలి. ఆంతరంగిక నిర్మాణానికి సంబంధించినపని పార్టీకమిటీ యొక్క పనిలో ఒకభాగం మాత్రమే. ఈ పనిని ఒక ప్రత్యేకమైన నిర్మాణశాఖకు ఒప్పగించాలి. అందుచేత పార్టీకమిటీ నిర్ణయాలు, పనికి సంబంధించిన ప్లానులు జనరల్ స్వభావం కలిగినవైతే, వాటిని గురించి కమిటీఅంతా చర్చించి నిర్ణయాలు తీసుకోవాలి. సమిష్టిగా నిర్ణయాలు తీసుకున్న తరువాత వాటిని అమలుజరిపేందుకు ఒక్కొక్క సభ్యునికి ఒక్కొక్కపని ఇయ్యాలి.

పార్టీలో ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని విస్తృతపరచడంలో గమనించవలసిన ఒక ముఖ్యాంశ మేమిటంటే, పార్టీ

సభ్యులలోను కార్యకర్తలలోను విమర్శన, ఆత్మవిమర్శనను ప్రోత్సహించడం. కామ్రేడ్ మావ్ తన నివేదికలో ఆత్మ విమర్శనయొక్క ప్రాముఖ్యతనుగురించి నొక్కిచెప్పాడు. మన పార్టీలో క్రమబద్ధమైన ఆత్మవిమర్శన ఒక ప్రత్యేకలక్షణమనీ, ఇతర రాజకీయపార్టీలకూ మనపార్టీకి మధ్యగల వ్యత్యాసా లలో ఇదొకటనీ అతడు పేర్కొన్నాడు. పార్టీపాలసీ, పార్టీ పనివిషయంలో మనసభ్యులు, కార్యకర్తలు బాధ్యతాయుత నైఖరిని అలవరచుకొనేటట్లు, పెంపొందించుకొనేటట్లు చూడాలి. ఈవిధంగా వారు తమ వాదనాపటిమను ఉపయోగించేటట్లు ప్రోత్సహించాలి. వివిధసమస్యలను ధైర్యంతోను, సక్రమం గాను అందరిదృష్టికి తెచ్చి తమ అభిప్రాయాలను వెల్లడించే టట్లు చూడాలి. నాయకత్వకమిటీల నాయకులు అందరి కన్న మొదట తమ నాయకత్వంక్రింద జరిగిన పొరపాట్లను గూర్చి, లోపాలనుగూర్చి సమగ్రమైన ఆత్మవిమర్శన చేసుకోవాలి. పార్టీ సభ్యులకు, కార్యకర్తలకు మార్గదర్శ కులుగా వుండాలి. ఇతరులనుంచి వచ్చే విమర్శనలను స్వీక రించడానికి పూర్తిగా తయారవాలి. అలాంటి విమర్శనలు వచ్చినప్పుడు కోపగించుకోకూడదు. తలబిరుసుగా ప్రవర్తించ కూడదు. తమ్ము విమర్శించినవారిని అణచడానికిగాని, శిక్షించ డానికిగాని పూనుకోకూడదు. ఈ విధానంద్వారానే పార్టీలో అంతరంగిక ప్రజాస్వామ్యాన్ని ప్రోత్సహించగలం. లేకపోతే పార్టీ మహాసభలు, కాన్ఫరెన్సులు ఎప్పటికప్పుడు జరుగు తున్నప్పటికీ నిర్జీవమైన, ప్రజాస్వామ్య రహితమైన సమా వేశాలుగానే అవి తయారవుతాయి. పోడినపాటే తిరిగి

పాడుతూ, నిస్సారమైన ఉపన్యాసాలతో అవి నిండివుంటాయి. రిపోర్టులు వినడం, ఓటింగులో పాల్గొనడం కేవలమొక కర్మ కాండగా తయారవుతుంది.

మనలో చాలమంది కామ్రేడ్స్ — బాధ్యతాయుత స్థానాల్లో ఉన్న కొందరితోసహా — సమావేశాలు జరపడ మెలాగో, వాటిని విజయవంత మొనర్చడమెలాగో యిప్పటికీ తెలియదు. అందువల్ల చాలసమావేశాలు విఫలమవడమో, కొద్దిపాటి సత్ఫలితాలు మాత్రమే కలగడమో జరుగుతోంది. ఒక్కొక్కప్పుడు సమావేశాలు పార్టీ సభ్యులకు, ప్రజలకు పెద్ద భారంగా తయారవుతున్నాయి. మరీ యెక్కువ సమావేశాలు జరపడం ప్రజాస్వామ్యం కాజాలదు. ప్రతి సమావేశాన్ని చక్కగా జరపాలి; ప్రజాస్వామ్య భావం, విమర్శన - ఆత్మవిమర్శనాతత్వం వెల్లివిరియాలి. ఈ సందర్భంలో కామ్రేడ్ మావో-సె-టుంగ్ సూచనలను మనం పాటించాలి. "పార్టీ సభ్యులు సమావేశాలకు హాజరవడానికి కుతూహలపడేటట్లు చేయడమెలాగు?" అనే వ్యాసంలో ఈ సూచలున్నాయి. అది క్యూటీన్ కాన్ఫరెన్స్ తీర్మానంలో పొందుపరచబడింది.

బాధ్యతాయుత స్థానంలో ఉన్న ఒక కామ్రేడ్ పార్టీ సభ్యుల యెదుట, ప్రజల యెదుట త్రికరణ శుద్ధిగా ఆత్మవిమర్శన చేసుకుంటే, అక్కడి ప్రజలలోను పార్టీసభ్యులలోను విమర్శన, ఆత్మవిమర్శన వృద్ధిచెందుతాయి; వారి కార్యకలాపాలు ఉచ్ఛస్థాయి నందుకుంటాయి; వారి ఆంతరంగిక సమైక్యత వృద్ధిచెందుతుంది; వారి పని చక్కబడుతుంది; వారి లోపాలు తొలగిపోతాయి. రెండోవైపు, ఆత్మవిమర్శన చేసు

కున్న ఆ కామ్రేడ్ ప్రతిష్ట ప్రజల్లోను, పార్టీ సభ్యులలోను ఇనుమడిస్తుంది. దీన్ని రుజువుచేయడానికి చాల ఉదాహరణ లున్నాయి. ఎక్కడైతే బాధ్యతగల కామ్రేడ్స్ ఆత్మవిమర్శనా తత్వాన్ని ప్రదర్శించరో; తమ లోపాలనూ పొరబాట్లనూ విమర్శించుకోడానికి ఎక్కడైతే విముఖత చూపుతారో లేక భయపడతారో; ఎక్కడైతే వాటిని కప్పిపుచ్చుకోడానికి ప్రయత్నిస్తారో; తమ్ము విమర్శించిన వారియెడల కృతజ్ఞత చూపడానికి, సంతోషం ప్రకటించడానికి బదులు మొగం ఎర్ర బారేటట్లు నొచ్చుకుంటారో, ప్రత్యారోపణలు చేస్తారో, విమర్శకులపై కసితీర్చుకోడానికి ప్రయత్నిస్తారో అక్కడల్లా యిందుకు వ్యతిరేక ఫలితాలు కలుగుతాయి. అలాంటిచోట్ల పార్టీ సభ్యుల్లోను, ప్రజల్లోను ప్రజాస్వామ్యంగాని ఆత్మవిమర్శన గాని వృద్ధిచెందదు; వారి కార్యకలాపాలు ఉచ్ఛస్థాయి నందు కోవు; వారి ఆంతరంగిక ఐక్యత పెంపొందదు; వారి లోపాలు తొలగవు; వారి కార్యవిధానం చక్కబడదు. అంతేగాక, పై కామ్రేడ్స్‌యొక్క ప్రతిష్ట నాశనమవుతుంది. అందుచేత, స్థానిక పార్టీయూనిట్లలో బాధ్యతగల కామ్రేడ్స్ ప్రజాస్వామ్యాన్ని పెంపొందించడంలోను, విస్తృతపరచడంలోను ఎంతో బాధ్యత వహించాలి.

పార్టీ నిబంధనావళి ప్రకారం నాయకత్వ కమిటీలు, పార్టీ యూనిట్లలో బాధ్యతాయుత స్థానాల్లో ఉన్నవారు తమ్ము ఎన్నుకున్న క్రింది యూనిట్లకు, పార్టీ సభ్యులకు తాము చేసిన పనిని గురించి నిర్ణీతసమయాల్లో నివేదికలు సమర్పించాలి. అట్టి నివేదికల్లో ప్రస్తుత పరిస్థితి, సాధించిన విజయాలు

మాత్రమేకాక లోపాలు, బలహీనతలు, పొరబాట్లను గురించి కూడా చర్చించాలి. వీటిపై అభిప్రాయాలు, విమర్శనలు తెలియజేవలసిందని ఓటర్లనూ, క్రింది యూనిట్లనూ కోరవలసి యుంది. అనేక క్రింది యూనిట్లలోను, కార్యకర్తలలోను కని పించే లోపాలకు పొరబాట్లకు బాధ్యత వహించవలసింది ఎల్ల ప్పుడూ ఆ యూనిట్లు, కార్యకర్తలు కాదనీ, పైకమిటీలే కారణమనీ గత అనుభవం తెలియజేస్తూంది. అనేక పొర బాట్లకు లోపాలకు కారణం పైకమిటీలు సకాలంలో కర్త వ్యాలివ్వకపోవడం, పాలసీని వివరించకపోవడం; లేదా కర్తవ్యా లిచ్చి పాలసీని వివరించినప్పటికీ సమస్యలను క్రమబద్ధంగాను, సమగ్రమంగాను పరిశీలించకపోవడం. ఒక్కొక్కప్పుడు పై కమిటీలిచ్చిన కర్తవ్యాలలోను, పాలసీలలోను, పొరబాట్లు ఉండవచ్చు; అటువంటప్పుడు క్రింది యూనిట్లమీాద, పార్టీ సభ్యులమీాద, కార్యకర్తలమీాద, ఎక్కువ నేరంమోపకూడదు. అలా చేస్తే వారిలో తప్పక విశ్వాసం సన్నగిలి, పని మంద గిస్తుంది. క్రింది యూనిట్లు, పార్టీ సభ్యులు, కార్యకర్తలుకూడా యీా విధంగానే తమ పొరబాట్లను, లోపాలను సవరించుకో డంలో ఆత్మ విమర్శనయొక్క ప్రాముఖ్యతను గుర్తించాలి.

ఆంతరంగిక ప్రజాస్వామ్యం యొక్క ప్రధానలక్ష్యం, పార్టీ సభ్యుల చొరవకు కార్యశూరతకు పూర్తి అవకాశ మివ్వడం; పార్టీయెడల వారికిగల బాధ్యతాయుత వైఖరిని హెచ్చుచేయడం; పార్టీ నిబంధనావళి పరిమితుల్లో వారుగాని వారి ప్రతినిధులుగాని తమ అభిప్రాయాలను పూర్తిగా వ్యక్తం చేసేటట్లు ప్రోత్సహించడం. ఈ విధంగా వారు ప్రజలకు

నాయకత్వం వహించడానికి పార్టీ కార్యకలాపా లన్నిటిలో చురుగ్గా పాల్గొన గల్గుతారు; పార్టీలో ఐక్యత, క్రమశిక్షణ గట్టిపడుతుంది. ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని సరియైన పద్ధతిలో విస్తృతపరచడం ద్వారానే పార్టీలో ఐచ్ఛికశిక్షణ బలపడుతుంది; కేంద్రీకృత విధానం నెలకొంటుంది. పార్టీ కమిటీలు ప్రజలకు సరియైననాయకత్వం వహించగల్గుతాయి. అందుచేత పార్టీకమిటీలు అన్ని స్థాయిలలోను ఆంతరంగిక ప్రజాస్వామ్య సూత్రాని కనుగుణ్యాంగా పనిచేయాలని నింబధనావళి చెబుతోంది.

పార్టీలో ప్రజాస్వామ్యాన్ని ఉచ్ఛస్థాయిలో అమలు జరపడంలో ఉద్దేశం, కేంద్రీకృత విధానాన్ని బలహీన మొనర్చడానికి కాదు. పైగా, ఉచ్ఛస్థాయిలో ప్రజాస్వామ్యము, కేంద్రీకృత విధానము ఒకదాని సరసన ఒకటి అభివృద్ధి చెందుతాయి. ఉచ్ఛస్థాయిలో ప్రజాస్వామ్యాన్ని, ఉచ్ఛస్థాయిలో కేంద్రీకృత విధానాన్ని సమన్వయ పరచాలేగాని, ఒకదానికొకటి పోటీ పెట్టకూడదు. ప్రజాస్వామ్యాన్ని ఉచ్ఛస్థాయిలో అమలు జరపడం ద్వారానే, నాయకత్వంలో కేంద్రీకృత విధానం ఉచ్ఛస్థాయిలో వర్ధిల్లుతుంది. ప్రజాస్వామ్యంపై ఆధారపడు కేంద్రీకృత నాయకత్వంక్రిందనే ప్రజాస్వామ్యం ఉచ్ఛస్థాయిలో వర్ధిల్లుతుంది. ప్రజాస్వామ్యాన్ని ఉచ్ఛస్థాయిలో అమలు జరిపితే కేంద్రీకృత నాయకత్వం బలహీనపడుతుందనుకోడం పొరబాటు. అందుచేత, నాయకత్వ కమిటీ ఆంతరంగిక ప్రజాస్వామ్య సూత్రాని కనుగుణ్యాంగా పనిచేస్తే పార్టీలో కేంద్రీకృత విధానానికి అంతరాయం కలుగదు. ఆంత

రంగిక ప్రజాస్వామ్యం కేంద్రీకృత కార్యాచరణకు ఉపయోగ పడుతుంది గనుక అది అరాచక పోకడలకు - అనగా అతి ప్రజాస్వామ్యం, సర్వస్వతంత్రం - దారితీసేవిధంగా వికృత మొనర్చదు. ఈ విషయాన్ని నిబంధనావళి స్పష్టంచేసింది.

పార్టీలో ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని పార్టీ శ్రేయస్సుకై - అనగా ప్రజల శ్రేయస్సుకై - ఉపయోగపడేటట్లు ప్రోత్సహించాలి. పార్టీయొక్క పోరాటస్వభావాన్ని, పోరాట పటిమను అది బలహీనపరచకూడదు. విచ్ఛిన్నకుల, పార్టీ వ్యతిరేకుల, అవకాశవాదుల, స్వార్థపరుల చేతుల్లో ఆదొక సాధనంగా ఉపయోగపడకూడదు. అందుచేత సరియైన నాయకత్వంక్రిందనే, పరిస్థితులు అనుకూలంగా ఉన్నప్పుడే మొత్తం పార్టీవిధానాన్ని, లేదా ఒక క్రిందికమిటీ అనుసరించే విధానాన్ని కూలంకషంగా సమీక్షించి చర్చించాలని నిబంధనావళి చెబుతోంది. మరోవిధంగా చెప్పాలంటే, యిట్టిచర్చలు అసాధారణ పరిస్థితుల్లో జరగకూడదు. ఆయా సందర్భాలనుబట్టి, కేంద్రకమిటీ, లేక క్రిందికమిటీలు సరిగాఆలోచించి నిర్ణయాలు చేయాలి; లేదా క్రిందికమిటీలలో మెజారిటీగాని, పైకమిటీ గాని అట్టి చర్చలు జరపమని డిమాండు చేయవచ్చు.

పార్టీలో ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని విస్తృత మొనర్చవలసిందే. కాని పార్టీ నిర్ణయాలను మాత్రం ఎట్టి మినహాయింపులు లేకుండా అమలు జరపాలి. పార్టీ సభ్యులు పార్టీ యూనిట్‌కి, క్రింది కమిటీలు పై కమిటీలకు, మైనారిటీ మెజారిటీకి, అన్ని పార్టీ యూనిట్లు కేంద్ర కమిటీకి లోబడాలని

నిబంధనావళిలో పేర్కొనబడ్డసూత్రాన్ని నిర్నిబంధంగాఅమలు జరపాలి.

కొంతమంది కామ్రేడ్స్ పార్టీ తీర్మానాలు, ఆదేశాలు సరియైనవని భావిస్తేనే యీ సూత్రాలను అమలు జరుపుతారు. లేదా తమ నాయకుని సామర్థ్యం, హోదా, సభ్యత్వకాలం, సాంస్కృతిక స్థాయి మొదలైన విషయాలనుబట్టి, అతడు తమ యెడల మంచిగాప్రవర్తించాడా చెడుగాప్రవర్తించాడా అనే విషయాన్నిబట్టి, అతడు తమ గ్రూపుకు చెందుతాడా, చెందడా అనేదాన్నిబట్టి పై సూత్రాలను అమలు జరుపుతారు. ఇలాంటివి పనికిరావని స్పష్టంగా చెప్పవలసియుంది. మంచి కమ్యూనిస్టు తాను ప్రమాదంలో ఉన్నప్పుడే, తనకూ పార్టీకీ మధ్య సిద్ధాంత సమస్యల్లోగాని వ్యక్తిగత విషయాలపైగాని తీవ్రమైన అభిప్రాయ భేదాలున్నప్పుడే, ఎక్కువ చక్కగా క్రమశిక్షణను పాటిస్తాడు. తాను మైనారిటీలో ఉన్నప్పటికీ నిర్నిబంధంగా అతడు నిర్మాణ సూత్రాలను అమలు జరిపినప్పుడే మంచి శిక్షణ గల వాడుగాను, సిద్ధాంతాలకు కట్టుబడే పార్టీ సభ్యుడుగాను పరిగణింపబడతాడు. అట్టి వ్యక్తి పరిస్థితినంతటినీ దృష్టిలో ఉంచుకుంటాడు. పాక్షిక ప్రయోజనాలకన్న మొత్తం ప్రయోజనాలు, చిన్న యథార్థంకన్న పెద్ద యథార్థం ఎక్కువ ముఖ్యమని తెలుసుకోగల్గుతాడు. తక్కువప్రాధాన్యతగల సిద్ధాంతాల పైన, వ్యక్తిగత విషయాలపైన బయల్దేరే విభేదా[illegible] ఐక్యతకు, పార్టీ శిక్షణకు లోబడాలని గ్రహిస్తా[illegible]

ఏ పరిస్థితుల్లోనూ కమ్యూనిస్టుల నై[illegible] సరణను ప్రోత్సహించకూడదు. ప్రస్తుత[illegible]

మధ్యలో వున్నాము. చెల్లాచెదురుగావున్న గ్రామసీమలలో ఈయుద్ధం జరుగుతూంది. ఒక్కొక్క ప్రాంతంయొక్క అంతర్గత బహిర్గత పరిస్థితులు ఒక్కొక్కవిధంగా వున్నాయి. ఈలాంటి పరిస్థితుల్లో మనం "కేంద్రీకృత నాయకత్వంక్రింద వికేంద్రీకృత పోరాటాలు" అనే విధానాన్ని అనుసరించాలి. మరీ కేంద్రీకృతమైన పోరాటాలు, సర్వసమానత్వ సిద్ధాంతం రెండూ తప్పే. వికేంద్రీకృత పోరాటాలు అంటే అర్థం విశృంఖలత్వం కాదు. స్వతంత్రంగా పోరాడాలని, స్వతంత్ర కార్యాచరణశక్తిని సంపాదించాలనిమాత్రమే వాటి అర్థం. వాటిని మనం కేంద్రీకృత నాయకత్వంనుంచి వేరుచేయకూడదు. నిజానికి కేంద్రీకృత నాయకత్వం వాటికి చాలఅవసరం.

ప్రస్తుత పరిస్థితుల్లో ఒక నాయకత్వకమిటీ చేసే నిర్ణయాలు, ఇచ్చే ఉత్తరువులు అన్నిచోట్లా, అన్ని పరిస్థితులకు తరుచు వర్తించవు. అవి జనరల్ స్వభావం మాత్రమే కలిగి వుంటాయి. అవి మామూలు ప్రాంతాలకు వర్తిస్తాయేకాని, ప్రత్యేక ప్రాంతాలకు పనికిరావు. అంతేకాదు. వాటిలో పొరపాట్లుఉండడం, ఆచరణయోగ్యంకాకపోవడం తరుచు జరుగుతూ ఉంటుంది. అలాంటి పరిస్థితుల్లో మనం గుడ్డిగా అనుసరించే పద్ధతిని ప్రోత్సహించకూడదు. ఆలోచనతో కూడిన, నిజాయితీతో ...డిన కార్యాచరణను మనం ప్రోత్సహించాలి. దీని ... వాస్తవ పరిస్థితుల్నీ, నిర్ణయాలనూ జాగ్రత్తగా ...పరిశీలించాలన్న మాట. పార్టీ నిర్ణయాలలో ...మనిగాని, స్థానిక పరిస్థితుల కవి భిన్నమని ...ను, వాటిని ధైర్యంతో ఒక పైకమిటీ

దృష్టికి తేవాలి. ఆ నిర్ణయాలను ఉపసంహరించుకోమని లేదా సవరించుకోమని అడగాలి. అంతేగాని, గుడ్డిగాను, మొండిగాను వాటిని అమలు జరపడానికి ప్రయత్నించకూడదు. అలా చేయడంవల్ల ప్రజల కాలం, ధనం వృధాకావడమే గాక ప్రజల నుంచి మనం దూర మౌతాము. క్రింది పార్టీ యూనిట్లు ఇలా చేయడం ఎదురుతిరగడం కాజాలదు. ఇది విశృంఖలత్వంకూడ కాదు. అట్టివారు పార్టీ నిర్ణయాలను, ఉత్తరువులను నిజాయితీతో అమలు జరుపుతున్నారు. స్వతంత్రంగా ఆలోచించడమే గాక, పై కమిటీల పొరపాట్లను, లోపాలను సరిదిద్దడంలోకూడ సహాయం చేయగలవారే ప్రజ్ఞావంతులైన పార్టీ సభ్యులు. అట్టి వారిని ప్రత్యేకంగా ప్రోత్సహించాలి.

పై కమిటీల నిర్ణయాలను, ఉత్తరువులను అమలు జరపడంలో మూడువిధాలైన దృక్పధాలు మనకు కనిపిస్తున్నాయి. మొదటిది, తమ కిష్టమైన వాటినే అమలు జరపడం; మిగతా వాటిని నిర్లక్ష్యం చేయడం. ఇది స్పష్టమైన, కట్టుతేని విశృంఖలత్వం. ఇందుకు ఏ సాకు చూపినప్పటికీ పార్టీ దానిని సహించదు. రెండవది, గుడ్డిగా, ముక్కుకు సూటిగా నిర్ణయాలను అమలు జరపడం. అవి ఆ పరిస్థితులకు సరిపోతాయా లేదా అని ఆలోచించక పోవడం; లేదా పరిస్థితుల్ని పరిశీలించక పోవడం. ఇది పై కమిటీయొక్క నిర్ణయాలను, ఉత్తరువులను, బుద్ధిని ఉపయోగించకుండా గుడ్డిగా అమలు జరపడం గనుక దీన్నికూడ పార్టీ సహించదు. మూడవది, ఒకవైపు నిర్ణయాలను, ఉత్తరువులను జాగ్రత్తగాపరిశీలించి, మరోవైపు పరిస్థితుల్నికూడ అవగాహన చేసుకుని, ఏది ఆచరణ

యోగ్యమో దాన్ని దృఢనిశ్చయంతో అమలు జరపడం; ఆచరణయోగ్యం కానివాటిని వివరమైన కారణాలతో పై కమిటీకి తెలియచేయడం, వాటిని సవరించమని కోరడం. ఇదే తెలివి తేటలతోను, నిజాయితీతోను పార్టీ నిర్ణయాలను ఉత్తరువులను అమలు జరిపే విధానం. ఇదే సరియైన దృక్పథం. ఈ విధమైన సృజనాత్మకశక్తిని, కార్యాచరణను మనం వ్యతిరేకించము. క్రమశిక్షణయెడల నిర్లక్ష్యాన్ని, విశృంఖలత్వాన్ని పార్టీ సర్వవిధాలా వ్యతిరేకిస్తుంది. ఐతే ప్రతిపార్టీ సభ్యుడు వివిధ సమస్యలను పరిష్కరించడంలోను, పార్టీ యొక్క జనరల్ నాయకత్వంక్రింద స్వతంత్రంగా పనిచేయడంలోను ప్రదర్శించే స్వంత చొరవను పార్టీ ప్రోత్సహిస్తుంది. తన క్రింది యూనిట్లు పార్టీసభ్యులు తమ తమ సూచనలను, ప్రశ్నలను పంపుకోడానికి నాయకత్వకమిటీ అనుమతించాలి. తాను చేసే నిర్ణయాలకు, ఇచ్చే ఉత్తరువులకు మార్పులు సూచించడానికక్కడ అవకాశం ఈయాలి. నిజంగా వాటిలో పొరబాట్లు, లోపాలు ఉన్నట్లయితే వాటిని సరిదిద్దుకోవాలి. క్రింది వారిచ్చే అభిప్రాయాలు సరియైనవి కాకపోతే, వారెక్కడ పొరబాటు పడుతున్నారో సంతృప్తికరంగా విడమర్చిచెప్పాలి. అట్టి వారిమీద కఠినచర్యలు తీసుకునే చెడ్డ అలవాటుకు లోనుకాకూడదు; ఒకవేళ నిర్ణయం మార్చుకొమ్మని క్రింది నుంచి విజ్ఞప్తి వచ్చినప్పటికీ వాటిని అమలు జరిపితీరాలని పై కమిటీ ఆజ్ఞాపిస్తే అప్పుడు వాటిని అమలు జరపాలి. క్రింది వారు తమ వాదననే పట్టుకు వేళ్ళాడకూడదు. ఎల్లప్పుడూ నిర్ణయాలను వ్యతిరేకిస్తూనే వుండకూడదు.

కమ్యూనిస్టుపార్టీ శిక్షణ ఐచ్ఛికమైనది; యాంత్రిక మైనదికాదు. సాధారణ సభ్యుల కార్యాచరణను, చొరవను అది పరిమితం చేయకూడదు. సభ్యుల శిక్షణను, చొరవను సమన్వయ పరచాలి.

ఏ స్థాయిలోవున్న ఏ పార్టీ యూనిట్ అయినాసరే, తన ఆధ్వర్యంక్రింద ప్రచురింపబడే పుస్తకాలు, పత్రికలద్వారా పై కమిటీలయొక్క, కేంద్రసంస్థలయొక్క నిర్ణయాలను, విధానాన్ని ప్రజలలోకి తీసుకువెళ్ళేటట్లు చూడాలి. పార్టీయొక్క ఐక్యతను కాపాడ్డానికి, దాని జాతీయ స్వభావాన్ని రక్షించడానికి ఇది చాల అవసరం. కేంద్రకమిటీయొక్క, తదితర పై కమిటీలయొక్క నిర్ణయాలను, పాలసీని ప్రతిచోటా ప్రచారం చేయాలి. వాటికి వ్యతిరేకమైన అభిప్రాయాలను ప్రచారం చేయకూడదు. మార్క్సిస్టు సిద్ధాంతాలను మనం ప్రజల్లో వ్యాపింపచేయాలి. తద్వ్యతిరేకమైనవాటిని ప్రచారం చేయకూడదు. దీన్ని కొన్ని క్రింది యూనిట్లు సంతృప్తికరంగా అమలు జరపడంలేదు. కొన్నిపార్టీ పత్రికలు కేంద్రకమిటీ నిర్ణయాలను, పాలసీని తగినంత ప్రముఖంగా ప్రచురించడంలేదు. కొన్ని సందర్భాలలో కేంద్రకమిటీ నిర్ణయాలకు, పాలసీకి వ్యతిరేకమైన వ్యాసాలుకూడా ప్రచురింప బడుతున్నాయి. ఇలాంటి పద్ధతిని అన్ని స్థాయిలలోని పార్టీయూనిట్లు సరిదిద్దుకోవాలి.

మొత్తం జాతికి సంబంధించిన సమస్యలపై కేంద్ర కమిటీ ప్రకటన లేదా నిర్ణయం వెలువడకముందే క్రిందిపార్టీ యూనిట్లు లేదా వాటిలో బాధ్యతగల సభ్యులు తమ అభిప్రా

యాలను ప్రకటించేస్వేచ్ఛ, నిర్ణయాలు చేసే స్వేచ్ఛ లేదు. తమలో తాము చర్చలుజరిపి, కేంద్రకమిటీకి సూచనలు పంపే హక్కుమాత్రం వారి కుంటుంది. పార్టీఐక్యతను కాపాడ్డానికి, దాని జాతీయస్వభావాన్ని రక్షించడానికి యిది అవసరం. పార్టీకంతటికీ ఒకేపంథా, ఒకే విధానం ఉంటుంది. అనేక పంథాలు, అనేక విధానాలు ఉండవు. ఏదైనా ఒక జాతీయ సమస్యపై పార్టీకి ఒకేదృక్పథం ఉంటుందిగాని, అనేక దృక్పథా లుండవు. కేంద్రకమిటీ తన అభిప్రాయం తెలియజేస్తూ ఎట్టి ప్రకటన చేయకముందే, క్రింది యూనిట్లు బహిరంగప్రకటనలు చేయడంద్వారా తమఅధికారాల్ని అతిక్రమించకూడదు. కేంద్రకమిటీ అనుమతిలేకుండా బాధ్యతగల ఏ పార్టీనాయకుడు-కేంద్రకమిటీ సభ్యులతోసహా - జాతీయప్రాముఖ్యతగల సమస్య లపై తమఅభిప్రాయాలను బహిరంగంగా ప్రకటించకూడదు. వారు తమఅభిప్రాయాలను క్రిందియూనిట్లలో చర్చించి, కేంద్ర కమిటీకి సూచనలుచేయవచ్చు. అయితే, అంతవరకు కేంద్ర కమిటీ తన అభిప్రాయా లేమిటో తెలియజేయని సమస్యపై వారు పార్టీలోగాని, బయటగాని తమ అభిప్రాయాలను ప్రక టించరాదు; వాటిని క్రిందికమిటీలలో వ్యాపింపజేయకూడదు. ఇందుకు కారణ మేమంటే, అట్టి అభిప్రాయాలు లేదా నిర్ణ యాలు కేంద్రకమిటీ అభిప్రాయాలతో భేదిస్తే, పార్టీసభ్యు లలోను, ప్రజల్లోను చెడు అభిప్రాయం కలుగుతుంది, లేదా శత్రు సమక్షంల్లో యిది దుష్ఫలితాలను కలిగిస్తుంది. వైర్లెస్ సౌకర్యాలు మనకు తక్కువగా ఉన్న రోజుల్లో దీన్నిగురించి మనం అంతగా నొక్కిచెప్పలేదు. కాని యీా రోజున అట్టిసౌకర్యాలు

చాలా ఉన్నాయి. అందుచేత ఈ విషయాన్ని గురించి హెచ్చరించడ మెంతో అవసరం. జపాన్ వ్యతిరేక యుద్ధకాలంలో కేంద్రకమిటీ అనేకసార్లు యీ విషయాన్ని పార్టీసభ్యులదృష్టికి తెచ్చింది.

స్థానిక సమస్యల విషయంలో క్రింది పార్టీ యూనిట్లు స్వతంత్రంగా నిర్ణయాలు చేసుకోడానికి నిబంధనావళి అధికారమిచ్చింది. అయితే ఆ నిర్ణయాలు కేంద్ర కమిటీ నిర్ణయాలకు, తదితర పైకమిటీల నిర్ణయాలకు విరుద్ధంగా ఉండకూడదు. ఈ సందర్భంలో పైకమిటీలు క్రింది యూనిట్ల వ్యవహారాల్లో అనవసర జోక్యం కల్పించుకోకుండాను, తామే నిర్ణయాలు చేసి పెట్టకుండాను చూడాలి. క్రింది యూనిట్ కు సహాయం చేయడానికి మాత్రం పై యూనిట్ కొన్ని సూచనలు చేయవచ్చు. సరియైన నిర్ణయాలు తీసుకోడానికిది అవసరం. అయితే, నిర్ణయం తీసుకొనే అధికారం మాత్రం క్రింది యూనిట్ దే.

ప్రస్తుతం మన పార్టీ అనేక చోట్ల యిప్పటికీ రహస్యంగానే ఉంది. ఇట్టి పరిస్థితుల్లో పార్టీ యూనిట్ తన పనిని కొనసాగించాలంటే, కొన్ని ప్రత్యేక నిర్మాణ రూపాలు అవసరం. అందుచేతనే రహస్య పార్టీ విషయంలో ఆచరణయోగ్యం కాని బహిరంగ నిర్మాణ రూపాలు, పని పద్ధతులు సవరింపబడాలని నిబంధనావళిలో ఉంది. ఇది చాల అవసరం. నిబంధనావళిలో పేర్కొనబడ్డ నిర్మాణ సూత్రాలను అమలుజరపాలనే మాట నిజమే. అయితే, పార్టీయొక్క నిర్మాణరూపాలు, పని పద్ధతులు పరిస్థితుల కనుగుణ్యంగా మారాలి. ఈ అంశాన్ని గురించి నే నివివరంకే వివరించాను.

★

132

# ౫

# కార్యకర్తల సమస్య

అన్ని స్థాయిలలోనూ నాయకత్వకమిటీలు పార్టీకి, పార్టీ శ్రేయస్సుకు ఎంతో ముఖ్యం. ఈ నాయకత్వకమిటీలన్నిటిలో కార్యకర్త లుంటారు. అందుచేత కార్యకర్తల సమస్య చాల ప్రధానమైనది.

పార్టీ నాయకత్వానికి, చైనా విప్లవానికి కార్యకర్తలు జీవాణువులు. "కార్యకర్తలే అన్నీ నిర్ణయిస్తార"ని మనకు తెలుసు. కార్యకర్తలు లేకపోతే పార్టీ కార్యక్రమాన్ని, పాలసీని ప్రజల్లో అమలు జరపడం, చైనా ప్రజల విముక్తిని సాధించడం అసాధ్యం. గత 24 సంవత్సరాలలో మన పార్టీ నడిపిన వీరోచిత పోరాటాలలో అనేకమంది కార్యకర్తలు రాటుదేరారు. ప్రజల విముక్తికోసం వారుచేసిన త్యాగాల్లో, చూపిన పట్టుదలలో, సృజనాత్మకశక్తిలో చైనా ప్రజల మహోన్నత విప్లవలక్షణాలు ద్యోతక మయాయి. కామ్రేడ్ మావ్ సే-టుంగ్ చెప్పినట్లు, వారు "పార్టీకి, మొత్తం చైనా జాతికి గర్వకారణాలు." గతంలో మన కార్యకర్తలు ఎన్నో త్యాగాలు, ఎంతో కృషి చేసియుండకపోతే, ప్రజ లిప్పుడు సాధించినన్ని విజయాలను సాధించియుండేవారు కారు. ఇక

ముందుకూడా మన కార్యకర్తలందరూ తీవ్రంగా కృషిచేయక పోతే, ప్రజల అంతిమ విజయం సాధ్యంకాదు. అందుచేత చైనా ప్రజల ఆశయసిద్ధికి కార్యకర్తల సమస్య అన్ని సమస్యలకూ కీలకమైనది. ఈ సమస్యపై పొరబాట్లుచేస్తే, చైనా ప్రజల ఆశయానికి ఆటంకం కలుగుతుంది.

మన కార్యకర్తలు ప్రజలనుంచి వస్తారు; ప్రజల్లో పని చేస్తారు. ప్రజలకు వారు నాయకులుగా ఉండాలి; అదే సమయంలో ప్రజాసాన్నిహిత్య పంథా అనుసరించాలి. ప్రజల్లో నాయకత్వానికి వారు జీవాణువులవంటివారు. ప్రజా పోరాటాల్లో వారు ఉద్భవిస్తారు; మరోవైపు ప్రజాపోరాటాలకు నాయకత్వం వహిస్తారు. అందుచేత, ప్రజల్లో భాగమైన ఈ కార్యకర్తలయెడ మనం ప్రత్యేకశ్రద్ధ వహించాలి. ప్రజలపట్ల, ప్రజల ఆశయంపట్ల మనం శ్రద్ధ వహిస్తాం కనుకనే, కార్యకర్తలకు మనం ప్రత్యేక ప్రాముఖ్యత యిస్తాం. కార్యకర్తలయెడ మనం చూపే శ్రద్ధ ప్రజలయెడ చూపే శ్రద్ధనుంచి ఉద్భవిస్తుంది; రెండిటినీ వేరుగా చూడకూడదు. అందుచేత, కార్యకర్తలు ప్రజలనుంచి దూరమైతే, లేదా ప్రజలకు చక్కగా సేవ చేయడానికిబదులు వారికి హాని కలుగజేస్తే, అట్టివారిని మనం గౌరవించము. ఖచ్చితమయిన విద్యాబోధద్వారా పార్టీ అట్టి కార్యకర్తలను సంస్కరించాలి. కాబట్టి కార్యకర్తల్ని అంచనా వేయడంలో అతి ముఖ్యమైన గీటురాయి, ప్రజా దృక్పథం, ప్రజాసాన్నిహిత్య పంథా.

అనేక జీవితరంగాలనుంచి వచ్చే యీ మనం రెండు తరగతులుగా విభజించవచ్చు.

రైతులనుంచి వచ్చినవారు మొదటి తరగతికి చెందుతారు. విద్యార్థులనుంచి, మేధావులనుంచి వచ్చినవారు రెండవ తరగతికి చెందుతారు. అయితే, రెండు తరగతులవారూ ఒకే ఆశయం కొరకు పోరాడుతారు; పని చేస్తారు. నేడు మన కార్యకర్తలలో అధిక సంఖ్యాకులు మొదటి తరగతికి చెందిన వారు, వీరిలో మళ్ళీ రైతులనుంచి వచ్చినవారు అధికసంఖ్యాకులు. వీటినిబట్టి మనపార్టీ చైనా కార్మికవర్గానికి అగ్రగామి అని రుజువవుతోంది. మొత్తం చైనాదేశ చరిత్రలో మన పార్టీయే సామాన్యకార్మికులనుంచి, రైతులనుంచి వచ్చిన వేలాది కార్యకర్తలకు విద్య, తరిఫీదు యివ్వగలిగింది. వారికి మనపార్టీ యిచ్చిన తరిఫీదు, ప్రోత్సాహంవల్లనే, యీరోజున గొప్ప జాతీయ వీరులుగా వారు అభివృద్ధి చెందారు. ఇది మన పార్టీకి, మార్క్సిజం-లెనినిజానికి, మావ్ చైనా విప్లవ సిద్ధాంతానికి గర్వకారణం.

పైరెండుతరగతుల కార్యకర్తలలోసుగుణాలూఉన్నాయి; లోపాలూ ఉన్నాయి. సుగుణాలకు మనం మెరుగుపెట్టాలి. లోపాలను నిర్మూలించాలి. కార్మికులనుంచి, రైతులనుంచి వచ్చిన కార్యకర్తలు ప్రజలతో దగ్గరసంబంధాలుంచుకోడానికి, వాటిని విస్తృత పరచుకోడానికి ప్రయత్నించాలి. ప్రజలకు సన్నిహితమైన కార్యవిధానాన్ని పెంపొందించుకోవాలి. అదే [illegible] లో వారు తమ సాంస్కృతిక బలహీనతలను, సిద్ధాంత [illegible] సరిదిద్దుకోవాలి. ఇక మేధావులనుంచి వచ్చిన [illegible] వాస్తవవిషయాలనుంచి యథార్థాన్ని తెలుసుకో[illegible]్నించాలి. ప్రజాదృక్పథ మలవరచుకోవాలి.

తమ భావవాద దృక్పథాన్ని విడిచిపెట్టాలి. కష్టపడ్డమంటేను, కార్మికులంటేను, రైతులంటేను ఉండే అలసత్వాన్ని నిర్మూలించుకోవాలి. కార్మిక, కర్షక ప్రజాసామాన్యంలో కలిసిపోవడం నేర్చుకోవాలి.

చైనా ప్రజల స్వాతంత్ర్య లక్ష్యం సిద్ధించాలంటే, ఈ రెండుతరగతుల కార్యకర్తలూ అవసరమే. ఏ తరగతినీ మనం విస్మరించకూడదు. కార్మికులనుంచి, రైతులనుంచి వచ్చిన కార్యకర్తలను నిర్లక్ష్యం చేయడం, ద్వేషించడం ఎంతతప్పో, మేధావులనుంచి వచ్చిన కార్యకర్తలను ద్వేషించడం, వారికి వ్యతిరేకంగా విచక్షణ చూపడం కూడా అంతేతప్పు. రెండు తరగతులవారూ ఒకరి నొకరు గౌరవించుకోవాలి; ఒకరినుంచి ఒకరు నేర్చుకోవాలి. అన్ని పరిస్థితుల్లోను వారి మధ్య సన్నిహిత సమైక్యత, అన్యోన్య సహకారం ఉండాలి. మన ఆశయం సిద్ధించడానికిది అత్యవసరం.

ఈ రెండుతరగతులలోను పాతకార్యకర్తలు,కొత్తకార్యకర్తలుకూడాఉన్నారు. అయితే కొత్తవారే అధికసంఖ్యాకులు. జపానువ్యతిరేకయుద్ధం ప్రారంభమైనతర్వాత మనపార్టీలోచేరిన అనేకమంది కార్యకర్తలు ప్రజలకోసం ఎంతో ఉత్తమమైన పనిచేశారు. చక్కని తరిఫీదుపొందారు. పోరాటంలో మంచి అనుభవం సంపాదించారు. మనపార్టీ కొత్త కార్యకర్తలనేకమందిని ఎప్పటికప్పుడు చేర్చుకోవడంద్వారా కొత్తజీవం పోసుకొంటుంది. ఈ నూతన జీవశక్తులద్వారానే మనపార్టీ ఆశయం సిద్ధిస్తుంది. కొత్త కార్యకర్తలకూ, పాత కార్యకర్తలకూ మధ్య

గల సంబంధం - అనగా ఒండొరులయెడ వారు ప్రదర్శించు కొనే వైఖరి - పార్టీలో నిరంతర ప్రాధాన్యత వహించుతుంది.

ఈ సమస్యయొక్క ప్రాముఖ్యతను గురించి, కామ్రేడ్ మావ్ పదే పదే నొక్కి చెప్పాడు. ఆయన యిలా వ్రాశాడు: "పాత కార్యకర్తలందరూ కొత్తవారిని అత్యంత ఉత్సాహంతో ఆహ్వానించాలి. వారిని శ్రద్ధగా చూడాలి...కొత్త కార్యకర్తలు, పాత కార్యకర్తలు ఒకరి నొకరు గౌరవించుకోవాలి; ఒకరినుంచి ఒకరు నేర్చుకోవాలి; ఒకరి సుగుణాల నొకరు అలవరచుకోవాలి; ఒకరి లోపాల నొకరు సరిదిద్దుకోవాలి. అప్పుడు వారంతా ఒకటై ఉమ్మడి ఆశయంకొరకు పోరాడుతారు."

కాని కొంతమంది కామ్రేడ్స్ యింకా కామ్రేడ్ మావ్ ఆదేశంపట్ల తగినంత శ్రద్ధచూపడం లేదనేచెప్పాలి. కొత్త కార్యకర్తలు పాతవారిని ఇప్పటికీ చులకన భావంతోనే చూస్తున్నారు; మరోవైపు పాతకార్యకర్తలు కొత్తవారిని చులకనగా చూస్తున్నారు; వారిని సంతోషంతో ఆహ్వానించడం లేదు; శ్రద్ధతో వారిని చూడ్డంలేదు. వారు దీన్నిగురించి తీవ్రంగా ఆలోచించవలసియుంది; తమ దృక్పథాన్ని వారు పూర్తిగా సరిదిద్దుకోవాలి. అన్ని విషయాల్లో పాతకార్యకర్తలు, కొత్తకార్యకర్తలు ఐక్యమై ఒండొరులతో సహకరించుకొంటేనే, మన కర్తవ్యాలను నెరవేర్చగల్గుతాం.

విప్లవగమనంలో కార్యకర్తల పనిస్వభావాన్నిబట్టి వారి రికార్డునుబట్టి, వారు పనిచేసేప్రదేశాన్నిబట్టికూడా కార్యకర్తల మధ్య తారతమ్యాలేర్పడతాయి. ఉదాహరణకు సైన్యంలోపని

చేసే కార్యకర్తలు వేరు; సివిలియన్ కార్యకర్తలు వేరు. ఒక సైనికదళంలోని కార్యకర్తలు, మరొక సైనికదళంలోని కార్యకర్తలు వేర్వేరుగా ఉంటారు. ఒక ప్రదేశంలోని కార్యకర్తలు మరొకప్రదేశంలోని కార్యకర్తలు ఒకరుగా ఉండరు. ఒక డిపార్టుమెంటు కార్యకర్తలు, మరొక డిపార్టుమెంటు కార్యకర్తలు విభిన్న వ్యక్తులు. స్థానిక కార్యకర్తలు, బయటి కార్యకర్తలు-ఈ విధగా కార్యకర్తల మధ్య ఎన్నో వ్యత్యాసాలుంటాయి. వీరిలో ప్రతి కార్యకర్త ఏదో ఒక విషయరంగంలో ప్రవీణుడు; కాని యితర రంగాల్లో బలహీనుడు. ప్రతి కార్యకర్తకు సుగుణాలూ ఉంటాయి; లోపాలూ ఉంటాయి. అందుచేత వారందరూ ఒండొరుల్ని గౌరవించుకోవాలి; ఒకరికొకరు సహాయం చేసుకోవాలి; ఒకరినుంచి ఒకరు నేర్చు
అనుమానాలతోను, ఫిర్యాదులతోను,
ఒండొరులు కలుసుకోకూడదు. కామ్రేడ్
సంస్కరణను గురించి యిచ్చిన రిపోర్టులో,
ఎలాంటి సంబంధాలుండాలో నొక్కిచెప్పాడు.
ప్రతి కార్యకర్త, ప్రతి పార్టీసభ్యుడు చేయాలి.
ల్లోను కార్యకర్తల మధ్య మహోన్నతమైన ఐక్యం స్పర సహకారం ఉంటేనే మన ఉమ్మడి ఆశయం నెరవేరుతుంది.

కార్యకర్తల యెడ మన పార్టీపాలసీ, కామ్రేడ్ మావ్ పాలసీ యిది : కార్మిక కర్షకులనుంచి వచ్చిన కార్యకర్తలకూ, మేధావులనుంచి వచ్చిన వారికీ మధ్య; పాతకార్యకర్తలకూ, కొత్త కార్యకర్తలకూ మధ్య; వివిధరంగాల్లో పనిచేసే కార్యకర్తలమధ్య; వేర్వేరు ప్రాంతాల్లో పనిచేసే కార్యకర్తలమధ్య;

మొత్తం పార్టీలోని కార్యకర్తల మధ్య ఐక్యత నెలకొల్పడం. అందుచేత, ఐక్యతను ఆటంకపరిచే ప్రతివిషయాన్ని మనం నిరోధించాలి.

ఏ ప్రాతిపదికపై మనం కార్యకర్తల మధ్య ఐక్యతను నిర్మించాలి? ఆ ఐక్యతను ఆటంకపరిచే విషయాలేవి?

మన పార్టీ కేవల మొక సమిష్టి కుటుంబమో, వృత్తి సంఘమో కాదు. అదొక విప్లవ రాజకీయపార్టీ. ఒకే సిద్ధాంతంతో, ఒకే రాజకీయ కార్యక్రమంతో అది నిర్మింపబడింది. అందుచేత, మన కార్యకర్తలమధ్య ఐక్యత సిద్ధాంతేతర ఐక్యత కాదు; వ్యక్తిగత ప్రయోజనాలమీద లేదా అభిప్రాయాల మీద అది ఆధారపడదు. మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంత సమైక్యతపై, చైనా ప్రజల విముక్తికోసం పోరాడేవారందరి సమిష్టి విశ్వాసంపై, ఉమ్మడి కార్యక్రమంపై, కేంద్రకమిటీ సూచించే పోరాటమార్గంపై, అది ఆధారపడుతుంది. కేంద్ర కమిటీ నాయకత్వంక్రింద, కామ్రేడ్ మావ్ నాయకత్వంక్రింద అది ఏర్పడుతుంది. అందుచేత మనం సిద్ధాంతరీత్యా కలిసి ఉన్నంతకాలం, ప్రజలకు సేవచేయడానికి విశ్వాసం, ఒకే కార్యక్రమం మన కున్నంతకాలం, కేంద్రకమిటీ సూచించే మార్గాన్ని మనమంతా బలపరుస్తూ అమలు జరుపుతున్నంత కాలం, ఆ కమిటీ నాయకత్వాన కామ్రేడ్ మావ్ నాయకత్వాన మన మందరం కలిసి పోరాడుతున్నంతకాలం — మనం ఏ తరగతికి చెందిన కార్యకర్తలమైనా సరే, ఏ ప్రాంతంలో లేక ఏ రంగంలో పనిచేస్తున్నా సరే అందరం ఒకటిగా ఉండాలి. అలా ఒకటిగా ఉండకపోవడానికి కారణ

నేమీ లేదు. వ్యక్తిగత జీవితంలో వచ్చే అభిప్రాయభేదాలు గాని మానసిక భేదాలుగాని మనలో తగాదాలు తీసుకు రాకుండా చూడాలి. ఇదే, మొత్తం పార్టీలో ఐక్యతకు, కార్యకర్తలందరి మధ్య ఐక్యతకు పునాది.

మన పార్టీసభ్యులలోగాని, కార్యకర్తలలోగాని ఎవరైనా మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాలకు బదులు పిడివాదాన్నైనా స్వీయానుభవ వాదాన్నైనా బలపరుస్తున్నట్లయితే; లేదా ప్రజల ప్రయోజనాలకు బదులు వ్యక్తిగత ప్రయోజనాలకో గ్రూపు ప్రయోజనాలకో తాపత్రయపడుతూన్నట్లయితే; లేదా కేంద్రకమిటీ మార్గాన్ని అనుసరించడానికి బదులు తద్విరుద్ధంగా పనిచేస్తూన్నట్లయితే; లేదా కేంద్రకమిటీ నాయకత్వాన్నీ, కామ్రేడ్ మావ్ నాయకత్వాన్నీ అంగీకరించడానికి బదులు సర్వస్వతంత్ర మార్గమనుసరిస్తూన్నట్లయితే- మన ఐక్యతకు పునాది కూలిపోతుంది. దీన్నే మరోవిధంగా చెప్పవచ్చు. మ[illegible] పార్టీయొక్క ఉమ్మడి కార్యక్రమానికి [illegible] - లెనినిస్టు సూత్రాలకూ

[illegible]

రాగ్రతత్వం - మొదలైన అపసవ్యధోరణులు మన ఐక్యతను నాశనం చేస్తాయి. అందుచేత మనం వాటి నెదుర్కోవాలి.

మన పార్టీచరిత్రను అనేక సంవత్సరాలు అధ్యయనం చేయడంద్వారాను, త్రైమార్గ సంస్కరణ ద్వారాను పార్టీలో పిడివాదాన్ని మనమిదివరకే తీవ్ర విమర్శకు గురిచేశామని చెప్పవచ్చు. దాని అవశేషాలిప్పటికి ఉన్నప్పటికీ, వాటిని నిర్మూలించడానికి శ్రద్ధవహించవలసిన అవసరమున్నప్పటికీ, యిదివరకంత ప్రబలంగా అది మన పార్టీలో లేదు. దాని వాసనను మన కామ్రేడ్స్ యిదివరకు కంటె బాగా పసికట్టగల్గుతున్నారు. ఇకముందు అది ఎక్కువ చిక్కుల నెదుర్కోవలసి వస్తుంది.

ఇలాగే, స్వీయానుభవవాదాన్ని కూడా మనం త్రైమార్గ సంస్కరణ ద్వారాను, పార్టీ చరిత్రను అధ్యయనం చేయడం ద్వారాను తీవ్ర వి[illegible]ాం. అదికూడా పార్టీలో తగ్గిపోతూంది[illegible]న విమర్శ యింకా తక్కువగా[illegible]

పట్టుదలతో అనుసరించాలి. మొత్తం పార్టీలో ఐక్యత అభి వృద్ధి చెందడానికిది చాల అవసరం.

మన పార్టీలో చాలసంవత్సరాలు సాగిన త్రైమార్గ సంస్కరణద్వారాను, పార్టీ చరిత్రను అధ్యయనం చేయడం ద్వారాను మనం అతి ప్రమాదకరమైన సెక్టేరియన్ పోకడను ప్రధానంగా అధిగమించి నప్పటికీ, కొందరిలో గుడ్డి శిఖరాగ్ర తత్వం యిప్పటికీఉంది. అది ఆంతరంగిక ఐక్యతకు చాల ప్రమాదకరం. మనపార్టీలో ఈ విధమైన గుడ్డి శిఖరాగ్ర తత్వం ఉద్భవించడానికి కొన్ని భౌతిక, చారిత్రక కారణా లున్నాయి. అవి :

1. పార్టీలోను, బయట పెటీబూర్జువావర్గానికి చెందిన వారి నిష్పత్తి ఎక్కువగా ఉంది.

2. గ్రామసీమల్లో గెరిల్లాయుద్ధం చాల కాలంనుంచి సాగుతూండడంవల్ల, ఒకదానితో ఒకటి భేదించే పూర్వ రంగాలు, సంబంధాలు, కార్యవిధానాలు అనేకం ఏర్పడ్డాయి. అందుచేత పార్టీలో వేర్వేరు సెక్షన్లమధ్య చాలకాలంనుంచి అన్యోన్య సంబంధాలు లేకుండా పోయాయి.

3. పార్టీలో మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాల అధ్య యనం తగినంతగా లేదు. అందువల్ల పార్టీలో శిఖరాగ్రతత్వం గల కొందరు సభ్యులు తరుచు అనుకోకుండానే యీ క్రింది అవాంఛనీయ పోకడలను ప్రదర్శిస్తారు. వారు తమ సొంత ప్రతిభకు మాత్రమే ఉప్పొంగుతారు; యితరుల ప్రతిభను మెచ్చుకోక పోవడమో విస్మరించడమో చేస్తారు. తమలో ఉన్న లోపాలేవో తెలుసుకోకుండా, తాము సాధించిన విజ

యాలనుమాత్రం స్తుతించుకుంటారు. అందుచేత యితర కామ్రేడ్స్ తమ విజయాలను స్తుతించడానికే అనుమతిస్తారు; తమ లోపాలెంత స్పష్టంగా కనిపిస్తూన్నప్పటికీ వాటి నెవరైనా విమర్శిస్తే సహించరు. మరోవైపు యితర కామ్రేడ్స్‌లో వారు లోపాలు తప్ప ఇంకేవీ చూడరు. అందుచేత వారు యితరులకు సంబంధించినంతవరకు విమర్శలు మాత్రమే చేస్తారు. వారి యిబ్బందులను పరిగణనలోకి తీసుకోరు. తమలో తాము స్వేచ్ఛగా మాట్లాడుకుంటారు; ఇచ్ఛకాలాడుకుంటారు; కలిసిమెలిసి తిరుగుతారు. కాని తమగ్రూపుకు చెందని యితరులకు వారు అందుబాటులో ఉండరు; దూరంగా ఉంటారు; వారు చెప్పేదేమిటో పట్టించుకోరు. పార్టీ ఆంతరంగిక సంబంధాల్లో వారొకగ్రూపుగా పనిచేస్తారు. ఇతరుల్ని దరిచేరకుండాకూడ చేస్తారు.

పార్టీలో కొందరు, యితరుల్లో భయంకలిగేటట్లు బిర్ర బిగుసుకొని కూర్చుంటారు.

ఈ విధమైన శిఖరాగ్రధోరణి కొన్ని సెక్షన్లలో తరచుగా కనిపిస్తోంది. ఉదాహరణకు స్థానిక కార్యకర్తలకు, బయటివారికి మధ్య; సైన్యంలోని కార్యకర్తలకు, సివిలియన్ కార్యకర్తలకు మధ్య; సైన్యంలోనే ఒక సెక్షన్‌కిచెందిన కార్యకర్తలకు, యితర సెక్షన్లవారికి మధ్య; ఒక జిల్లాకార్యకర్తలకు, మరోజిల్లా కార్యకర్తలకుమధ్య – యీ ధోరణి కనిపిస్తోంది. తత్ఫలితంగా పార్టీలో ఐక్యత బలహీన పడుతోంది; తగాదాలు, ఘర్షణలు బయల్దేరుతున్నాయి. ఈ శిఖరాగ్ర తత్వం అనేక సందర్భాలలో గుడ్డిగాను, తెలియకుండాను బయ

ద్దేరుతుంది. అందుచేత యీ ధోరణిని ప్రదర్శించే కామ్రేడ్స్ సరిగా మాట్లాడి వొప్పించేవరకు వారు తమ పొరబాటును గ్రహించలేరు. ఈ ధోరణిలో ఉండే అంధత్వాన్ని కొందరు చెడు ఉద్దేశంతో ఉపయోగించుకుంటేమాత్రం పార్టీలో ప్రమాదకరమైన తగాదాలు బయల్దేరుతాయి.

శిఖరాగ్ర తత్వమనే గుడ్డిధోరణి ఒక ప్రత్యేకమైన సెక్టేరియన్ పోకడ. ఇందులో, పైకి పొరబాటు రాజకీయ కార్యక్రమనేదీ కనబడదు; కాని రాజకీయమైన, నిర్మాణానికి సంబంధించిన అనేక అపసవ్య అభిప్రాయాలు, ప్రమాదకరమైన ఒంటెత్తు పోకడలు, ప్రజలనుంచి దూరమయే లక్షణాలు యిందులో స్పష్టంగా కనిపిస్తాయి. ఇది మార్క్సిజానికి, లెనినిజానికి వ్యతిరేకం. మొత్తం పార్టీ యొక్క ఐక్యతను యిది బలహీన పరుస్తుంది. ముఠాలు కట్టే ధోరణికిది దారితీస్తుంది. అందుచేత దీన్ని మనం నిర్మూలించాలి. అందరూ ఈ విషయాన్ని స్పష్టంగా అర్థం చేసుకోవాలి; దీన్ని గురించి కొంచమైనా సందేహం ఉండకూడదు.

పార్టీలో శిఖరాగ్రతత్వం ఉన్నదని చెప్పి, దానికిగల భౌతిక కారణాలను వివరిస్తూంటే కొందరు కామ్రేడ్స్ అది తప్పక ఉండవలసిందే ననుకుంటారు; తమలో అది ఉన్నందుకు గర్వం, లేనందుకు విచారం ప్రదర్శిస్తారు. పార్టీలో యీ ధోరణిని వారు పెంచి పోషిస్తారు; బలీయ మొనర్చుతారు; క్రమబద్ధ మొనర్చుతారు. ఈ విధంగా వారు గుడ్డి
తత్వాన్ని చైతన్యంతో కూడిన శిఖరాగ్రతత్వంగా
ఇది మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలకు పూర్తిగా

పార్టీలో శిఖరాగ్రతత్వాన్ని మనం నిర్మూలించాలి. "శిఖరాల" మధ్య ఉండే హద్దుల్నికూడా మనం కూల్చి వేయాలి. ఇతర పొరబాట్లన్నిటి విషయంలోవలెనే యీ పొరబాటునుకూడా సరిదిద్దేటప్పుడు తొందరపాటు చర్యలు, దూకుడు పనులు చేయకూడదు. మొట్ట మొదట మనం భౌతికంగా యీ ధోరణియొక్క ఉనికిని అర్థంచేసుకోవాలి; దాని అంధస్వభావాన్ని, భౌతిక - చారిత్రక కారణాలను దృష్టిలో వుంచుకోవాలి. ఓపికతో మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాలను కూడా వారు అధ్యయనం చేసేటట్లు ప్రోత్సహించాలి. వారు ఆత్మపరిశీలన చేసుకొనేందుకు అవకాశమిచ్చి, కార్యకర్తల చైతన్యాన్ని, పార్టీసభ్యుల చైతన్యాన్ని అభివృద్ధి చేయాలి. ముఖ్యంగా ఎక్కువ అవకాశాలున్న కామ్రేడ్స్ నాయకత్వ పదవుల్లో ఉన్నవారు అట్టి ఆత్మపరిశీలన, ఆత్మ విమర్శన చేసుకోడంలో మార్గదర్శకులుగా ఉండాలి. మొదట దాని అంధస్వభావాన్ని నిర్మూలించి, క్రమంగా యీ వక్ర ధోరణిని రూపుమాపడానికి యిదే సరైన మార్గం. మన కామ్రేడ్స్ మార్క్సిస్టు - లెనినిస్టు చైతన్యాన్ని వృద్ధిచేసుకున్న తర్వాతనే శిఖరాగ్ర తత్వాన్ని సమూలంగా నాశన మొనర్చగల్గుతాం.

మన కార్యకర్తల మధ్య ఐక్యతకు మరొక ఆటంకం, వారు తమ వీపులమీద కట్టుకున్న "సామాను సంచులు". ఇంచుమించు అన్నితరగతుల కార్యకర్తలలో సుగుణాలు, బల కూడా ఉంటాయి; అయితే చాలమంది కామ్రేడ్స్ సుగుణాలనుగురించి అతిశయోక్తులతో చెప్పు

కుంటారు; తమ బలహీనతలను, ఇతరుల సుగుణాలను నిర్లక్ష్యం చేస్తారు. అందుచేత వారు సులభంగా యితరుల యెడ తల బిరుసుతనం అలవరచుకొంటారు. ఇతరుల విమర్శనను గాని, "బాతాఖానీ"ని గాని వారు సహించలేరు. తత్ఫలితంగా వారి సుగుణాలే వారి వీపులమీది "సామాను సంచులు"గా తయారవుతాయి; పురోభివృద్ధికి, ఐక్యతకు ఆటంకాలుగా పరిణమిస్తాయి. అందుచేత వారి సుగుణాలు బలహీనతలుగా మారుతాయి.

ఉదాహరణకు కార్మికులనుంచి, రైతులనుంచి వచ్చిన కార్యకర్తలు తరచు తమ సాంఘిక హోదానుగురించి గర్విస్తారు; మేధావులనుంచి వచ్చిన కార్యకర్తల్ని చులకనగా చూస్తారు. ఇటు మేధావులుకూడా, తమ జ్ఞానాన్నిగురించి గర్విస్తూ "కుక్క-కాటుకు చెప్పుదెబ్బ" అనే ధోరణిలో వ్యవహరిస్తారు. పాత కార్యకర్తలు తరచు తాము కొత్తవారికంటె ఎక్కువకాలం పార్టీలో ఉన్నామనీ, యితరులకంటె దీర్ఘకాలం పోరాటాల్లో పాల్గొన్నామనీ గర్విస్తూ, కొత్త కార్యకర్తల్ని చిన్నచూపు చూస్తారు. ఇటు కొత్తవారు, తామెక్కువ తెలివితేటలు గలవారమనీ, శక్తివంతులమనీ భావించి, పాత కార్యకర్తల్ని చులకనగా చూస్తారు. సైన్యంలో పనిచేసే కార్యకర్తలు, యుద్ధంలో తమకున్న శక్తిసామర్థ్యాల్ని అవకాశంగా తీసుకొని, సివిలియన్ కార్యకర్తల్ని తక్కువ చూస్తారు; ఇటు సివిలియన్ కార్యకర్తలు తమ దీర అనుభవాన్ని ఆధారంగా చేసుకొని, సైన్యంలో కార్యకర్తల్ని చులకనగా చూస్తారు. ఇలాగే

చెందిన కార్యకర్తలు, శత్రువుపై తాము మొక్కిన విజయాలు సాధించామనే గర్వంతో మరొకదశానికి చెందినవారిని చిన్న చూపు చూస్తారు; వారుకూడా వీరియెడల ఇలాంటి వైఖరినే ప్రదర్శిస్తారు. అంతేగాక, వివిధ ప్రాంతాలకు, రంగాలకు సంబంధించిన కార్యకర్తలు తరచు తమ శక్తిసామర్థ్యాల్నీ జ్ఞానాన్నీ చూచుకొని, ఒండొరుల్ని తమకంటే తక్కువగా చూస్తారు.

కొందరి వీపులమీద "సామాను సంచులు" ఉండడం వల్ల యితరుల్ని వారు చిన్నచూపు చూస్తారు. ఇది తప్పని సరిగా క్రోధావేశాలు కలిగిస్తుంది; కార్యకర్తలమధ్య అనైక్యతకు కారణమవుతుంది. కనుకనే కామ్రేడ్ మావ్ మన కార్యకర్తల్ని తమ వీపులమీది "సామాను సంచు"లను పరీక్షించుకోమని హెచ్చరించాడు. తమ మానసిక శృంఖలాలను త్రెంచుకోవాలంటే, ప్రజలతో సంబంధాలు నెలకొల్పుకుంటూ తప్పులు చేయకుండా జాగ్రత్తపడాలంటే, మొత్తం పార్టీని ఐక్యపరచాలంటే - వారు తమ "సామాను సంచు"లను త్రెంచుకోవాలని చెప్పాడు.

కాని కొంతమంది కామ్రేడ్స్ తమ వీపులమీది "సామాను సంచుల్ని" చూచుకోవడంలేదు. అవి తమ కెంతో భారంగా తయారయ్యాయనీ, వాటిని త్రెంచివేసుకోవలసిన [illegible]రమున్నదనీ వారు గ్రహించడంలేదు. అందుచేత కార్య[illegible] తమ చైతన్యాన్ని వృద్ధిచేసుకొని, అహంభావాన్ని [illegible]లి. లేకపోతే అది వారి సుగుణాలను, విజయా[illegible]దు సరికదా, ఆ సుగుణాలనే లోపాలుగా

మాఁస్తుంది. కనుకనే కామ్రేడ్ మావ్ సె-టుంగ్ మనల్ని మెదడు ఉపయోగించమనీ, సక్రమంగా ఆలోచించమనీ, ప్రతీదీ సమగ్రంగా పరిశీలించమనీ, పార్టీలోని అంధత్వాన్ని నిర్మూలించమనీ ఆదేశించాడు. తద్వారా మన కార్యకర్తల సుగుణాలు పెంపొందుతాయనీ, లోపాలు తొలగిపోతాయనీ చెప్పాడు. రోజురోజూ, నెలనెలా అభివృద్ధిని సాధించడానికి మార్గమిదే నన్నాడు. అట్టి అభివృద్ధిని ప్రాతిపదికగా చేసుకుంటే, మన కార్యకర్తలలో ఐక్యత ఎంతో బలపడుతుంది.

మన కార్యకర్తలు తమ "సామాను సంచుల"ను, శిఖరాగ్ర తత్వాన్ని, స్వీయ మానసికతత్వాన్ని పూర్తిగా విసర్జించాలి. అన్ని ముఖ్య సమస్యలను పరిశీలించడంలో తమ మెదడును ఉపయోగించాలి. తమ చైతన్యాన్ని వృద్ధి చేసుకోవాలి; అంధత్వాన్ని నిర్మూలించుకోవాలి; నమ్రతతోను, జాగ్రత్తగాను మెలగాలి; అహంభావాన్ని, దురుసుతనాన్ని దూరంగాపెట్టాలి; కామ్రేడ్ మావ్ నాయకత్వాన పనిచేసే కేంద్రకమిటీ విధానంక్రింద, నాయకత్వంక్రింద ఐక్యతను సాధించాలి. అప్పుడు మనకు విజయం తప్పదు. ఇది మన పార్టీ కార్యకర్తలందరి తక్షణ కర్తవ్యం.

మన కార్యకర్తల ఐక్యత, అభివృద్ధి ఒకే సమస్య యొక్క రెండుముఖాలు; అంతేగాని రెండూ వేర్వేరు సమస్యలు కావు. మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాలను, మావ్ చైనా విప్లవ సిద్ధాంతాన్ని అధ్యయనంచేయకుండా, తమ చైతన్యస్థాయిని వృద్ధిచేసుకోకుండా, తమ వీపులపైనున్న "సామాను సంచుల"ను వొదుల్చుకోవడంగాని, గుడ్డి శిఖ

ర్యాగ్రతత్వాన్ని విసర్జించడంగాని, స్వీయ మానసికతత్వాన్ని అధిగమించడంగాని, పార్టీసభ్యుల్నీ, ప్రజల్నీ సమీకరించవలసిన అవసరాన్ని గుర్తించడంగాని, అహంభావాన్నీ, నిర్లక్ష్యాన్నీ తొలగించుకోవడంగాని సాధ్యంకాదు. అందుచేత మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలను, మావ్ చైనావిప్లవసిద్ధాంతాన్ని నిర్విరామంగా మరింత ఏకాగ్రతతో అధ్యయనం చేయవలసియుంది. ఆదేసమయంలో త్రైమార్గ సంస్కరణ ననుసరించి విమర్శన-ఆత్మవిమర్శన చేసుకోవాలి. ఇదే మన పార్టీకి, కార్యకర్తలకు చోదకశక్తి. ఇలాచేస్తే, మన లోపాలను సరిదిద్దుకొని, మన చైతన్యాన్ని వృద్ధిచేసుకోగల్గుతాం. అంచేత, మన పార్టీ కార్యకర్తలయెడ అనుసరించవలసిన విధానం, వారిని సంస్కరించడం, వారి లోపాలను సరిదిద్ది, విమర్శన - ఆత్మవిమర్శనద్వారా వారి చైతన్యాన్ని వృద్ధిచేయడం.

చాలకాలం ఎడతెగకుండా జరిగిన విప్లవపోరాటాలలో చాలమంది కార్యకర్తల్ని మనం కోల్పోయాం. దీనికితోడు, విప్లవం నానాటికీ అభివృద్ధిచెందుతూండడంవల్ల కొత్త కార్యకర్తల అవసరం ఎప్పటికప్పుడు హెచ్చుతోంది. ప్రజాపోరాటమనే మహావెల్లువలో అనేకమంది కార్యకర్తలు - శక్తివంతులైనవారు - ఉద్భవించారు. వీటన్నిటివల్ల, కార్యకర్తల్ని జాగ్రత్తగా ఎన్నుకోవలసిన కర్తవ్యం, వారిని ప్రమోట్ చేయవలసిన కర్తవ్యం ప్రతిరోజూ మనల్ని ఎదుర్కొంటూంది.

ఏవిధంగా మనం కార్యకర్తల్ని ఎన్నుకోవాలి? ఏ విధంగా వారిని ప్రమోట్ చేయాలి? ఏ కొలబద్దలను ఉపయోగించాలి? -

మన కార్యకర్తలలో కమ్యూనిస్టు విప్లవకాంక్షలకు వుండవలసిన వేడిరక్తమేగాక, ప్రశాంత చిత్తంతో కూడుకున్న విప్లవ విచక్షణకూడా ఉండాలి.

ప్రజాసేవలో మన కార్యకర్తలకు అనంతమైన విశ్వాసం ఉండాలి; ప్రజలతో వారు సన్నిహిత సంబంధ ముంచుకోవాలి. క్లిష్టపరిస్థితుల్లో స్వతంత్రంగా మార్గం చూపగలవారై ఉండాలి. నిర్ణయాలు తీసుకోవడంలో నిర్భయంగా బాధ్యత వహించాలి. మంచి క్రమశిక్షణ కలిగియుండాలి. శత్రువుతో పోరాడేవిషయంలోను, సిద్ధాంత సమస్యలపై ఆంతరంగిక పోరాటాలు జరపడంలోను మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలను అన్వయించగలిగియుండాలి.

6 వ పార్టీ మహాసభచే ఎన్నుకోబడిన కేంద్రకమిటీ విస్తృత సమావేశంలో కామ్రేడ్ మావ్ కార్యకర్తల విషయమై అనుసరించవలసిన విధానాన్ని తెలియజేశాడు. "పార్టీ పాలసీని దృఢనిశ్చయంతో అమలుజరపడం, పార్టీశిక్షణను పాటించడం ప్రజలతో సన్నిహితసంబంధా లుంచుకోవడం, స్వతంత్రంగా ఆలోచించి పనిచేయగలగడం, పనిచేయడంలో అభిరుచి కలిగియుండడం, స్వార్థరహితంగా ఉండడం" ఇవి మన కార్యకర్తలకుండవలసిన లక్షణాలని అతడు చెప్పాడు. కార్యకర్తల నెన్నుకోవడంలో ఇవే గీటురాళ్ళని స్పష్టపరచాడు.

క్లుప్తంగా చెప్పాలంటే, ప్రజలకు ఉత్తమంగా సేవ చేయగలవారే ఉత్తమకార్యకర్తలు.

పైన పేర్కొన్న గీటురాళ్లు సరియైనవేనని మన కామ్రేడ్స్ అందరికీ తెలుసు. అయినప్పటికీ, కొందరు కామ్రేడ్స్

కొత్త గీటురాళ్ళు తీసుకు వస్తున్నారు. కార్యకర్తల్ని ఎన్నుకోవడంలోను, ప్రమోట్ చేయడంలోను వారివారి సభ్యత్వ కాలాన్ని, అర్హతల్నిమాత్రమే గీటురాళ్లుగా తీసుకోవాలంటారు. మరికొందరు ఇంకొకవిధంగా ఆలోచిస్తారు. కార్యకర్త పనిచేయగలవాడా లేదా అనే విషయాన్నిబట్టి కాక, చక్కగా మాట్లాడగలడా లేక వ్రాయగలడా అనే విషయాన్ని బట్టి వారు కార్యకర్తల్ని ఎన్నుకోవాలంటారు. గుడ్డి అనుసరణ వ్యక్తిగతసంబంధాలుకూడా కార్యకర్తల అర్హతలుగానేకొందరిచే పరిగణింపబడుతున్నాయి. కార్యకర్తల్ని ఎన్నుకోవడంలోను, ప్రమోట్ చేయడంలోను పై గీటురాళ్ళు సరియైనవికావని సులభంగానే తెలుసుకోవచ్చు.

ఇక కార్యకర్తల్ని పరిశీలించవలసిన విధానమేమిటో చూదాం.

ఇది రెండు పద్ధతుల్లో జరగాలి. మొదటిది: నాయకుడు కార్యకర్తను వివరాలతో అతి సన్నిహితంగా పరీక్షించాలి. అతని శక్తిసామర్థ్యాలేమిటో, బలహీనత లేమిటో, తెలుసుకోవాలి. అతని సుగుణాలను, లోపాలను కూడా కనిపెట్టాలి. అతని వ్యక్తిగత చరిత్ర, కార్యకలాపాలు కూలంకషంగా తెలుసుకోవాలి. రెండవది: కార్యకర్త ఏ ప్రాంతంలో పని చేస్తుంటే ఆ ప్రాంతంలోనే సాధారణ సభ్యుల ద్వారా పరీక్షించాలి. ఈ రెండు పద్ధతులను సమన్వయపరచడం ద్వారానే కొంతవరకు సమగ్రమైన, సరియైన అంచనా ఏర్పడుతుంది; అప్పుడు పెడమార్గాలు అవలంబించకుండా జాగ్రత్త పడగల్గుతాం.

కార్యకర్తల్ని పైవాళ్ళు మాత్రమే పరీక్షించాలని కొందరి అభిప్రాయం. అంటే అర్థం, పైవాళ్ళు క్రిందివారి పనిని గురించి ఏ రిపోర్టు వ్రాస్తారో దాన్ని ఆధారంగా చేసుకొని పైవాళ్ళు పరీక్షించాలన్నమాట. ఇది పొరబాటు. అట్టి పరీక్ష అవసరమనేమాట నిజమే. కాని అదొక్కటే సరిపోదు. క్రింది నుంచి కూడా కార్యకర్తల్ని పరీక్షించాలి. అంటే, నాయకత్వం వహిస్తున్న కార్యకర్తల్ని ప్రజలే పరీక్షించాలన్నమాట. రెండిటిలోను ఈ పద్ధతి ఎక్కువ ప్రయోజనకారి.

కార్యకర్తల్ని ప్రజలు, సాధారణసభ్యులు పరీక్షచేయడానికి, ఎన్నుకోవడానికి ఏ యేచర్యలు అవసరమో పార్టీ నిబంధనావళి తెలియజేస్తూంది. ఆ చర్యలు ఇవి: వివిధపార్టీ సమావేశాల్లోను, కాన్ఫరెన్సులలోను, మహాసభలలోను సాధారణ సభ్యులు నాయకుల్ని పరీక్షించడం; నాయకులు తమపనిని గురించి ఇచ్చేరిపోర్టుల్ని గురించి, వారిలోపాలను విమర్శించడం; నాయకత్వకమిటీలను స్వయంగా ఎన్నుకోవడం. నిబంధనావళిలో విధింపబడిన పద్ధతిప్రకారం కేంద్రీకృత ప్రజాస్వామ్య సూత్రాన్ని పార్టీలో ఖచ్చితంగా అమలు జరపాలి. ఎన్నికల ద్వారా పార్టీయంత్రాన్ని నిర్మించడం, అభ్యర్థుల్ని నామినేట్ చేసే అధికారం, తిరస్కరించే అధికారం ఉండడం, విమర్శన—ఆత్మ విమర్శన విషయంలో స్వేచ్ఛ – వీటన్నిటినీ ఖచ్చితంగా అమలుజరపాలి.

కార్యకర్తల్ని పైనుంచీ క్రిందినుంచీకూడ పరీక్షించి, ఎన్నుకొని, ప్రమోట్ చేసినట్లయితే తప్పక సత్ఫలితాలు కలుగుతాయి. కనుకనే పార్టీ నాయకత్వకమిటీ ఎన్నికల

ద్వారానే యేర్పడాలని, ఆ ఎన్నికను పై కమిటీ ఆమోదించాలని నిబంధనావళిలో పేర్కొనబడింది.

అనేక జిల్లాలలో పార్టీ యూనిట్లు తమ తమ ప్రాంతాలలో బాధ్యతగా పనులు నిర్వర్తించడానికి స్థానిక కార్యకర్తల్ని ఎంచుకొనే విషయంలోను, ప్రమోట్ చేసే విషయంలోను, అభివృద్ధిచేసే విషయంలోను తగినంత శ్రద్ధ చూపడంలేదు. ముఖ్యంగా సైన్యంలో పనిచేయడానికి స్థానిక కార్యకర్తలను అభివృద్ధిచేసే విషయంలో ఈ లోపం బాగా కనిపిస్తుంది. ఉదాహరణకు 1943 లెక్కలనుబట్టి తైపీ ఏరియాలో 8 రీజినల్ కమిటీలకు చెందిన 37 గురు కార్యకర్తలలో ఆ ప్రాంతపువారు 9 మంది మాత్రమే. అనగా నూటికి 24 అన్నమాట. మిగతా 28 మందీ – అంటే నూటికి 76 – బయటనుంచి వచ్చినవారే. తైయూ ఏరియాలో 4 రీజినల్ కమిటీల అధీనంక్రింద ఉన్న కౌంటీ కమిటీలలో 37 గురు కార్యకర్తలున్నారు. వారిలో 6 గురు మాత్రమే (అంటే నూటికి 16) ఈ కౌంటీలవారు. మిగతా 31 మంది (అంటే నూటికి 84) బయటివారు. తైహాంగ్ ఏరియాలో ఆరవ రీజినల్ కమిటీ కంట్రోల్‌లో ఉన్న 5 కౌంటీ కమిటీలలో 18 గురు కార్యకర్తలున్నారు. వీరిలో 5 గురు మాత్రమే (అంటే 100 కి 28) స్థానికులు. మిగతా 13 గురు (అంటే 100 కి 72) బయటివారు. ఈ అంకెలనుబట్టి, స్థానిక కార్యకర్తల్ని కౌంటీ కమిటీలలో సహితం, రీజినల్ కమిటీలలో సహితం చాల అరుదుగా మాత్రమే తీసుకుంటున్నారని బోధపడుతుంది. అంతకన్న పైనున్న కమిటీలలోకి తీసుకొనే సమస్య అసలే లేదు.

నైహాంగ్ ఏరియా కమిటీ లోగడ పంపిన రిపోర్టులను బట్టి, ఆ ప్రాంతంలో వివిధ స్థాయిలకు, రంగాలకు చెందిన కార్యకర్తలు మొత్తం 5000 మంది ఉన్నారు. వారిలో 100 కి 80 మంది ఆ ప్రాంతానికి చెందినవారు. 20 మంది మాత్రమే బయటివారు. అంటే, 1943లో కన్న స్థానికుల నిష్పత్తి పెరిగిందన్నమాట. కాని, అనేక నాయకత్వ కమిటీలలో బయటివారే బాధ్యతగల కార్యకర్తల్లో అధిక సంఖ్యాకులు. కార్యకర్తలకు పని విభజన విషయంలో, ముఖ్యంగా బాధ్యతగల పనులిచ్చే విషయంలో, తరుచు వారిని తమ సొంత కౌంటీలలోను, రీజియనులలోను ఉంచకుండా బయటి ప్రాంతాలకు పంపడం జరుగుతోంది. అందుచేత యిప్పటికీ బాధ్యతాయుత స్థానాలలో బయటివారే అధిక సంఖ్యాకులుగా వున్నారు. ఈ పరిస్థితిని మనం పూర్తిగా మార్చాలి. అనేక యితర విప్లవ స్థావరాలలో కూడా యిలాంటి పరిస్థితులే వున్నాయి.

కొన్ని ప్రాంతాల పార్టీయూనిట్లలో నిరంకుశంగా క్రింది కమిటీలకు బాధ్యతగల స్థానాల్లో సభ్యుల్ని నియమించడం, క్రింది కమిటీల కార్యకర్తల్ని ఆషామాషీగా యితర ప్రాంతాలకు ట్రాన్స్‌ఫర్ చేయడం, "సామ్రాజ్య దూతల"ను పంపడం–ఇప్పటికీ అమలు జరుగుతోంది. ఉదాహరణకు, దక్షిణ హూపీనుంచి వచ్చిన రిపోర్టులనుబట్టి, అక్కడి రీజినల్ కమిటీల కార్యదర్శులు ఏడేండ్లలో ఆరుకన్న ఎక్కువసార్లు ట్రాన్స్‌ఫర్ చేయబడ్డారు. అయిదుకన్న తక్కువసార్లెవరూ ట్రాన్స్‌ఫర్ చేయబడలేదు. అలాగే కౌంటీకమిటీల కార్యదర్శులు 5 నుంచి 13 సార్లు ట్రాన్స్‌ఫర్ చేయబడ్డారు. వాల్గవ రీజినల్

కమిటీ కార్యదర్శి కా(మ్రేడ్ లీ హుంగ్-షాన్ .6 ఏండ్లలో 8 సార్లు కౌంటీకమిటీలకు కార్యదర్శిగా పనిచేశాడు. ఈ విధంగా క్రింది యూనిట్లకు చెందిన కార్యకర్తల్ని ఆషామాషీగా ట్రాన్స్‌ఫర్ చేసే పద్ధతికి స్వస్తిచెప్పాలి.

కొత్తగా ఏర్పడ్డ విప్లవస్థావరాలకు బయటినుంచి కార్యకర్తల్ని పంపడం సర్వసాధారణంగా అవసరమవుతుంది. అయితే, ఆ ప్రాంతాలకు సంబంధించినవారినే పంపడానికి శ్రద్ధ వహించాలి. ఇతరచోట్లనుంచి కార్యకర్తల్ని పంపే టప్పుడు, స్థానిక కార్యకర్తలకు వారు సలహాదార్లుగానే ఉండా లని, స్థానిక కార్యకర్తలకు శక్తినంచనలేకుండా సహాయ పడాలని, తాముచేసే పనిని వారికి నప్పజెప్పి రావడానికి సిద్ధంగాఉండాలని స్పష్టంగా చెప్పాలి. బయటినుంచి వెళ్ళే కార్యకర్తలు తాము మాత్రమే ప్రతీదీ చేయకూడదు; స్థానిక కార్యకర్తలు స్వయంగా పనిచేసే అవకాశాన్ని నిరాకరించ కూడదు.

ఇదివరకే స్థానిక కార్యకర్తలు, నాయకత్వకమిటీలు ఉన్న ప్రాంతాలలో బయటినుంచి ఎవరినీ పంపకూడదు. ఒక వేళ పంపడం తప్పనిసరి అయితే, వారితో, అక్కడున్న కమి టీల కార్యకర్తల నాయకత్వంక్రింద ఉన్న పరిస్థితులను జాగ్ర త్తగా పరిశీలించమనీ, భక్తిశ్రద్ధలతో పనిచేయమనీ, అక్క డున్న కార్యకర్తలకు చేయూత నివ్వమనీ - నొక్కిచెప్పాలి. పెత్తందార్ల మాదిరిగా అధికారం చెలాయించడం కూడదని స్పష్టపరచాలి.

పై కమిటీలు క్రింది కమిటీలకు ఇన్‌స్పెక్టర్లను పంప డంలోకూడ అతిజాగ్రత్తగాఉండాలి. "సామ్రాజ్యదూతలు"గా వ్యవహరించవద్దని యీ ఇన్‌స్పెక్టర్లను హెచ్చరించాలి. క్లుప్తంగా చెప్పాలంటే, ఉత్తరువులు జారీచేయడంద్వారా పనులు చేసే పాతపద్ధతిని పూర్తిగా మార్చుకోవాలి.

స్థానిక కార్యకర్తలను అభివృద్ధిచేయాలనీ, సరిగా ఎంచుకోవాలనీ, అట్టివాళ్ళని ప్రమోట్‌చేయాలనీ పార్టీ నొక్కి-చెప్పడంలో ఉద్దేశ మేమిటో పార్టీసభ్యులందరూ తెలుసుకోవాలి. ఇది కేవలం కార్యకర్తలకు మాత్రమే సంబంధించిన విషయం కాదనీ, పార్టీకి, ప్రజలకు మధ్య ఉండవలసిన సంబంధాన్ని యిది తెలియజేస్తుందనీ అర్థంచేసుకోవాలి. బయటినుంచి వెళ్ళే కార్యకర్తలుకూడా ప్రజలతో సన్నిహిత సంబంధాలుంచుకోవాలన్నమాట నిజమే. అయితే అట్టి సంబంధాలు స్థానిక కార్యకర్తలద్వారానే ఏర్పడగలవు; స్థానిక ప్రజలనుంచి చక్కని కార్యకర్తలను అభివృద్ధి చేయడంద్వారానే ఆ సంబంధాలు బలపడగలవు. స్థానిక కార్యకర్తలనుంచి వేరుకావడమంటే అర్థం ప్రజలనుంచి వేరుకావడమే. స్థానిక కార్యకర్తల యెడ గౌరవం లేకపోవడమంటే, లక్ష్యం లేకపోవడమంటే అర్థం పార్టీయెడల, ప్రజలతో ఉంచుకోవలసిన సంబంధాల యెడలకూడా గౌరవం, లక్ష్యం లేకపోవడమన్నమాట. స్థానిక ప్రజలతో సన్నిహిత సంబంధాలుంచుకోడానికి కీలకం స్థానిక కార్యకర్తలకూ బయటి కార్యకర్తలకూ మధ్య చక్కని సంబంధాలను పెంపొందించడం, బయటి కార్యకర్తల్ని అధిక సంఖ్యాకులైన స్థానిక కార్యకర్తలు త్రికరణశుద్ధిగా బలపర

చడం అని గత అనుభవం తెలియజేస్తూంది. ఒక ప్రదేశంలో మనపార్టీ చేసే పనికి ప్రధానమైన కొలబద్ద ఆ ప్రదేశంలో ప్రజలనుంచి తగినంతమంది కార్యకర్తల్నీ, నాయకుల్నీ అభివృద్ధి చేశామా లేదా అనే దానిపై ఆధారపడి యుంటుంది.

ప్రజలతో సన్నిహిత సంబంధాలుంచుకోవాలనే విషయానికి పార్టీ అధికప్రాముఖ్యత యిస్తుంది కనుకనే, అది స్థానిక కార్యకర్తల కెంతో విలువయిస్తుంది. వారికోసమే వారికి విలువ యివ్వమనికాదు పార్టీ కోరేది; బయటి కార్యకర్తల్నికూడా అది నిర్లక్ష్యం చేయదు. దేశంలో ఎక్కడ పని చేయడానికైనా సరే శక్తి సామర్థ్యాలుగల కార్యకర్తలు మనపార్టీలో చాలమంది ఉన్నారు. కారణ మేమంటే, వారంతా అనేక పోరాటాల్లో రాటుదేరి, ఎంతో అనుభవం సంపాదించారు. పార్టీకి వారు అమూల్యమైన పెట్టుబడి అని చెప్పవచ్చు. అయితే, యిలాంటి కార్యకర్తలు మాత్రమే మనకుండి, ప్రతిచోటా అసంఖ్యాకంగా ఉండే స్థానిక కార్యకర్తలమధ్య సమన్వయంకూడా లేకపోతే, లేదా వారు స్థానిక కార్యకర్తల్ని అభివృద్ధి చేయడంలోను, ఎన్నుకోడంలోను, ప్రమోట్ చేయడంలోను విఫలమైతే, అధిక సంఖ్యాకులైన స్థానిక కార్యకర్తలతో మంచి సంబంధా లుంచుకోలేకపోతే - అప్పుడు మనపార్టీ ఆశయం, ప్రజల ఆశయం సిద్ధించదు.

ఇలా కాకుండా ప్రతిచోటా బయటి కార్యకర్తలు స్థానిక కార్యకర్తలతోను, ప్రజలతోను మంచి సంబంధాలుంచుకున్నట్లయితే, మనం ముందుకు పోగలం; మన ఆశయాన్ని సాధించగలం. ఇక్కడే యీ సమస్యయొక్క కీలకం

ఉంది. స్థానిక కార్యకర్తలు ప్రజలతో సంబంధాలుంచుకోవాలనే మాట వాస్తవమే. ప్రజలనుండి దూరమయేవారికి, చెడుగా ప్రవర్తించే వారికి స్థానం ఉండకూడదు. కాని యీలోగా బయటి కార్యకర్తల్ని తిరస్కరించకూడదు; వారినుంచి స్థానిక కార్యకర్తలు నేర్చుకోవాలి. అయితే స్థానిక కార్యకర్తల్ని గౌరవించడంలోను, అభివృద్ధి పరచడంలోను, సహాయం చేయడంలోను ప్రధానంగా బాధ్యత వహించవలసింది బయటి కార్యకర్తలు.

పార్టీ కొన్ని రాజకీయ కారణాలతోను, భౌతిక పరిస్థితుల వల్ల ఒక్కొక్క దశలో ఒక్కొక్క తరగతికిచెందిన కార్యకర్తల్ని అభివృద్ధిచేయడం ముఖ్యమని భావిస్తుంది. మరో కారణ మేమీ ఉండదు. అట్టి కార్యకర్తలు యితరులకంటె గొప్పవారనీకాదు; ప్రత్యేకంగా వారంటే అభిమానం ఉండీ కాదు. మనం యీ కార్యకర్తల సమస్యను, కార్యకర్తలయెడ అనుసరించవలసిన విధానాన్ని నిర్మాణం దృష్టితో కాక, రాజకీయ దృక్పథంతో పరిశీలించాలి; కార్యకర్తల దృష్టితో మాత్రమే దీన్ని పరిశీలించడం అసలే పనికిరాదు.

ప్రజలతో దగ్గర సంబంధా లుంచుకొనే క్రమబద్ధ, సముచిత, సమైక్య నాయకత్వాన్ని తయారుచేయడం ఎంతో ముఖ్యం. ప్రతి ప్రాంతానికి, ప్రతి రంగానికి సంబంధించిన దైనందిన కార్యకలాపాల్లో, పోరాటాల్లో నాయకత్వం వహించడానికి కావలసిన కార్యకర్తల్ని తయారుచేసే విషయంలో అన్ని నాయకత్వ కమిటీలు, అందరు పార్టీసభ్యులు శ్రద్ధ వహించాలి. అయితే అట్టినాయకుల్ని హడావిడిగా పరీక్షణాల్లో

తయారు చేయలేం. చాలకాలం పనిచేస్తేనే, ఒక్కొక్కప్పుడు జయాపజయాలతో కూడిన బాధాకరమైన మార్గంద్వారానే, చేసిన పొరబాట్లను సరిదిద్దుకోవడంద్వారానే యిది సాధ్యం. ప్రతి పార్టీయూనిట్ ముందు ముందు నాయకులుగా తయారు కావలసిన కార్యకర్తల్ని ఎలా సంఘటితపరచుకోవాలో తెలుసుకోవాలి; శక్తిసామర్థ్యాలు లేనివారి స్థానంలో, లేదా లోపభూయిష్టమైన కార్యవిధానంగలవారి స్థానంలో ఉత్తమ కార్యకర్తల్ని ఎన్నుకోవడ మెలాగో తెలుసుకోవాలి.

అయితే, బాధ్యతగల కార్యకర్తల్ని ట్రాన్స్‌ఫర్ చేసే విషయంలోను, ఏదైనా ఒక నాయకత్వ కమిటీని పునర్నిర్మించే విషయంలోను పార్టీకి, ప్రజలకు ఖచ్చితమైన బాధ్యత వహించాలి. దానంతట అది జరిగిపోకుండా, నిర్లక్ష్యంగా దాన్ని పరిష్కరించ పూనుకోకుండా జాగ్రత్త వహించాలి. పై పార్టీ యూనిట్లు బాధ్యతగల స్థానాల్లో ఉన్న క్రింది యూనిట్ల కార్యకర్తలను విచక్షణా రహితంగా ట్రాన్స్‌ఫర్ చేయకూడదు. పార్టీనిబంధనావళి ప్రకారం జరిగే ఎన్నికల్లో సహితం విచక్షణా రహితమైన ట్రాన్స్‌ఫర్లు పనికిరావు. ఒక నాయకత్వ కమిటీని పునర్నిర్మించ దలచుకుంటే, అట్టి చర్యవల్ల పరిస్థితి బాగుపడుతుందని, ప్రజలకెక్కువ ఉపయోగం కలుగుతుందని తెలిసి ఉండాలి. అట్టి సత్ఫలితం కలుగకపోతే, లేదా అట్టి పునర్నిర్మాణంవల్ల అనుకున్న ఫలితాలకు బదులు తద్వ్యతిరేక ఫలితాలు కలిగితే, అందుకు పూనుకోకూడదు. అట్టి నాయకత్వకమిటీకి సహాయం చేయడంలోను, ఎడ్యుకేట్ చేయడం లోను ఓపికను ప్రదర్శించాలి. ఆ విధంగా ప్రత్యక్ష కార్యా

చరణద్వారాను, ప్రజాపోరాటాలద్వారాను నేర్చుకొనేందుకు అవకాశ మీయాలి.

తప్పులు చేసిన కొందరు కార్యకర్తలస్థానే యితరుల్ని తీసుకోవాలి. కాని అందరినీ అలా తొలగించకూడదు. ఎందు చేతంటే చాల సందర్భాలలో వారు తప్పులు చేయని వారి కంటే అధ్వాన్నంగా ఉండరు. వారు నిజంగా తమ తప్పులు తెలుసుకొని వాటిని సరిదిద్దుకో గలిగితే, ప్రజలకు సేవ చేయ డంలో బహుశా అంతకన్న బాగాను, ఉపయోగకరంగాను పనిచేయగలరు.

పార్టీ నిబంధనావళి ప్రకారం సబ్ డిస్ట్రిక్టు కమిటీ లగాయతు అన్ని నాయకత్వ కమిటీలు రెండు సంవత్సరాల కొకసారి ఎన్నుకోబడాలి. తప్పనిసరి అయితేతప్ప, అంతకన్న తరచుగా ఎన్నికలు జరగకూడదు. కొత్త ఎన్నికల్లో సహితం అవసరమైతేతప్ప, అంతకన్న మంచి కార్యకర్తలు దొరికితే తప్ప కార్యకర్తల్ని తొందర తొందరగా మార్చడం వాంఛ నీయంకాదు. కొత్తవారినిమాత్రం తప్పక తీసుకోవలసిందే. ఈ విషయాన్ని పై నాయకత్వ కమిటీలు, పార్టీసభ్యులు దృష్టిలో ఉంచుకొని, చాల బాధ్యతతోను జాగ్రత్తగా వ్యవహరించాలి. ఇలా చేయడంద్వారానే ప్రజల ఆశయం సిద్ధించేటట్లు చేయగల్గుతాం.

కార్యకర్తల్ని ఎడ్యుకేట్ చేసే విషయంలో యీమధ్య మనం చాలా కృషిచేశాం. కాని దీనిపట్ల ఎడ తెగకుండా శ్రద్ధవహించవలసిన అవసరం యిప్పటికీ ఉంది. పార్టీ సమా వేశాల్లో సరియైన విమర్శన – ఆత్మవివ [illegible]లు జరపడ

మెలాగో, పనిని సమీక్షచేసుకోవడ మెలాగో; పార్టీ స్కూళ్ళలోను, ట్రైనింగ్ క్లాసులలోను ఎలా మెలగాలో ట్రైమార్గ సంస్కరణను అమలు జరపడ మెలాగో మన కార్యకర్తలు తెలుసుకోవాలి. ముఖ్యంగా సబ్ డిస్ట్రిక్టు కార్యకర్తలకు, గ్రామీణ కార్యకర్తలకు శిక్షణ యివ్వడం చాల ముఖ్యం. కారణ మేమంటే, ప్రజలతో ప్రత్యక్ష సంబంధ మున్నవారు వీరే; పార్టీ విధానాన్ని, పార్టీ నిర్ణయాలను స్వయంగా ప్రజల్లోకి తీసుకువెళ్ళవలసిన వారూ వీరే. మొత్తంమీద, వివిధ నాయకత్వ కమిటీలు కార్యకర్తలను ఎడ్యుకేట్ చేయవలసిన కర్తవ్యాన్ని నిర్లక్ష్యం చేశాయని చెప్పవచ్చు. అందుచేత, వారిని మనం క్రమపద్ధతిలోను, విస్తృతంగాను ఎడ్యుకేట్ చేయవలసియుంది. వారికి సరియైన ప్రజాసాన్నిత్య పంథా, సరియైన పనివిధానం తెలియకపోతే, పార్టీ పాలసీని సరిగా అర్థం చేసుకోకపోతే, పార్టీ విధానాన్ని సంతృప్తికరంగా గ్రామీణ ప్రజల్లో అమలు జరపలేం.

ఈమధ్య వివిధ ప్రజారంగాలలో నాన్‌పార్టీ కార్యకర్తల్ని యిముడ్చుకొని అభివృద్ధి చేయడంలోను, కమ్యూనిస్టు నాన్‌పార్టీ కార్యకర్తల మధ్య ఐక్యత - సహకారం పెంపొందించడంలోను గణనీయమైన అభివృద్ధి జరిగినప్పటికీ, చేయవలసింది ఇంకా ఎంతో ఉంది. మన కార్యకర్తలలో లోపాలింకా ఉన్నాయి. ఉదాహరణకు, వివిధ తరగతులకు చెందిన శక్తివంతులైన నాన్‌పార్టీ వ్యక్తుల్ని ప్రజాసేవలో ఇముడ్చుకొనేందుకు తగినంత శ్రద్ధ చూపడంలేదు. నాన్‌పార్టీ కార్యకర్తలలో పనిచేయడంలోగాని, వారుచేసే పనికి

సహాయం చేయడంలోగాని, తెలివితేటలను ప్రదర్శించడం లేదు. కొంతమంది కామ్రేడ్స్ పనిచేసే పద్ధతుల్లో అతివాద పాక్షిక, నియంతృత్వ, ఒంటెత్తు పోకడల అవశేషాలు ఉన్నాయి.

అందుచేత, కొన్ని ప్రాంతాలలో నాన్ పార్టీ కార్యకర్త లిప్పటికే పేరుకు మాత్రమే అధికారపదవుల్లో ఉన్నారు; స్వతంత్రించి పనిచేసే అధికారం వారికి లేదు ; అందుచేత వారు తమ పనియెడల అసంతృప్తి చెందుతున్నారు.

ఈ సందర్భంలో కమ్యూనిస్టు కార్యకర్తలందరు తమ్ముతాము పరీక్షించుకొని, విజయవంతంగా నాన్‌పార్టీ కార్యకర్తల్ని ఇముడ్చుకొని ఐక్యపరచేందుకు తమ లోపాలను సరిదిద్దుకోవాలి. కమ్యూనిస్టు కార్యకర్తలు నాన్‌పార్టీ కార్యకర్తల చొరవను అధికం చేయడమెలాగో, వారు తమ పనిలో జయప్రదమయేటట్లు చూడ్డమెలాగో తెలుసుకోవాలి. ప్రజలకు సేవచేయడంలో వారు సంపాదించే పలుకుబడిని పటిష్ఠం చేయడ మెలాగో, తద్వారా అనేక సెక్షన్లకు చెందిన ఉత్తములందరినీ ఆకర్షించడ మెలాగో తెలుసుకోవాలి. సిద్ధాంత సమస్యలపై నాన్‌పార్టీ కార్యకర్తల పొరబాట్లను, మనకూ వారికిగల రాజకీయ విభేదాలను పరిష్కరించడంలో ఓపికగా నచ్చచెప్పే పద్ధతిని అనుసరించాలి. ఇలా చేస్తేనే చైనా ప్రజల మహదాశయం సిద్ధిస్తుంది. కమ్యూనిస్టుల స్వార్థ రాహిత్యం, ప్రజలయెడ వారిభక్తి అప్పుడే ద్యోతకమౌతుంది.

ఒక కమ్యూనిస్టు కార్యకర్త నాన్‌పార్టీ కార్యకర్తక్రింద పనిచేసేటప్పుడు ఆదర్శవంతంగా నాయకత్వపు ఆజ్ఞలను పాలిం

బాలి. "తనవిధులను" సక్రమంగా నెరవేర్చాలి. ఈవిషయంలో పొరపాట్లు సవరించుకోవడానికి మొదట తమలో తాము కొన్ని సమావేశాలు జరుపుకొని, తమ పని సమీక్షచేసుకొని, ఆ తరువాత నాన్‌పార్టీ కార్యకర్తల మధ్య ఆత్మవిమర్శన చేసుకోవాలి. వారు పార్టీకార్యకర్తల పనిని విమర్శించేటట్లు ప్రోత్సహించాలి. ఇలా చేస్తే ఉభయపక్షాలు తాము కోరే దేమిటో దాపరికం లేకుండా చెప్పుకో గలుగుతారు. ఒకరిపై ఒకరికుండే చెడుఅభిప్రాయాలు తొలగిపోతాయి. తమ తప్పులను తాము సరిదిద్దుకోగలుగుతారు. ప్రజాసేవ అనే ఉమ్మడి ఆశయంకొరకు ఐక్యత, అన్యోన్యసహకారం పెంపొందుతాయి. ఇట్టి పద్ధతులవల్ల కొన్ని ప్రాంతాలలో చక్కని ఫలితాలు లభించాయి. ప్రతిచోటా ఈ పద్ధతులను ఎడతెగకుండా అవలంబించాలి. కొన్నిప్రాంతాలలో పార్టీసభ్యులకు, నాన్‌పార్టీవారికి మధ్యగల సంబంధాలు పార్టీలోను, బయటా కూడ చర్చకువచ్చాయి. విమర్శన - ఆత్మ విమర్శన జరిగింది. తత్ఫలితంగా వారిమధ్యగల సంబంధాలు ఎంతో చక్కబడ్డాయి. ఇట్టి పద్ధతులనే మనం ప్రభుత్వ కార్యాలయాలలోను, స్కూళ్ళలోను, ఫ్యాక్టరీలలోను, గ్రామాలలోనుకూడ పెద్దయెత్తున అవలంబించాలి. ఐతే ఇందుకు ముందుగా తగు సన్నాహాలు చేసుకోవాలి. చక్కని నాయకత్వంక్రింద ఇవి జరగాలి. అప్పుడే పార్టీ - నాన్‌పార్టీ కార్యకర్తలమధ్య, పార్టీసభ్యుల - నాన్‌పార్టీ ప్రజలమధ్య సంబంధాలు చక్కబడతాయి.

పార్టీ - నాన్‌పార్టీ ప్రజలమధ్య సమైక్యతపై. ప్రతి ప్రభుత్వ కార్యాలయం, సైనికదళం, ప్రజాసంస్థ, ఆర్థికసంస్థ,

విద్యాసంస్థ, పట్టణం, గ్రామం ఆధారపడాలని మొత్తం పార్టీ కంతకూ స్పష్టం చేయాలి. సాధారణంగా మన పార్టీసభ్యులు మైనారిటీగా వుంటారు. ఒక్కొక్కప్పుడు వారు మొత్తం ప్రజల్లో బహుకొద్దిమందే వుంటారు. నాన్‌పార్టీవారు, ప్రజాతంత్రపార్టీల సభ్యులు, మనతో సహకరించే గ్రూపులు కలిసి మెజారిటీగా వుంటారు. ఒక్కొక్కప్పుడు వీరు అత్యధిక మెజారిటీలో వుంటారు. ఈ కార్యాలయాలు, ప్రజాసంస్థలు కమ్యూనిస్టుల గుత్తఆస్తిఅనీ, నాన్‌పార్టీవారికి వాటిలో స్థానం లేదనీ అనుకోవడం చాల తప్పు. అందుచేత ప్రజలకోసం మనం జరిపే వుమ్మడిపోరాటంలో మన పార్టీ మెజారిటీ ప్రజలతో, అత్యధిక మెజారిటీతో చేతులు కలపాలి. మన కామ్రేడ్స్‌చేత ఇట్టి ఐక్యతయొక్క ప్రాముఖ్యతను చక్కగా గుర్తింపచేసినప్పుడే పార్టీ - నాన్‌పార్టీ సెక్షన్లమధ్య ఆరోగ్యకరమైన సంబంధాలను నెలకొల్పగలుగుతాం. పార్టీ కార్యకర్తలకు, ప్రజల కార్యకర్తలకు, పార్టీ బయటవున్న నాయకులకు మధ్య సరియైన సంబంధం ఏర్పరచగలిగినపుడే పార్టీకీ, ప్రజలకూమధ్య సరియైన సంబంధా లుంటాయి.



# 6

# పార్టీయొక్క ప్రాథమిక యూనిట్లు

పార్టీ నిబంధనావళి ప్రకారం, మన పార్టీయొక్క ప్రాథమిక యూనిట్లు వస్తూత్పత్తి ప్రాతిపదికపై, లేదా వృత్తుల ప్రాతిపదికపై ఏర్పడుతాయి. ఇది మన పార్టీ నిర్మాణసూత్రాలలో ఒకటి. అంటే సమాజ నిర్మాణంయొక్క జీవకణాలే మన పార్టీయూనిట్లన్నిటికీ పునాది.

ప్రతి ఫ్యాక్టరీలోను, గనిలోను, గ్రామంలోను, వ్యాపారసంస్థలోను, వీధిలోను, ఆఫీసులోను, స్కూలులోను ఒకే సమైక్య పార్టీయూనిట్ ఉండాలని నిబంధనావళి చెపుతూంది. పార్టీసభ్యు లెంతమంది ఉన్నప్పటికీ (మూడునుంచి కొన్ని వేలవరకు) యూనిట్ మాత్రం ఒకటే వుండాలి. ఇదే ప్రజల్లో పార్టీయొక్క ప్రాథమిక యూనిట్. "ఇదే ప్రజలమధ్య కోట". పార్టీయొక్క ప్రాథమిక యూనిట్‌ను పార్టీశాఖ అని పిలుస్తాం. కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో దాన్ని సాధారణశాఖ అనీ, ఫ్యాక్టరీ కమిటీ అనీ, ఆఫీసు కమిటీ అనీ, స్కూలు కమిటీ అనీ పిలుస్తాం. ఒక పార్టీశాఖలో సభ్యులుగా వున్నవారు పని సౌలభ్యంకొరకు కొన్ని గ్రూపులుగా ఏర్పడవచ్చు. కాని అట్టి పార్టీగ్రూపులు నిర్వహించవలసిన పాత్రకు మరీ ఎక్కువ ప్రాధాన్యత ఈయకూడదు. పార్టీయొక్క కార్యకలాపాలన్నిటినీ

పార్టీ శాఖ ఐక్యపరచి కేంద్రీకృత మొసర్చాలి. అట్టి కేంద్రీకృత కార్యాచరణకు వీలులేనప్పుడుమాత్రమే, వివిధ పార్టీ గ్రూపులు ఆ పనిని వేర్వేరుగా నిర్వహించాలి. ఉదాహరణకు 30 లేక 40 మంది పార్టీసభ్యులున్న ఫ్యాక్టరీ శాఖ, లేదా ఆఫీసు శాఖ, లేదా స్కూలుశాఖ తగినంత ఐక్యతతో పనిచేయగలదు. చర్చలు జరపడానికి, సమస్యలు పరిష్కరించడానికి, గ్రంథాలు అధ్యయనం చేయడానికి ఆ శాఖ కమిటీ సర్వసభ్య సమావేశాలు జరపాలి. అట్టి సమావేశాల తరువాత గ్రూపు సమావేశాలు జరప నవసరం లేదు. ఎప్పటి కప్పుడు ఇలాంటి సర్వసభ్య సమావేశాలు జరుగుతూంటే, గ్రూపులు రెగ్యులరుగా సమావేశం కానక్కరలేదు. అవసరమైనప్పుడుమాత్రమే అవి సమావేశ మవాలి. ఈగ్రూపులను పార్టీయొక్క ప్రాథమిక యూనిట్లుగా పరిగణించకూడదు. పార్టీ శాఖల పాత్రను ఏమాత్రం తగ్గించడానికి వీలులేదు. అలాగే పార్టీ సభ్యుల పనిని స్వయంగా నడపవలసిన నాయకత్వకమిటీకి అంతకన్న పై కమిటీ హోదా ఈయకూడదు. గ్రూపుల రూపంలో వుండే కొన్ని మధ్యాంతర సంస్థలను నిర్మించడం ద్వారా నాయకత్వ కమిటీని మొత్తం పార్టీసభ్యులనుంచి వేరు చేయకూడదు. ఆచరణలో ఇదివరకే గ్రూపులు పార్టీయొక్క ప్రాథమికయూనిట్లుగా పరిగణింపబడ్డాయి. వాటికి బోలెడు పని ఒప్పచెప్పబడింది. అందుచేత పార్టీ కమిటీలు చేయవలసిన పని లేకుండాపోయింది. దీన్ని మనం సవరించుకోవాలి.

జనరల్ పార్టీశాఖగాని, పార్టీ కమిటీగాని ఉన్న ఒక ఫ్యాక్టరీలో లేదా ఆఫీసులో లేదా స్కూల్లో జనరల్ పార్టీ

శాఖక్రింద ఉండే ఉపశాఖలు లేదా పార్టీ కమిటీక్రింద ఉండే శాఖలు ప్రముఖపాత్ర నిర్వహించవచ్చు. పార్టీకమిటీగాని, జనరల్ పార్టీ శాఖగాని తన కేంద్ర నాయకత్వంక్రింద నడపలేని చాల పనిని ఈ ఉపశాఖలకు, శాఖలకు ఒప్పగించవచ్చు. ఉదాహరణకు ఒక కొత్త పార్టీసభ్యుని చేర్చుకోవచ్చునా, కూడదా అనే విషయాన్ని ఒక ఉపశాఖయొక్క సర్వసభ్య సమావేశం నిర్ణయించవచ్చు. అదే విషయాన్ని గురించి ఆలోచించేందుకు తిరిగి జనరల్ పార్టీశాఖ సమావేశం కానక్కరలేదు. ఐతే పార్టీ కమిటీయొక్క ఆమోదాన్ని, సబ్ డిస్ట్రిక్టు కమిటీయొక్క ఆమోదాన్ని పొందడం అవసరం. కాని ఒక ఉత్పత్తికేంద్రంలో లేదా వృత్తికేంద్రంలో జనరల్ పార్టీశాఖ లేదా పార్టీకమిటీ ప్రాథమికయూనిట్ గా ఉంటుంది.

ఒక ఫ్యాక్టరీ కమిటీ లేదా స్కూలు కమిటీ లేదా ఆఫీసు కమిటీ లేదా గ్రామ కమిటీ కొత్త పార్టీసభ్యుల్ని చేర్చుకొనే విషయంలో నిర్ణయాలు చేస్తుంది. దాని అధికారం సబ్ డిస్ట్రిక్టు పార్టీకమిటీ అధికారంతో సమానంగా వుండాలి.

నిబంధనావళిప్రకారం గ్రామసీమల్లో సాధారణంగా పార్టీశాఖ పరిపాలక గ్రామం * యొక్క ప్రాతిపదికపై నిర్మింపబడాలి. కాని స్వాభావిక గ్రామాలే ప్రజలకు కేంద్రాలు. అందుచేత స్వాభావిక గ్రామాలపాత్ర చాలా ఉంటుంది. వాటియెడల మన మెంతో శ్రద్ధచూపాలి. పార్టీయొక్క ప్రాథ

---

* పరిపాలక గ్రామమంటే అర్థం, దాదాపు 20 గ్రామాలతో కూడిన ఒక పరిపాలనా కేంద్రం, ప్రభుత్వ డివిజన్లలో యీ 20 గ్రామాలలో ఒక్కొక్క గ్రామం అన్నిటికన్న క్రిందియూనిట్టు. వీటికి స్వాభావిక గ్రామాలనికూడా పేరు.

మిక యూనిట్లు ప్రధానంగా స్వాభావిక గ్రామాలలో ఏర్పడాలి. అయితే, ఒక్కొక్క స్వాభావిక గ్రామంయొక్క జనాభా కొన్ని స్కోర్ల లగాయతు (స్కోరు అంటే 20) వేల వరకు ఉంటుంది. ఒక్కొక్కప్పుడు అనేక వేలవరకుకూడా ఉండవచ్చు. ఈ విధంగా, పరిపాలక గ్రామాన్ని ఆధారంగాచేసుకొని ఏర్పడే పార్టీ శాఖ క్రింద కొన్ని స్వాభావిక గ్రామాలను ఆధారంగాచేసుకొని ఏర్పడే పార్టీగ్రూపు లుంటాయి. ఈగ్రూపులు చాల ప్రధానమైనవి. ఇవే ప్రాథమిక యూనిట్ల పాత్రను నిర్వహిస్తాయి. ఒక్కొక్క గ్రూపులో ముగ్గురు లగాయతు ఎనిమిదిమందివరకుమాత్రమే సభ్యు లుండాలి. అయినప్పటికీ. ప్రాథమిక యూనిట్‌తో సమానమైన పాత్ర దానికుంటుంది, అట్టి గ్రూపుల ప్రాతిపదికపై సమావేశాలు జరపడం, సమస్యలను పరిష్కరించడం, అధ్యయన తరగతులు నడపడం వగైరా కార్యకలాపాలెన్నో అమలుజరగాలి. అంతేగాని, ప్రతివిషయాన్నీ పార్టీశాఖకు వదలివేయరాదు. పార్టీ నిబంధనావళి ప్రకారం, 50 మందికంటే ఎక్కువ పార్టీసభ్యులు క్యాండిడేట్ సభ్యులు ఉన్న ఒక గ్రామం సాధారణ పార్టీశాఖను ఏర్పరచుకోవచ్చు. దానిక్రింద ఉపశాఖ లుంటాయి. అవి వ్యవసాయ క్షేత్రాలు, ప్రజల నివాసగృహాలు ఉన్నచోట్ల ఉంటాయి. అయితే యిలా ఉండితీరాలని నిర్బంధమేమీలేదు. గ్రామాలు చెల్లాచెదరుగా ఉంటాయనే విషయాన్ని దృష్టిలో ఉంచుకొని యీ నిబంధన తయారుచేయబడింది.

చాల పెద్దదైన స్వాభావిక గ్రామంలో పార్టీశాఖగాని, సాధారణ పార్టీశాఖగాని, ఒక్కొక్కప్పుడు పట్టణ పార్టీకమిటీ

గాని నిర్మింపబడవచ్చు. అట్టి పెద్ద స్వాభావిక గ్రామాల్లో పార్టీ గ్రూపులపాత్ర పెద్దది కాదు. అందుచేత పార్టీగ్రూపుల కార్యకలాపాలకు మనం మరీ ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వకూడదు. పార్టీ శాఖల పనికే ఎక్కువ ప్రాధాన్యత యివ్వాలి.

పార్టీ నిర్మాణసూత్రాల్లో ఒకటి ఉత్పత్తికేంద్రాల ప్రాతిపదికపై, లేదా ప్రజాసమీకరణ కేంద్రాల ప్రాతిపదికపై ప్రాథమిక యూనిట్లను నిర్మించాలనేది. అయితే పార్టీపని సులభంగాను, సత్ఫలితా లిచ్చేదిగాను ఉండాలంటే పార్టీ గ్రూపు కెక్కువ ప్రాధాన్యత యివ్వాలా, పార్టీశాఖకా, ఫ్యాక్టరీ కమిటీకా, పట్టణ కమిటీకా అనే విషయాన్ని స్థానిక పరిస్థితుల్ని బట్టి నిర్ణయించాలి.

ప్రభుత్వ కార్యాలయాల్లో లేదా యితర కార్యాలయాల్లో ఏర్పడే వివిధస్థాయిల పార్టీశాఖలు అదేస్థాయిగల పార్టీకమిటీల ప్రత్యక్ష నాయకత్వంక్రింద ఉండాలి. అట్టి ఆఫీసు శాఖ పార్టీ ఫ్రాక్షన్‌యొక్క స్థాన మలంకరించకూడదు. పార్టీ నిబంధనావళిలో ఉన్నట్లు, అట్టి కార్యాలయాల్లో పార్టీఫ్రాక్షన్లను బాధ్యతాయుత పదవుల్లో ఉన్నవారు నిర్మించాలి. ఎందుచేతంటే, దానితో సమాన హోదాగల పార్టీశాఖకు సాధ్యం కాని కొన్ని ప్రత్యేకపనులు పార్టీ ఫ్రాక్షన్‌వల్ల జరగవలసి యుంటుంది. ఒక పార్టీ ఫ్రాక్షన్ తన కర్తవ్యాలను జయప్రదంగా నిర్వహించడానికి, అవసరమనుకుంటే ఆ సంస్థలో పని చేసే పార్టీశాఖనుకూడా తన ప్రత్యక్ష అజమాయిషీ క్రిందకు తేవచ్చు. ఆ సంస్థకు చెందిన పార్టీసభ్యులందరినీ తనకు సహాయం చేసేవిధంగా సమీకరించవచ్చు.

పార్టీశాఖ ప్రజల్లో పనిచేసే కార్యనిర్వాహణ యూనిట్ ప్రజలకూ, పార్టీ నాయకత్వకమిటీలకూ అనేక వంతెన లాంటిది. అది రెండిటినీ సన్నిహితంగా సమన్వయపరచాలి.

పార్టీ నినాదాలను, పై కమిటీల నిర్ణయాలను అమలు జరిపేందుకు ప్రతి పార్టీశాఖ ప్రజల్లో ప్రచార, ఆందోళన కార్యక్రమాన్ని తీసుకొని పనిచేయాలి. ఎప్పటికప్పుడది ప్రజల కోర్కెలను, మనోవాంఛలను తెలుసుకొంటూ, వాటిని పై కమిటీలకు తెలియపరచాలి. ప్రజల నిత్యజీవితంతో సంబంధ ముంచుకొని, వారి సమస్యలను పరిష్కరించడానికి ప్రజలను సంఘటితపరచాలి. ప్రతి పార్టీశాఖ నిరంతరం ఈ కర్తవ్యాలను ప్రజల్లో నెరవేరుస్తూ, అవి సత్ఫలితా లిచ్చే టట్లు కృషిచేయాలి. ఇలా చేసినప్పుడే, ప్రజలకూ, నాయకత్వ కమిటీలకూ మధ్య సన్నిహిత సంబంధా లేర్పడతాయి.

విముక్తప్రాంతాల్లో ప్రతి ఫ్యాక్టరీలోను, ఆఫీసులోను, స్కూళ్లోను ఉండే పార్టీ శాఖలు ఆ యా సంస్థల ప్లానులు జయప్రదంగా అమలుజరిగేటట్లు చూడ్డానికి, ఆటంకాలను అధిగమించడానికి ప్రజల్ని సమీకరించి సంఘటితపరచాలి.

ప్రతిపార్టీ సభ్యుని చరిత్ర, రాజకీయ దృక్పథం, చైతన్య స్థాయి, సుగుణాలు, లోపాలు ఎలాంటివో పార్టీశాఖ స్పష్ట మైన అభిప్రాయాన్ని కలిగియుండాలి. వాటినిగురించి సరియైన అంచనావేసుకోవాలి. వారి రాజకీయ మనోభావాలను, ధోరణు లనుగురించి తెలుసుకోవడంలో శ్రద్ధచూపుతూ, పార్టీయొక్క రాజకీయ కార్యకలాపాల్లోను, చైనా విప్లవో[illegible]్యమంలోను వారు ఉత్సాహంగా పాల్గొనేటట్లు చూడాలి. ప్రజల్లోగాని,

పార్టీలోగాని దాగియుంటూ, జాతీయ ప్రయోజనాలకు వ్యతిరేకంగా పనిచేసే గూఢచారుల్నీ, విధ్వంసకుల్నీ పట్టుకోడంలో ప్రతి పార్టీశాఖ బాధ్యత వహించాలి. ప్రజల సహాయంతో వారి ఆచోకీ కనిపెట్టాలి.

పార్టీ సభ్యులలో క్రమశిక్షణను అమలుజరపవలసిన బాధ్యత పార్టీశాఖమీద ఉందనికూడా నిబంధనావళి పేర్కొంటూంది.

ప్రతి పార్టీశాఖ తన సభ్యుల్ని ఎడ్యుకేట్ చేయాలనీ, అధ్యయనతరగతులు నడపాలనీ నిబంధనావళి ఆదేశిస్తూంది.

పై కార్యక్రమాన్ని పార్టీశాఖ పై కమిటీ అనుమతితో, దాని సారథ్యంక్రింద అమలు జరపాలి.

బ్రాంచి కమిటీ పార్టీశాఖయొక్క నాయకత్వ సంస్థ. వాస్తవపరిస్థితులకుతగినట్లువివిధరంగాలకార్యకలాపాల్లోపాల్గొనే పార్టీసభ్యులందరూ అందులో ఉండాలి. ఉదాహరణకు, ఒక గ్రామంలో ప్రభుత్వ విధులు నెరవేర్చేవారు, సాయుధదళాల్లో ఉన్నవారు, ఆర్థిక సాంస్కృతికసంస్థలలో పనిచేసేవారు బ్రాంచికమిటీ సభ్యులుగా ఉండాలి. బ్రాంచికమిటీలో వివిధ రంగాలకు చెందిన బాధ్యులున్నప్పుడే యీ కార్యకలాపాలను అది సరిగా నడుపగల్గుతుంది.

మొత్తం పనికంతకూ బ్రాంచికార్యదర్శి బాధ్యత వహించాలని పార్టీ నిబంధనావళిలో ఉంది. ఇతర కమిటీ సభ్యులమధ్య పనివిభజన ఎలా ఉండాలో తెలియజేసే రూల్స్ మాత్రం ఏవీ లేవు. స్థానిక పరిస్థితుల్నిబట్టి ఒక్కొక్క బ్రాంచి కమిటీ యిందుకేర్పాట్లు చేసుకోవాలి. ఒక్కొక్క కమిటీ

సభ్యుడు ఒక్కొక్క పనికి బాధ్యతవహించడం అవసరం. పార్టీశాఖ ఏదైనా పత్రిక నడుపుతూన్నప్పుడు, ప్రచారం సాగిస్తున్నప్పుడు, అధ్యయనతరగతులు నడుపుతూన్నప్పుడు కమిటీసభ్యులలో కొందరు ప్రచార, అధ్యయన శాఖలకు బాధ్యత వహించాలి. ఇలాగే, పరిస్థితుల్నిబట్టి యితరవిధులకు కూడా కొందరిని కేటాయించవచ్చు.

మొత్తం పార్టీశాఖ జయప్రదంగా తన విధులను నిర్వర్తించడానికి బ్రాంచికమిటీ ప్రత్యక్షంగా నాయకత్వం వహించాలి; పరిస్థితుల్నిబట్టి సక్రమంగా పనివిభజన చేసుకోవాలి. అందుచేత ఈ సమస్యపట్ల అందరూ తగినంత శ్రద్ధచూపాలి.



# 7

# ప్రమోషన్లు, క్రమశిక్షణ

మన పార్టీ చాలకాలంనుంచీ దేశవ్యాపితమై సువిశాల ప్రజాస్వభావంగల సంస్థగా ఉంటోంది. ఇది నేడు మరింత స్పష్టంగా మనకు కనిపిస్తోంది. పార్టీలో శిక్షణారాహిత్యంగాని, అనైక్యతగాని, చీలికలుగాని ఉన్నట్లయితే, చైనా ప్రజల విమోచనోద్యమాని కది తీవ్రహాని కలిగిస్తుంది. అందుచేత, పార్టీసభ్యులందరూ, పార్టీయూనిట్లన్నీ పార్టీ ఐక్యతను కాపాడాలి; దాన్ని బలీయ మొనర్చాలి. పార్టీ వ్యతిరేక విచ్ఛిన్నక చర్యలను, సర్వస్వతంత్ర చర్యలను, ముఠాలుకట్టే కార్యక్రమాలను, రెండునాలుకల ధోరణిని తీవ్రంగా ఎదుర్కోవాలి. శిక్షణారాహిత్యాన్నికూడా ప్రతిఘటించాలి. మరో విధంగా చెప్పాలంటే, పార్టీలో తాత్కాలికంగా సిద్ధాంత సమస్యలపైగాని, పాలసీవిషయమైగాని భేదాభిప్రాయా లెన్ని ఉన్నప్పటికీ క్రమశిక్షణను పాటించాలి. పార్టీ ఐక్యతను కాపాడాలి. అట్టి ఐక్యతకు హానికలిగించే పనులను, చీలికలు తెచ్చే పనులను, ముఠాలుకట్టేపద్ధతిని, సర్వస్వతంత్రచర్యలను, కపటవేషాలను సహించకూడదు. పార్టీ ఐక్యత అనే మహోన్నత సిద్ధాంతాన్ని ఖచ్చితంగా అమలుజరపాలి. సిద్ధాంత సమస్యలపైగాని, పాలసీవిషయమైగాని తాత్కాలికంగా

వచ్చే భేదాభిప్రాయాలను సాకుగాతీసుకొని క్రమశిక్షణను ఉల్లంఘించేవారి అభిప్రాయాలను పార్టీ సభ్యులుగాని, పార్టీ యూనిట్లుగాని వెల్లడించకూడదు.

మనది సువిశాల ప్రజాస్వభావంగల పార్టీ గనుక, పార్టీలో మార్గదర్శకమైన కార్యవిధానాలను, ఉత్తమ ప్రమాణాలను ప్రవేశపెట్టడ మెంతో అవసరం. అందుచేత, చక్కగా పనిచేయడంలో ఉత్తమ చరిత్రగల పార్టీసభ్యుల్ని ప్రమోట్ చేయవలసిందని నిబంధనావళి చెబుతూంది. పార్టీ ఆశయంపట్ల-ప్రజల ఆశయంపట్ల - సంపూర్ణ విశ్వాసాన్ని ప్రదర్శించిన పార్టీసభ్యుల్ని, లేదా పార్టీ యూనిట్లను ప్రమోట్ చేయడం అవసరం. బాగా పనిచేయడంద్వారా, లేక శత్రువుయొక్క న్యాయస్థానాల్లో ధైర్యంగా మెలగడంద్వారా, లేక శత్రువుతో పోరుసల్పడంద్వారా, లేక పార్టీ ఆంతరంగిక పోరాటాల్లో సరియైన మార్గ మవలంబించడంద్వారా వారట్టి విశ్వాసాన్ని ప్రదర్శించియుండాలి. లేదా పార్టీ శిక్షణను, విప్లవ ప్రభుత్వ శిక్షణను ఆదర్శప్రాయంగా వారు పాటించియుండాలి. లేదా పార్టీ కార్యక్రమాన్ని, పార్టీ నిర్ణయాలను అమలుజరపడంలో ప్రత్యేకమైన చొరవను ప్రదర్శించియుండాలి. లేదా పార్టీ విధులను అత్యంత జయప్రదంగా నెరవేర్చి, తత్ఫలితంగా ప్రజల హృదయపూర్వక మన్ననలు పొందియుండాలి. అట్టి వ్యక్తిని ప్రమోట్ చేస్తున్నట్లు అతనితో చెప్పవచ్చు. లేదా బహిరంగ ప్రకటన చేయవచ్చు. లేదా అతని జీవిత చరిత్రను, అనుభవాల్ని తెలియజేస్తూ పత్రికల్లోను, కరపత్రాల్లోను వ్యాసాలు ప్రకటించవచ్చు. ఇతర పద్ధతులుకూడా అవలంబించవచ్చు.

కేంద్రకమిటీ నిర్ణయాలనుగాని, యితర పై కమిటీల నిర్ణయాలనుగాని అమలు జరపనివారిమీద, పార్టీ నిబంధనావళిని, లేదా పార్టీ శిక్షణను ఉల్లంఘించినవారిమీద చర్య తీసుకోవాలని నిబంధనావళిలో ఉంది. మొత్తం పార్టీయూనిట్ మీద చర్య తీసుకోవలసివస్తే, ఆ యూనిట్‌ని కఠినంగా మందలించవచ్చు. దానినాయకత్వకమిటీని పునర్నిర్మించవచ్చు. ఆకమిటీని బర్తరఫ్ చేసి, దాని స్థానంలో ఒక తాత్కాలిక కమిటీని నియమించవచ్చు. మొత్తం యూనిట్‌నే రద్దుచేసి, తిరిగి పార్టీ సభ్యుల్ని రిజిస్టర్ చేసుకోవచ్చు. మొత్తం పార్టీ యూనిట్, లేదా దాని నాయకత్వకమిటీ పార్టీ శిక్షణను ఉల్లంఘించినప్పుడే, లేదా యితర తీవ్ర నేరాలు చేసినప్పుడే పై చర్యలు తీసుకోవాలి.

ఒక పార్టీసభ్యునిపై శిక్షణ చర్య తీసుకోవలసి వచ్చినప్పుడు అతన్ని ప్రైవేట్‌గా మందలించవచ్చు, లేదా హెచ్చరించవచ్చు. లేదా బహిరంగంగా మందలించవచ్చు, హెచ్చరించవచ్చు. అతని కిచ్చిన పనినుంచి అతన్ని తొలగించవచ్చు. లేదా కొంతకాలంవరకు తాత్కాలిక సభ్యునిగా పరిగణించవచ్చు. లేదా పార్టీనుంచి పూర్తిగా తొలగించవచ్చు.

మనపార్టీ కేవలం శిక్షణచర్యలు తీసుకోవడమేగాక, ప్రమోషన్లుకూడా చేయడం కొత్తనిబంధనావళియొక్క ప్రత్యేక లక్షణాలలో ఒకటి.

పార్టీ తీసుకొనే శిక్షణచర్యలన్నిటిలోనూ పార్టీనుంచి వెళ్ళగొట్టడం అన్నిటికన్న కఠినమైనది. అట్టి చర్య తీసుకోవడంలో అన్నిస్థాయిల పార్టీ యూనిట్లు అత్యంత జాగ్రత్తతో

వ్యవహరించాలి. పార్టీలోపల తీసుకునే శిక్షణచర్య, బయట తీసుకునే శిక్షణచర్య ఒకటేనని భ్రమపడకూడదు. పార్టీనుంచి వెళ్ళగొట్టడం అన్నిటికన్న తీవ్రమైన చర్య; అంతకుమించి పార్టీ ఏమీ చేయలేదు. ఒక పార్టీసభ్యుడు ప్రభుత్వచట్టాలను ఉల్లంఘిస్తే, అతన్ని న్యాయాధికారులు విచారించి తగు తీర్పు ఇవ్వాలి. పార్టీతీసుకునే శిక్షణచర్యవల్ల ఏ వ్యక్తీ కోర్టుచర్యలలోగాని, పరిపాలనా చర్యలలోగాని యిరుక్కోకూడదు. అట్టి చర్యలు తీసుకోవలసింది ప్రభుత్వమే.

ఒక పార్టీసభ్యునిపై పార్టీయూనిట్ చర్య తీసుకోడానికి నిర్ణయించుకున్నప్పుడు, ఆ సభ్యుడు తన్నుతాను డిఫెండ్ చేసుకోడానికి స్వయంగా సమావేశానికి హాజరయేట్లు చూడ్డానికి అన్ని ప్రయత్నాలుచేయాలి. ప్రత్యేక పరిస్థితుల్లో మాత్రమే అతను లేకుండా నిర్ణయాలు తీసుకోవచ్చు. శిక్షణ చర్యకు కారణాలేమిటో ఆ సభ్యునికి తెలియజేయాలి. పార్టీ నిర్ణయానికి అతడు ఆక్షేపణ తెలిపితే, పునరాలోచించమని, నిర్ణయాన్ని మార్చుకోవలసిందని కోరవచ్చు. అప్పుడు అతని అభ్యర్థనను పార్టీయూనిట్ జాగ్రత్తగా ఆలోచించి, పునః పరిశీలన చేయాలి. అతడు తన కేసును పై కమిటీదృష్టికి తేదలచుకుంటే, అందుకు పార్టీయూనిట్ సహాయంచేయాలి. అంతేగాని, అతని అప్పీలును అణచిపెట్టకూడదు.

పార్టీ నిర్ణయాలను అమలుజరపని పార్టీ సభ్యుని మీద పార్టీ నిబంధనావళిని ఉల్లంఘించే వానిమీద, పార్టీ శిక్షణను భగ్నంచేసే వానిమీద శిక్షణచర్య తీసుకోవలసి యుంటుంది. అట్టి వారిమీద శిక్షణచర్య తీసుకోడానికి అన్ని స్థాయిల పార్టీ

యూనిట్లకు పూర్తి అధికారం ఉంది. అయితే, ఒక్కొక్క కేసుయొక్క ప్రత్యేక పరిస్థితుల్ని బట్టి పార్టీ యూనిట్లు అట్టి వారి నేరాలను పరిశీలించి తగు నిర్ణయాలు చేయాలి. ఉదాహరణకు, కొందరు నేరస్తులు పార్టీ నిబంధనావళినిగాని, పార్టీ శిక్షణనుగాని పూర్తిగా అర్థం చేసుకొని యుండకపోవచ్చు; లేదా పార్టీ నిర్ణయాలనుగాని, పాలసీనిగాని అవగాహన చేసుకొని యుండకపోవచ్చు. మరికొందరు బుద్ధిపూర్వకంగానే నేరం చేసినవారై యుండవచ్చు. కొన్ని నేరాలు కేవలం వ్యక్తిగత జీవితానికి సంబంధించినవై యుంటాయి. అవి పార్టీ నిబంధనావళికిగాని, శిక్షణకుగాని, పాలసీకిగాని, నిర్ణయాలకుగాని ప్రత్యక్షంగా వ్యతిరేకమైనవి కాకపోవచ్చు. మరికొందరి చర్యలు ప్రత్యక్షంగా వ్యతిరేకమైనవి కావచ్చు. కొందరు నేరస్తులు, తమ్ము యితరులు విమర్శించిన తర్వాత, లేదా తాము విషయాలు తెలుసుకున్నతర్వాత తమ తప్పులను త్రికరణశుద్ధిగా దిద్దుకోవచ్చు. మరికొందరు అలాంటి ప్రయత్నాలెన్ని జరిగినా తప్పులు చేస్తూనేఉండవచ్చు. అందుచేత అన్ని స్థాయిల పార్టీయూనిట్లు వేర్వేరు పరిస్థితుల్లో, వేర్వేరు నిర్ణయాలు చేయవలసి యుంటుంది. మొదటితరగతి నేరస్తుల్ని రెండవ తరగతివారి కన్న ఉదారంగాను, రెండవ తరగతి నేరస్తుల్ని మొదటితరగతి వారికన్న కఠినంగాను చూడాలి.

నేరస్తుడు ఆచరణలో తన తప్పు దిద్దుకున్నప్పుడు, లేదా పార్టీ అతనిమీద పొరపాటున చర్యతీసుకున్నట్లు తెలుసుకున్నాక, లేదా ఆ నిర్ణయం వాస్తవ పరిస్థితులమీద ఆధారపడకుండా తీసుకున్నట్లు రుజువైనప్పుడు – ఆ చర్యను రద్దుచేసుకోవాలి.

పార్టీ నిబంధనావళి ప్రకారం కంట్రోల్ కమిషన్ల విధులు యివి: పార్టీసభ్యులమీద శిక్షణ చర్యలు తీసుకోడం, లేదా వాటిని రద్దుచేయడం, పార్టీసభ్యులు చేసే ఫిర్యాదుల్ని పరిష్కరించడం. కేంద్రకమిటీ అవసరమనుకున్నప్పుడు సాధ్యమనుకున్నప్పుడు కంట్రోల్ కమిషన్లు నిర్మింపబడాలి. వాటినిర్మాణానికి, పనికి సంబంధించిన నిబంధనల్నేగాక, శిక్షణను అమలు జరిపేందుకు అన్నిస్థాయిల పార్టీయూనిట్లు అనుసరించవలసిన కార్యక్రమాన్ని కూడా కేంద్రకమిటీయే తయారుచేస్తుంది.

ఒక పార్టీసభ్యుణ్ణి ప్రమోట్ చేయడంలో ముఖ్యోద్దేశం పార్టీసభ్యులందరినీ, ప్రజలందరినీ, ఆ కామ్రేడ్‌నీ ఎడ్యుకేట్ చేయడమని నిబంధనావళి చెబుతోంది. పార్టీలో ఆదర్శవంతమైన కార్యవిధానాలను ప్రవేశపెట్టడం, యితర సభ్యులుచూచి నేర్చుకోవలసిన ప్రమాణాలను ఎత్తిచూపడం – యిదీ దాని ఉద్దేశం. అంతేగాని, పార్టీలో వ్యక్తిగత అహంభావాన్ని ప్రోత్సహించేవిధంగా ప్రమోషన్లు ఉండకూడదు. గతంలో కార్మికయోధుల్నీ, ఆదర్శ కార్మికుల్నీ ఎంచేటప్పుడు, విస్తృత పోటీలు, ప్రచారాలు జరిగేవి. అవి ఒక్కొక్కప్పుడు అహంభావానికి దారితీసేవి; వాటివల్ల కొందరిలో తలపొగరు బయల్దేరేది; బహుమతులమీదనే కొందరు తమ దృష్టిని లగ్నం చేసేవారు; పేరుప్రతిష్ఠలకోసం ఉబలాటపడేవారు. ఇట్టి లక్షణాలు మంచివికావు. ఇకముందు అలాంటివి బయల్దేరకుండా జాగ్రత్తవహించాలి.

ఒక పార్టీసభ్యునికి శిక్షణ అలవరచడంలో, పార్టీసభ్యులందరినీ, ప్రజలందరినీ, ఆ కామ్రేడ్‌నీ ఎడ్యుకేట్ చేయడం

కూడా ప్రధానోద్దేశమని పార్టీ నిబంధనావళి చెబుతోంది. ఇతరుల కదొక హెచ్చరికగా ఉద్దేశింపబడింది. అలాంటి గోతిలో యెవరూ పడవద్దని చెప్పడమే దాని ఉద్దేశం. శిక్షలు విధించే తత్వంతోగాక వ్యాధిని నిర్మూలించడానికి, రోగిని కాపాడ్డానికి శిక్షణచర్య అవసరమనేతత్వంతో వ్యవహరించాలి. గతంలో కొన్ని పార్టీ యూనిట్లు శిక్షణయొక్క నిర్మాణ స్వభావానికిమాత్రమే ఎక్కువ ప్రాధాన్యత యిచ్చి, సిద్ధాంత - రాజకీయ పరిజ్ఞానాన్ని నిర్లక్ష్యం చేశాయి. అలాంటి పరిజ్ఞానం పొరబాటుచేసిన కామ్రేడ్స్‌ని సిద్ధాంత - రాజకీయ దృష్టినుంచి సరిదిద్దడానికి సహాయంచేస్తుంది. కాని యీ విషయంలో జరిగిన నిర్లక్ష్యంవల్ల, యీ కామ్రేడ్స్ తమపై శిక్షణ అమలుజరిగినప్పటికీ తమ పొరబాట్లను ఆమూలాగ్రంగా తెలుసుకోలేకపోయారు; అందుచేత వాటిని సరిదిద్దుకోలేకపోయారు. ఇకముందు యిలాంటి పొరబాట్లు జరక్కుండా జాగ్రత్తపడాలి.



# 8

# పార్టీలో కాఠిన్యం, సరళత్వం

కామ్రేడ్ మావ్ సే-టుంగ్ తన రాజకీయ రిపోర్టులో, మన పార్టీకీ యితరపార్టీలకూ గల వ్యత్యాసాన్ని తెలియజేశాడు. ఇది చాల ముఖ్యమైన విషయం. సిద్ధాంత విషయాల్లో ఖచ్చితంగా మెలగే పార్టీ, యితర పార్టీలన్నిటితో భేదించే మార్క్సిస్టు - లెనినిస్టుపార్టీ లేకుండా, 47½ కోట్ల చైనా ప్రజలు సాగించే బ్రహ్మాండమైన విప్లవాన్ని విజయవంత మొనర్చడం ఊహించ శక్యంకాని విషయం. చైనా ప్రజలు జపాన్ దురాక్రమణదారుల్ని ఓడించి నవచైనాను నిర్మించడానికి సిద్ధంగా ఉన్నారు. విజయసాధనకై మన పార్టీ జరిపే పోరాటంలో విప్లవవర్గాలన్నిటితోను, ప్రజాస్వామ్య పక్షాలన్నిటితోను చేతులుకలపాలి. అదే సమయంలో తన్ను తాను బలపరచుకోవాలి; సిద్ధాంత, రాజకీయ, నిర్మాణ విషయాల్లో కఠినంగా ఉంటూ, యితరపార్టీలకూ తనకూ గల వ్యత్యాసాన్ని నిరూపిచుకోవాలి. అలా చేసినప్పుడే, అది తన స్వాతంత్ర్యాన్ని, వ్యక్తిత్వాన్ని కాపాడుకోగల్గుతుంది; యితరులు కూడా ప్రజలకు నాయకత్వంవహించేలా వారిని ఉచ్ఛస్థాయికి తీసుకెళ్ళడంలో తోడ్పడగల్గుతుంది.

మన పార్టీ కార్మికవర్గంయొక్క మార్క్సిస్టు అగ్రగామి దళం. దాని ప్రపంచదృక్పథం, ఆలోచనా పద్ధతి - అంటే గతితార్కిక భౌతికవాదం, చారిత్రక భౌతికవాదం - యితర వర్గాల ప్రపంచ దృక్పథం, ఆలోచనా పద్ధతితో భేదిస్తాయి.

ప్రస్తుత చైనా విప్లవంలో మన పార్టీ కార్మిక వర్గంలోని విప్లవ ప్రజాస్వామ్య వాదులకు ప్రాతినిధ్యం వహిస్తోంది. వీరు పెద్ద భూస్వాములు, పెద్ద పెట్టుబడిదార్లు, ఉదార పెట్టుబడిదార్లతో మాత్రమే కాక, పెటీబూర్జువా వర్గంలోని విప్లవ ప్రజాస్వామ్యవాదులతో కూడ భేదిస్తారు. ఎందుచేతంటే, వారి విప్లవసిద్ధాంతం, విప్లవపద్ధతులు, విప్లవలక్ష్యం శ్రామిక వర్గ విప్లవ సిద్ధాంతం, విప్లవపద్ధతులు, విప్లవలక్ష్యంతో పూర్తిగా భేదిస్తాయి. పెటీబూర్జువా వర్గం తన సహజలక్షణమైన ఊగిసలాటవల్ల, అనైక్యతవల్ల, మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంత మనే ఆయుధం లేకపోవడంవల్ల- శత్రువు లెవరో, మిత్రులెవరో తెలుసుకోలేక తరచు చిక్కుపరిస్థితుల్లో యిరుక్కొంటుంది. శత్రువు నోడించడాని కవసరమైన విప్లవ శక్తుల్ని సంఘటిత పరచడం గాని, ప్రజల విప్లవపోరాటాలను సక్రమంగా నడపడం గాని దీనికి చేతగాదు. నేటి ప్రజాస్వామ్య విప్లవంలో మన పార్టీకి, పెటీబూర్జువా విప్లవ ప్రజాస్వామ్యవాదులకు గల రాజకీయ వ్యత్యాసం యిదే.

నిర్మాణం విషయంలో కూడ మన పార్టీకీ ఇతర వర్గాలకూ మధ్య చాల వ్యత్యాసం వుంది. కఠినమైన శిక్షణ, ప్రజా సాన్నిహిత్య పంథా, ఆత్మ విమర్శన ఇవి మన పార్టీయొక్క ప్రత్యేక లక్షణాలు. వీటన్నిటి ఉద్దేశం ప్రజలకు సేవచేయడం.

సిద్ధాంత, రాజకీయ, నిర్మాణరంగాలలో మనం ఇతర వర్గాలకు లేని విశిష్టతను కలిగియున్నప్పుడే కార్మిక వర్గానికి అగ్రదళంగా మనం అభివృద్ధి చెందగలం; ఇతరులతో సక్రమంగా కలిసి పనిచేయగలం; ముందడుగు వేసేటప్పుడు వారికి తోడ్పడగలం.

దాని అర్థం, ఇతరులతో ఏకాభిప్రాయానికి వచ్చేటప్పుడు మొట్టమొదట మనం వారితో ఎక్కడ ఏకీభవిస్తామో ఎక్కడ బేధిస్తామో చక్కగా గ్రహించాలి. భేదాలేవో తెలుసుకోకుండా సరియైన ఒప్పందానికి రాలేము. భేదాలు గుర్తించకుండా ఒప్పందాలకు వస్తే, ఎదుటివారికి తప్పక లొంగిపోవలసి వస్తుంది.

మనం గుర్తించే విభేదాలు సంకుచితమైన పాక్షిక విభేదాలు కావు. అవి మార్క్సిస్టు సూత్రాలపై ఆధారపడి వుంటాయి. అన్ని ప్రజాస్వామ్య వర్గాలను, గ్రూపులను మనం సమీకరించాలంటే, ఈ వ్యత్యాసాలను గుర్తించడం చాల అవసరం.

కార్మికవర్గంయొక్క అగ్రదళంఇతరవర్గాలతో మాత్రమే గాక,తనవర్గానికిచెందినప్రజాబాహుళ్యంతోకూడ భేదించవలసిన అవసరముంది. మారోవిధంగా చెప్పాలంటే, మనపార్టీ సభ్యులకూ (అంటే కార్మికవర్గంయుక్క అగ్రదళానికీ) సమ్మెచేసే సాధారణ కార్మికులకూ మధ్య, లేదా శిస్తురేట్లు – వడ్డీరేట్లు తగ్గాలని డిమాండుచేసే సాధారణరైతులకూ మధ్యగల తేడాను గమనించాలన్నమాట. పార్టీకి, కార్మిక సంఘాలకు మధ్యగల భేదాన్ని మనం చూడాలి. పార్టీ ఆంతరంగిక జీవితానికి కూడా

యిది వర్తిస్తుంది. అవకాశవాదం, శ్రామికేతర భావాలు పార్టీలో తలయెత్తినప్పుడు, ఏవి సరియైనవో ఏవి కావో పార్టీ సభ్యులు విచక్షణాదృష్టితో తెలుసుకోవాలి; వాటికీ తమకూ మధ్య వ్యత్యాసాన్ని గుర్తించాలి. మనపార్టీసభ్యులు సిద్ధాంత, రాజకీయ, నిర్మాణ విషయాల్లో యితర వర్గాల ధోరణుల నుంచి, ముఖ్యంగా పెటీ బూర్జువా విప్లవకారుల సిద్ధాంతాల నుంచి, వేరుపడగలిగినప్పుడే, శ్రామికవర్గానికి చైతన్యవంతులైన అగ్రదళంగా వారు తయారు కాగలుగుతారు. అప్పుడే వారు యితరుల్ని సంస్కరించగల్గుతారు; యితరులు ముందడుగు వేయడంలో సహాయపడగల్గుతారు.

సిద్ధాంత సమస్యలపై పార్టీలో కాఠిన్యం అంటే అర్థమిదే.

మన పార్టీ మొదటినుంచీ కఠినమైన పార్టీయే. అందుకనే, అది చైనావిప్లవంలో తన కర్తవ్యాలను సరిగా నిర్వర్తించ గల్గింది; ప్రస్తుత దశలో మనపార్టీమీద మరింత గురుతరమైన బాధ్యతలు పడ్డాయి. పూర్వంకంటే యెక్కువ కఠినమైన, క్లిష్టమైన విప్లవ కర్తవ్యాలను మనం నెరవేర్చవలసియుంది. ఇట్టి పరిస్థితుల్లో మనం పూర్వంకంటే యెక్కువ కఠినంగా ఉండాలి. పార్టీయొక్క నూతన నిబంధనావళిలో అట్టి కాఠిన్యం మనకు కనిపిస్తుంది. మన పార్టీయొక్క తక్షణ కర్తవ్యాలను, ప్రస్తుత పరిస్థితులను దృష్టిలో ఉంచుకొంటే, యిట్టి కాఠిన్యం ఎంత అవసరమో తెలుస్తుంది.

సిద్ధాంత విషయాల్లో మనపార్టీ చాల కఠినంగా ఉంటూనే, ఆ సిద్ధాంతాలను నిర్దిష్ట కర్తవ్యాలకు వర్తింప

జేయడంలో అది ఎక్కువ సరళత్వాన్ని ప్రదర్శించవలసి యుంటుంది. కార్మికవర్గంయొక్క అగ్రదళం సరళత్వాన్ని ప్రదర్శించవలసిన అవసరం ఏమంటే, అది తన వర్గంయొక్క ప్రజలతోను, కష్టజీవులందరితోను అత్యంత సన్నిహితమైన సంబంధా లుంచుకోవాలి; విప్లవవర్గాలన్నిటితోను, విప్లవపార్టీ లన్నిటితోను, విప్లవగ్రూపు లన్నిటితోను అది ఐక్యతను సాధించవలసివుంది; ప్రజాబాహుళ్యంతోను తనతో కలసివచ్చే మిత్రులతోను కలిసి అది విప్లవ కార్యాచరణలో ముందుకు నడవవలసియుంటుంది. అలా ముందుకు నడవడానికి అది తన మిత్రులకు, అనుచరులకు ఖచ్చితమైన, సహాయకరమైన సౌకర్యాలు ఎలా కలిగించాలో దానికి తెలియాలి; కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో వారితో రాజీలు చేసుకోవడం నేర్చుకోవాలి; ముందుకుగాని వెనక్కుగాని వెళ్ళకుండా, ఉన్నచోటనే కొంతకాలం నిలబడ్డ మెలాగో తెలుసుకోవాలి; విప్లవం అనే ఓడను నడిపేటప్పుడు రాళ్ళులేని ప్రదేశాల్లో సరిగా చుక్కాని నడపడం, ప్రజల పాక్షిక ప్రయోజనాలతో ప్రధాన ప్రయోజనాలను సమన్వయపరచడం ఎలాగో తెలుసుకోవాలి? వివిధ పోరాటరూపాలను, నిర్మాణ పద్ధతులను చక్కగా సమన్వయం చేసుకోవాలి. సిద్ధాంత విషయాల్లో కాఠిన్యమంటే అర్థం తలబిరుసుతనం, పాక్షికతత్వం కాదు. ఇట్టి మార్గం అనుసరించడంద్వారానే మనం ఇతరులకు నాయకత్వం వహించగలుగుతాం; ముందడుగు వేసేటట్లు వారికి సహాయపడగలుగుతాం; ప్రజల విముక్తిని సాధించగలుగుతాం.

అంటే మనం తప్పక ఒప్పందాలు కుదుర్చుకోవాలన్న మాట. ఒప్పందాలకు ప్రయత్నించకుండా విభేదాలు మాత్రమే చూడ్డంవల్ల సెక్టేరియన్ పెడమార్గంలో తప్పక పడతాము.

మన సరళత్వం నిర్దిష్టమైన సిద్ధాంతాలపై ఆధారపడి యుంటుంది. సిద్ధాంతం లేని సరళత్వం తప్పు; సిద్ధాంతాల్ని అతిక్రమించి రాజీలు చేసుకోవడం, సౌకర్యాలియ్యడం పొరపాటు. మన సిద్ధాంతాలు అస్పష్టంగాను, గందరగోళ పెట్టేవిగాను ఉండకూడదు. పాలసీలోగాని, ఎత్తుగడల్లోగాని మనం చేసే మార్పులన్నిటికీ సిద్ధాంతం గీటురాయిగా ఉండాలి. పార్టీ సిద్ధాంతం పార్టీయొక్క సరళత్వానికి గీటురాయి. ఉదాహరణకు అత్యధిక సంఖ్యాకుల అత్యధిక శ్రేయస్సుకై పోరాడ్డం మన మూలసూత్రాలలో ఒకటి. ఈ సిద్ధాంత మెన్నటికీ మార్పు చెందదు. ఈ మార్పు చెందని సిద్ధాంతాన్ని బట్టే మన పాలసీలోగాని, ఎత్తుగడల్లోగాని వచ్చే మార్పులు సరియైనవో కావో తెలుసుకోవాలి. ఈ సూత్రాని కనుగుణ్యమైన మార్పులన్నీ సవ్యమైనవి; విరుద్ధమైనవన్నీ అపసవ్యమైనవి. ఇతరులతో రాజీపడేటప్పుడు మనం మన సిద్ధాంతాలను ఒదులుకోకూడదు. సిద్ధాంత సమస్యలపై దిగజారకూడదు. దీని అర్థం ఖచ్చితమైన సిద్ధాంతాలకు మనం కట్టుబడి యుండాలి; ఇతరుల్ని క్రమక్రమంగా మనసిద్ధాంతాల స్థాయికితీసుకురావాలన్న మాట; ప్రజలయొక్క, మనమిత్రులయొక్క చైతన్యాన్ని ప్రస్తుత దశనుంచి కమ్యూనిస్టు పార్టీయొక్క కార్యక్రమాన్ని అర్థంచేసుకునేస్థాయికి అభివృద్ధి చేయాలన్న మాట. మరోవిధంగా చెప్పాలంటే, ఇతరులతో మనం చేసుకునే ఒప్పందాల ఉద్దేశం ఇత

న్ని ఉచ్ఛస్థాయికి తీసుకురావడం; అంతేకాని మన ఆశయాలను దిగజార్చుకోవడం కాదు.

అనగా, సరళత్వం, సిద్ధాంత విషయాల్లో కాఠిన్యం రెండూ చక్కగా సమన్వయింప బడాలి.

ప్రస్తుతం మనపార్టీ జపాన్ వ్యతిరేక యుద్ధంలో ప్రజా విజయానికి దగ్గరలో వుంది; జాతీయ పునర్నిర్మాణ దశ ప్రారంభం కాబోతోంది. అందుచేత పార్టీసభ్యులందరూ విజయంకోసం అత్యంత దృఢసంకల్పంతోను ధైర్యంతోను పోరాటంతో బాటు, మన పనికి సంబంధించిన అన్ని రంగాలలోను మార్పు, అభివృద్ధి తీసుకురావడానికి సన్నాహాలు చేయడంలో ఎంతో కుశాగ్రబుద్ధిని స్పష్టమైన మనోనిశ్చయాన్ని ప్రదర్శించవలసి యుంటుంది. ఇలా ప్రదర్శిస్తేనే మనం చైతన్యంతోను, స్వంత చొరవతోను ఈ మార్పును, అభివృద్ధిని సాధించగలుగుతాం. ఈ పరిస్థితి అంతా నూతన నిబంధనావళిలో దృష్టిలోకి తీసుకోబడింది. అందులో సిద్ధాంత సమస్యలపై కాఠిన్యం అవసరమని నొక్కిచెప్పడంతో బాటు, క్రియారంగంలోను కార్యకలాపాల్లోను సరళత్వాన్నికూడ దృష్టిలోకి తీసుకొంది. ప్రస్తుత పరిస్థితుల్ని మాత్రమేగాక ముందు ముందు మనపార్టీ ఎదుర్కోవలసిన కొత్తపరిస్థితుల్ని కూడ దృష్టిలో ఉంచుకోవడంవల్లనే ఇది సాధ్యమైంది. నూతన నిబంధనావళిని ప్రస్తుత పరిస్థితుల్లోనేగాక, జపాను దురాక్రమణదారుల్ని ఓడించిన తరువాత, నూతన ప్రజాస్వామ్య ప్రభుత్వం నిర్మింపబడే దశలోకూడ అమలు జరపవచ్చు. అలా అమలు జరపడం మన విద్యుక్తధర్మం.

మనపార్టీముందు నేడొక గొప్ప భవిష్యత్తు కనిపిస్తోంది. అది నిర్వర్తించవలసిన విధులు కఠినమైనవి, క్లిష్టమైనవి. మొత్తం పార్టీఅంతా కామ్రేడ్ మావ్ చూపిన రాజకీయ నిర్మాణపంథాను అవలంబించ వలసియుంది. ఈ మహాసభ ఆమోదించిన నూతన నిబంధనావళిని ఆధారంగా చేసుకోవాలి. తన సభ్యులమధ్య శీఘ్రంగాను, ఖచ్చితంగాను ఐక్యతతీసుకు రావాలి. తన నిర్మాణ పనిముట్లన్నిటినీ పదును పెట్టుకోవాలి. ఇలాచేసిననాడు మనపార్టీ ఎట్టి సంశయాలు లేకుండా అత్యధిక సంఖ్యాకులైన ప్రజలకు నాయకత్వం వహించగలుగుతుంది. అన్ని కష్టాలను అధిగమించగలుగుతుంది. మనదేశ చరిత్రలో కని విని ఎరుగని అద్భుత విజయాన్ని సాధించ గలుగుతుంది.

ఈ పార్టీ మహాసభ ఆమోదించిన నిబంధనావళి తప్పక చైనా ప్రజల విజయాన్ని, చైనాజాతి విముక్తిని గ్యారంటీ చేయగల్గుతుంది.

జపాను దురాక్రమణదారులు నశించాలి !

స్వతంత్ర, ప్రజాతంత్ర, సమైక్య, సుభిక్ష నవచైనా వర్ధిల్లాలి!

చైనాజాతి, చైనా ప్రజలు, విముక్తి చెందాలి !

మన పార్టీనాయకుడు, చైనా ప్రజల విప్లవ పోరాటాలకు సారథి అయిన కామ్రేడ్ మావ్ చిరస్థాయి అగుగాక !



187

# పార్టీ కార్యక్రమం

[1945 లో అఖిల చైనా కమ్యూనిస్టు పార్టీ సప్తమ మహాసభలో ఆమోదింప బడింది.]

చైనా దేశ కమ్యూనిస్టు పార్టీ చైనా కార్మిక వర్గంయొక్క సంఘటిత అగ్రదళం; కార్మికుల వర్గ సంస్థలన్నిటికన్న అదే మహోన్నతమైన రూపం. చైనా ప్రజల ప్రయోజనాలకది ప్రాతినిధ్యం వహిస్తుంది. ప్రస్తుత దశలో అది నూతన ప్రజాస్వామ్య వ్యవస్థను నెలకొల్పడానికి కృషిచేస్తుంది; దాని అంతిమ లక్ష్యం చైనాలో కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించడం.

మావ్ సే-టుంగ్ తయారుచేసిన చైనా విప్లవ సిద్ధాంతమే చైనా కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలన్నిటికీ మార్గదర్శి. మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలను చైనా విప్లవ అనుభవంతో జోడించగా వచ్చిన ఫలితమే చైనా విప్లవ సిద్ధాంతం. అన్ని రకాలైన పిడివాదాలను, స్వీయానుభవ ధోరణులను అది వ్యతిరేకిస్తుంది. గతితార్కిక భౌతికవాదం, చారిత్రక భౌతికవాదం అనే మార్క్సిస్టు సిద్ధాంతాల మీద ఆధారపడుతూ, చైనాదేశం యొక్క యితర దేశాలయొక్క చారిత్రక సాంప్రదాయాల నది విమర్శనా దృష్టితో స్వీకరిస్తుంది. భావవాదం, యాంత్రిక భౌతికవాదం బోధించే ప్రపంచ దృక్పథాన్ని అది వ్యతిరేకిస్తుంది.

నేటి చైనా సమాజం - అంటే విముక్త ప్రాంతాలకు బయటనున్న ప్రదేశం - యిప్పటికీ అర్ధవలస, అర్ధభూస్వామ్య సమాజంగానే ఉండడంవల్ల; ప్రస్తుతం చైనా విప్లవంలో కార్మికవర్గం, రైతాంగం, పెటీబూర్జువావర్గం మొదలైన ప్రజాతంత్రశక్తులే చోదకశక్తులుగా ఉండడంవల్ల; బలీయమైన కమ్యూనిస్టుపార్టీ చైనాలో ఉండడంవల్ల; అంతర్జాతీయ పరిస్థితుల ప్రభావంవల్ల - చైనా విప్లవం ప్రస్తుత దశలో కొత్తవిధమైన బూర్జువా ప్రజాతంత్ర విప్లవంగా, నూతన ప్రజాతంత్ర విప్లవంగా రూపొందుతుంది. ఇందులో ప్రజా బాహుళ్యమంతా పాల్గొంటారు; కార్మికవర్గం దీనికి నాయకత్వం వహిస్తుంది; సామ్రాజ్యవాదానికీ, భూస్వామ్య విధానానికీ వ్యతిరేకంగా యిది నడుపబడుతుంది. ఈ విప్లవానికి స్వదేశంలోను, విదేశాల్లోనుకూడా మిత్రు లనేకమంది ఉన్నారు. అందుచేత ప్రస్తుత దశలో చైనా కమ్యూనిస్టు పార్టీ నెరవేర్చవలసిన కర్తవ్యా లేవంటే: ఆంతరంగికంగా కార్మికుల్నీ, రైతుల్నీ, మధ్యతరగతి ప్రజల్నీ, విద్యావంతుల్నీ, సామ్రాజ్యవాద వ్యతిరేకుల్నీ, భూస్వామ్యవిధాన వ్యతిరేకుల్నీ, అల్పసంఖ్యాకజాతుల్నీ సంఘటితపరచి సమీకరించడం; బహిర్గతంగా ప్రపంచ కార్మికులతోను, పీడిత ప్రజలతోను, మనల్ని సమాన హార్దాత్తో చూచే యితర జాతులతోను చేతులుకలిపి చైనాజాతిని విదేశ సామ్రాజ్యవాదుల పెత్తనం నుంచి విముక్తి చేయడానికి, చైనా ప్రజల్ని పీడించే భూస్వామ్య వర్గాల దోపిడీని తుదముట్టించడానికి, అన్ని విప్లవవర్గాలస మైక్యత పైన అన్నిజాతుల సమానత్వం పైన ఆధారపడే స్వతంత్ర,

ప్రజాతంత్ర, సమైక్య, సుభిక్ష చైనాను నిర్మించడానికి, ప్రపంచ శాంతిని అభ్యుదయాన్ని సాధించడానికి – కృషిచేయడం.

ముందు ముందు, అనగా చైనా జాతీయ విప్లవం ప్రజాతంత్ర విప్లవం సంపూర్ణ విజయాన్ని సాధించినతరువాత, కమ్యూనిస్టుపార్టీ కర్తవ్యం చైనాదేశపు ఆర్థిక సాంఘికాభివృద్ధికి అనుగుణ్యంగా, చైనా ప్రజల అభీష్టాన్నిబట్టి సోషలిస్టు సమాజాన్ని, కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించేందుకు అవసరమైన చర్యలు తీసుకోవడం.

అర్థవలస, అర్థ భూస్వామ్య దశలో నేడున్న చైనా ఎంతో విస్తీర్ణంగలదేశం. జనాభాకూడ పెద్దది. ఇప్పటికీ అది సమైక్యం కాలేదు. ఒకవైపు అసంఖ్యాకమైన ప్రజలు, ముఖ్యంగా కార్మికులు రైతులు విప్లవ సాంప్రదాయాన్ని కలిగియున్నారు. వీరోచిత పోరాటాలను జరిపారు. మరొకవైపు విప్లవమార్గంలో చాల పెద్ద అవరోధాలున్నాయి. ఈ కారణాలవల్ల చైనా విప్లవం అసమాన స్థాయిలో అభివృద్ధి చెందుతూంది. దీర్ఘకాల స్వభావాన్ని అది కలిగిఉంది. పోరాట గమనం అనేక క్లిష్ట దశలతో నిండివుంది. ఈ కారణాలవల్ల సాయుధ పోరాటం చాలకాలంగా చైనా విప్లవం యొక్క ప్రధాన పోరాట రూపంగా ఉంటూవచ్చింది. విప్లవం ప్రధానగరాలలో విజయాన్ని సాధించడానికి ముందు గ్రామ సీమల్లో విప్లవస్థావరాలను బలపరచుకోవడం చాల అవసరం. చైనా కమ్యూనిస్టు పార్టీ చాలకాలం ఓపికగా అన్ని తరగతుల ప్రజల్లోను పనిచేయవలసిన అవసరంకూడ పై కారణాలవల్లనే ఏర్పడింది. ఈ విధంగా చైనాకమ్యూనిస్టుపార్టీ

చైనా దేశ విప్లవలక్షణా లన్నిటినీ దృష్టిలో ఉంచుకుని లక్షలాది ప్రజల్ని సమీకరించడానికవసరమైన ధైర్యాన్ని, అనుభవాన్ని నైపుణ్యాన్ని, ప్రదర్శించ వలసియుంది. అన్ని కష్టాలను, అవరోధాలను ఎదుర్కొంటూ విప్లవమనే ఓడను రాళ్ళకు దూరంగా నడుపుతూ తన గమ్యస్థానానికి చేర్చవలసియుంది. ఈలోగా అది ఎప్పటికప్పుడు తన్ను తాను గట్టిపరచుకోవాలి.

విప్లవ పోరాటాల గమనంలో చైనా కమ్యూనిస్టుపార్టీ విప్లవ ప్రజా సంస్థ లన్నిటికీ, విప్లవ పరిపాలక సంస్థలన్నిటికీ జీవకణంగా తయారవడానికి ప్రయత్నించాలి. అంతేకాదు, కార్మికవర్గ ఐక్యతను భగ్నంచేయడానికి, వివిధ విప్లవ వర్గాల మధ్యగల స్నేహాన్ని చెడగొట్టడానికి మంటగల్పడానికి ఇంటా, బయటా శత్రువులుచేసే పనుల్ని మనోనిశ్చయంతో ఎదుర్కోవాలి.

చైనా కమ్యూనిస్టుపార్టీ తన సభ్యుల్లో మితవాద అవకాశ వాదాన్నిగాని, "అతివాద" అవకాశవాదాన్నిగాని సహించదు. తన ఐక్యతను కాపాడుకోడానికది అవకాశవాదుల తోను, లొంగుబాటుదార్లతోను, పదవీ వ్యామోహ పరుల తోను రాజీలేని పోరాటం సవ్యమైన పద్ధతుల్లో – సాగిస్తుంది. ఎల్లప్పుడూ తప్పులుచేసే వారిని బయటికి వెళ్ళగొడుతుంది.

చైనా కమ్యూనిస్టుపార్టీ తన పొరబాట్లను, తాను చేసే పనిలో లోపాలను దాచిపెట్టుకోకూడదు. వాటిని ఎప్పటికప్పుడు విమర్శన – ఆత్మవిమర్శన ద్వారా పరీక్షించుకొంటూ ఉండాలి; సకాలంలో వాటిని దిద్దుకోవాలి. తన సభ్యుల్నీ కార్యకర్తల్నీ ఎడ్యుకేట్ చేయాలి. అహంభావాన్ని,

పొరబాట్లను అంగీకరించక పోవడాన్నీ, విమర్శన-ఆత్మవిమర్శన అంటే భయాన్నీ పార్టీ వ్యతిరేకిస్తుంది.

చైనా కమ్యూనిస్టులు హృదయ పూర్వకంగా ప్రజలకు సేవచేయాలి. కార్మికులతోను, రైతులతోను, యితర విప్లవ శక్తులతోను వారు విస్తృత సంబంధాలుంచుకోవాలి; ఆసంబంధాలను బలీయ మొనర్చుకోడానికి, యింకా విస్తృత మొనర్చుకోడానికి ఎప్పటికప్పుడు శ్రద్ధవహించాలి. పార్టీప్రయోజనాలు, ప్రజల ప్రయోజనాలు ఒకటేననీ, పార్టీకి బాధ్యత వహించడమన్నా ప్రజలకు బాధ్యత వహించడమన్నా ఒకటేననీ ప్రతి పార్టీ సభ్యుడు అర్థంచేసుకోవాలి. ప్రతిపార్టీ సభ్యుడు ప్రజలు చెప్పేదేమిటో శ్రద్ధతో వినాలి; వారి తక్షణ అవసరాలను అర్థం చేసుకోవాలి; వాటికోసం పోరాడేందుకు సంఘటితపడే ప్రజలకు సహాయం చేయాలి. పార్టీ సభ్యులందరు ప్రజలనుంచి నేర్చుకోడానికీ, అదేసమయంలో వారి చైతన్యాన్ని అభివృద్ధి చేసే తలంపుతో వారిని విప్లవ మార్గంలో నిర్విరామంగా నడపడానికీ కృతనిశ్చయులై ఉండాలి. ప్రజలనుంచి దూరమయే ప్రమాదంనుంచి రక్షించుకోడానికి చైనా కమ్యూనిస్టుపార్టీ ఎప్పటికప్పుడు జాగ్రత్త పడుతూ ఉండాలి. గుడ్డి అనుసరణ, హుకూమత్ తత్వం, తలుపులు బిగించుకొని కూర్చొనే ధోరణి నిరంకుశత్వం యుద్ధప్రభువుల తత్వం మొదలైన పొరబాటు ధోరణులు తలయెత్తకుండా చూడాలి. ఎందుచేతంటే, అవి పార్టీని ప్రజలనుంచి దూరంచేస్తాయి.

చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రీకృత ప్రజాస్వామ్య మనే సిద్ధాంతంపై నిర్మింపబడ్డ ఐక్య పోరాటసంస్థ. ఐచ్ఛిక శిక్షణే

యీా ఐక్యతకు మూలం. దానికి సభ్యులందరూ కట్టుబడి యుండాలి.

చైనా కమ్యూనిస్టుపార్టీబలం దానిసంఘటితశక్తిలోను, ఐక్యమనోసంకల్పంలోను, ఐక్యకార్యాచరణలోను ఉంది. పార్టీ కార్యక్రమానికిగాని, నిబంధనావళికిగాని భిన్నమైన ఏపనినీ పార్టీ సహించదు. పార్టీశిక్షణకు భంగం కలిగించే పనుల్నీ, సర్వస్వతంత్రాన్ని ప్రోత్సహించే పనుల్నీ, ముఠాతత్వాలకూ కపటవేషాలకూ ప్రోద్బలమిచ్చే పనుల్నికూడా పార్టీ సహించదు. పార్టీకార్యక్రమాన్నిగాని, నిబంధనావళినిగాని, శిక్షణనుగాని ఉల్లంఘించడమే పనిగా పెట్టుకున్న వారిని సభ్యత్వం నుంచి తొలగించడానికి చైనాకమ్యూనిస్టుపార్టీ ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండాలి.

చైనాజాతి, చైనాప్రజలు సంపూర్ణంగా విముక్తి చెందడానికి ప్రతిపార్టీ సభ్యుడు చురుగ్గాను, స్వార్థత్యాగంతోను పార్టీ కార్యక్రమాన్ని, నిర్ణయాలను అమలు జరపమని పార్టీ ఆదేశిస్తుంది.



# పార్టీ నిబంధనావళి

(1945 లో చైనా కమ్యూనిస్టుపార్టీ సప్తమ మహాసభచే ఆమోదింపబడింది)

## మొదటి అధ్యాయం

### సభ్యత్వం

నిబంధన 1: పార్టీ కార్యక్రమాన్నీ, నిబంధనావళినీ అంగీకరించిన ఏ వ్యక్తి అయినా పార్టీలో సభ్యుడుగా చేరవచ్చు; అతడు ఏదో ఒక పార్టీయూనిట్‌లో సభ్యుడుగా ఉంటూ పనిచేయాలి; పార్టీనిర్ణయాలను అతడు అమలుజరపాలి; సభ్యత్వరుసుము చెల్లించాలి.

నిబంధన 2: పార్టీసభ్యుని విధులు క్రింది విధంగా ఉంటాయి.

(అ) అతడు తన చైతన్యాన్ని వృద్ధిచేసుకొనేందుకు పాటుబడాలి. మార్క్సిస్టు - లెనినిస్టు సూత్రాలనూ మావ్ చైనావిప్లవ సిద్ధాంతాన్నీ అర్థంచేసుకొనేందుకు ప్రయత్నించాలి.

(ఆ) పార్టీ శిక్షణను ఖచ్చితంగా పాటించాలి; పార్టీ యొక్క ఆంతరంగిక రాజకీయ జీవితంలోను, చైనావిప్లవోద్యమంలోను చురుగ్గా పాల్గొనాలి. పార్టీపాలసీని, పార్టీనిర్ణయా

లను అమలు జరపాలి; పార్టీశ్రేయస్సుకు వ్యతిరేకమైన వాట న్నిటికీ వ్యతిరేకంగా పార్టీలోను, బయట పోరాడాలి.

(ఇ) ప్రజలకుసేవ చేయాలి; ప్రజలతో పార్టీకిగల సంబంధాలను గట్టిపరచాలి; వారి అవసరాలను తెలుసుకొని సకాలంలో పైకి తెలియజేయాలి; వారికిపార్టీ పాలసీని విశద పరచాలి.

(ఈ) విప్లవ ప్రభుత్వంయొక్క, విప్లవ సంస్థలయొక్క శిక్షణను పాటించడంలో మార్గదర్శకంగా ఉండాలి; తన వృత్తిలో తాను ప్రావీణ్యం సంపాదించాలి; విప్లవ కార్య క్రమానికి సంబంధించిన వివిధరంగాలలో ఆదర్శ ప్రాయంగా పనిచేయాలి.

నిబంధన 3 : పార్టీసభ్యుని హక్కులు క్రింది విధంగా ఉంటాయి.

(అ) పార్టీ పాలసీని అమలు జరపడంలో వచ్చేసమస్య లపై పార్టీ సమావేశాల్లోను, పార్టీప్రచురణల్లోను స్వేచ్ఛగా చర్చించే హక్కు.

(ఆ) పార్టీలోపల ఎన్నుకొనే హక్కు, ఎన్నుకోబడే హక్కు.

(ఇ) కేంద్రకమిటీవరకు ఏ పార్టీ యూనిట్ కైనా సూచనలు లేదా స్టేట్ మెంట్లు పంపేహక్కు,

(ఈ) పార్టీ సమావేశాల్లో ఏ పార్టీ కార్యకర్తనైనా విమర్శించేహక్కు.

నిబంధన 4 : 18 ఏండ్లు వచ్చిన తర్వాతనే ఏ వ్యక్తి అయినా పార్టీ సభ్యుడుగా చేరవచ్చు.

క్రింద పేర్కొన్నవిధంగా ప్రతివ్యక్తి తాను పార్టీలో చేరడానికనుసరించవలసిన అన్ని పద్ధతులు అనుసరించిన తర్వాతనే అతనికి సంపూర్ణ సభ్యత్వం లభిస్తుంది :

(అ) కార్మికులుగాని, రోజుకూలీలుగాని, పాలేర్లుగాని, పేదరైతులుగాని, పట్టణ పేదలుగాని, విప్లవ సైనికులుగాని పార్టీలో చేరదలచుకున్నప్పుడు, ప్రతిదరఖాస్తుదారునూ యిద్దరు పార్టీసభ్యులు సిఫార్సుచేయాలి. తర్వాత పార్టీశాఖయొక్క సర్వసభ్య సమావేశంయొక్క ఆమోదాన్ని పొందాలి. అటుపిమ్మట, సబ్ డిస్ట్రిక్టు కమిటీగాని దానితోసమాన హోదా గలిగిన కమిటీగాని తన అంగీకారాన్ని తెలపాలి. ఆ తర్వాత, ఆరు నెలల తాత్కాలిక సభ్యత్వకాలం పూర్తికావాలి. ఇవన్నీ పూర్తిఅయిన తర్వాతనే సంపూర్ణ సభ్యత్వం లభిస్తుంది.

(ఆ) మధ్యతరగతి రైతులుగాని, జీతాలు తీసుకొనే ఉద్యోగులుగాని, మేధావులుగాని, వృత్తిదారులుగాని పార్టీలో సభ్యులుగా చేరదలచుకుంటే, ప్రతిదరఖాస్తుదారును యిద్దరు పార్టీసభ్యులు సిఫార్సు చేయాలి. వారిలో ఒకరు సంవత్సరం కంటె ఎక్కువకాలం సభ్యుడుగా ఉండాలి. తర్వాత పార్టీ శాఖయొక్క సర్వసభ్య సమావేశం అతని దరఖాస్తును ఆమోదిస్తూ తీర్మానించాలి. అటుపిమ్మట సబ్ డిస్ట్రిక్టు కమిటీగాని, దానితో సమానహోదా గలిగిన కమిటీగాని తన అంగీకారం తెలపాలి. ఆ తర్వాత సంవత్సరంవరకు తాత్కాలిక సభ్యుడుగా ఉండాలి.

కొత్తగా విముక్తిచేయబడిన ప్రాంతాల్లో సిఫార్సు చేయవలసిన వారి అర్హతలను. తాత్కాలిక సభ్యత్వకాలాన్ని సవరించుకోవచ్చు. ఇందుకు కేంద్రకమిటీగాని, దాని తరఫున పనిచేసే యూనిట్‌గాని, రాష్ట్రకమిటీగాని, సరిహద్దుప్రాంత కమిటీగాని కొన్ని తాత్కాలిక నిబంధనలు తయారుచేయ వచ్చు.

(ఇ) ఒక వ్యక్తి (అ) లేక (ఆ) తరగతి క్రిందికి రాక పోతే యిద్దరు పార్టీసభ్యులతన్ని సిఫార్సుచేయడంతోపాటు, వారిలో ఒకరు మూడుసంవత్సరాలకన్న ఎక్కువకాలం పార్టీ సభ్యుడుగా ఉండియుండాలి. తర్వాత అతని దరఖాస్తును పార్టీ శాఖయొక్క సర్వసభ్య సమావేశం ఆమోదించాలి; కౌంటీ కమిటీగాని, పట్టణకమిటీగాని, వాటిలో సమాన హోదాగల మరొక కమిటీగాని తన అంగీకారం తెలపాలి. ఆటుపిమ్మట రెండుసంవత్సరాలు అతడు తాత్కాలిక సభ్యుడుగా ఉండాలి.

(ఈ) మరొక రాజకీయ పార్టీలో సాధారణ సభ్యుడుగా ఉన్న వొకవ్యక్తి దాన్నివిడిచిపెట్టి మనపార్టీలో చేరదలచు కుంటే, అతని దరఖాస్తును యిద్దరు పార్టీసభ్యులు సిఫార్సు చేయడంతోబాటు, వారిలో ఒకరు మూడు సంవత్సరాలకంటె ఎక్కువకాలం పార్టీసభ్యుడుగా ఉండాలి. తర్వాత పార్టీశాఖ యొక్క సర్వసభ్య సమావేశం అతని సభ్యత్వాన్ని అంగీక రించాలి; అటు పిమ్మట కౌంటీ కమిటీగాని దానితో సమాన హోదాగల కమిటీగాని తన ఆమోదాన్ని తెలియజేయాలి. మరొక రాజకీయ పార్టీలో బాధ్యతగల ఒక సభ్యుడు ఆ పార్టీని విడిచిపెట్టి కమ్యూనిస్టుపార్టీలో చేరదలచుకుంటే, అతని సభ్య

త్వాన్ని సిఫార్సు చేయవలసిన ఇద్దరిలో ఒకరు అయిదు సంవత్సరాలకన్న ఎక్కువకాలం పార్టీ సభ్యుడుగా ఉండాలి. తర్వాత పార్టీశాఖయొక్క సర్వసభ్య సమావేశం తన అంగీకారాన్ని తెలపాలి. రాష్ట్రకమిటీగాని, దానితో సమాన హోదాగల మరొక కమిటీగాని ఆమోదించాలి. మరొక రాజకీయపార్టీలో ప్రముఖస్థాన మలంకరిస్తూవచ్చిన ఒకవ్యక్తి ఆ పార్టీని విడిచిపెట్టి కమ్యూనిస్టుపార్టీలో చేరదలచుకుంటే, కేంద్ర కమిటీయొక్క ఆమోదం అవసరం. పై అన్ని సందర్భాలలో రెండు సంవత్సరాల తాత్కాలిక సభ్యత్వం పూర్తి కావాలి.

<u>నిబంధన 5</u> : కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో కౌంటీ కమిటీలుగాని, వాటితో సమానహోదాగల కమిటీలుగాని, వాటికన్న పై కమిటీలుగాని సరాసరి కొత్తసభ్యుల్ని చేర్చుకోవచ్చు.

<u>నిబంధన 6</u> : కొత్త సభ్యుల్ని సిఫార్సుచేసే ప్రతిపార్టీ సభ్యుడు, దరఖాస్తుదారుయొక్క సిద్ధాంతాలు, గుణగణాలు, వ్యక్తిగతజీవితం మొదలైన విషయాలపై వాస్తవమైన, బాధ్యతగల పూర్తి సమాచారాన్ని పార్టీకి యివ్వాలి. సిఫార్సుచేసేముందు అతడు దరఖాస్తుదారుకు పార్టీ నిబంధనావళిని, కార్యక్రమాన్ని, పార్టీపాలసీని వివరించి చెప్పాలి.

కొత్త సభ్యుని చేర్చుకొనేవిషయంలో నిర్ణయం తీసుకొనేముందు, లేదా ఆమోదం ప్రకటించేముందు పార్టీ కమిటీ అట్టి వ్యక్తితో వివరంగా సంభాషణలు జరపడానికి, దరఖాస్తుదారుని చరిత్రనుగురించి బాధ్యతతో తెలుసుకోడానికి ఒకపార్టీ కార్యకర్తను నియమించాలి.

నిబంధన 7 : తాత్కాలిక సభ్యత్వానికి గడువు నిర్ణయించడంలో ఉద్దేశం, తాత్కాలిక సభ్యులందరికీ ప్రాథమికమైన పార్టీవిద్యగరపడం, వారి రాజకీయ గుణగణాలను తెలుసుకునే అవకాశం ఆ పార్టీయూనిట్‌కి కలుగజేయడం.

తాత్కాలిక సభ్యుల, మామూలు సభ్యుల విధులు, హక్కులు సమానం. అయితే, ఒక తేడామాత్రం ఉంది. తాత్కాలిక సభ్యులకు ఎన్నుకొనే హక్కుగాని, ఎన్నుకోబడే హక్కుగాని, ఓటింగు హక్కుగాని లేదు.

నిబంధన 8 : తాత్కాలిక సభ్యత్వగడువు పూర్తికాగానే, పార్టీశాఖయొక్క సర్వసభ్యసమావేశం చేసే నిర్ణయముద్వారా పూర్తి సభ్యత్వం యివ్వాలి. ఆ నిర్ణయాన్ని పై కమిటీగాని, దానితో సమానహోదాగల మరొక కమిటీగాని ఆమోదిస్తేనే పూర్తి సభ్యత్వం లభిస్తుంది.

ఒకపార్టీ కమిటీ పార్టీ సభ్యుని తాత్కాలిక సభ్యత్వగడువును పెంచవచ్చు; లేదా తగ్గించవచ్చు.

ఏ వ్యక్తి అయినా, తాత్కాలిక సభ్యత్వకాలంలో, పార్టీలో చేరడానికి అర్హతలేదని రుజువైతే అట్టివాని తాత్కాలిక సభ్యత్వహక్కు రద్దుచేయబడుతుంది.

నిబంధన 9 : ఏ తేదీనుంచి తాత్కాలికసభ్యుని హోదా పూర్తిసభ్యుని హోదాగా మార్పుచెందుతుందో, ఆ తేదీనుంచే అతని సభ్యత్వకాలం లెక్కింపబడుతుంది.

నిబంధన 10 : ఒక పార్టీ సభ్యుని, లేదా తాత్కాలిక సభ్యుని మరొకప్రాంతానికి బదిలీచేసినట్లయితే, ఏ పార్టీ

యూనిట్ క్రింద ఆ ప్రాంతం ఉంటుందో, ఆ యూనిట్ క్రింద అతన్ని పార్టీ సభ్యుడుగా లేక తాత్కాలిక సభ్యుడుగా గుర్తించాలి.

నిబంధన 11: ఒక పార్టీసభ్యుడుగాని, తాత్కాలిక సభ్యుడుగాని పార్టీనుంచి వైదొలగాలనుకుంటే, ఆ విధంగా తన పార్టీశాఖకు అతడు దరఖాస్తుపెట్టుకోవాలి. అప్పుడు పార్టీశాఖయొక్క సర్వసభ్యసమావేశం అతని పేరును పార్టీ సభ్యుల జాబితానుంచి తొలగిస్తూ నిర్ణయంచేయాలి. ఈ విషయాన్ని పై కమిటీకి తెలియజేసి, అతని పేరును రిజిష్టరునుంచి తొలగింపజేయాలి.

నిబంధన 12: ఒక పార్టీసభ్యుడు, లేదా తాత్కాలిక సభ్యుడు సరియైన కారణం చూపకుండా ఆరుమాసాలవరకు పార్టీ కార్యకలాపాల్లో పాల్గొనకపోతే, లేదా పార్టీ ఆదేశాలను పాటించకపోతే, లేదా సభ్యత్వరుసుం చెల్లించకపోతే - అట్టి వ్యక్తి తనంత తాను పార్టీనుంచి వైదొలగినట్లే భావించాలి. అతని పేరును సభ్యుల జాబితానుంచి తొలగిస్తూ పార్టీ శాఖయొక్క సర్వసభ్యసమావేశం తీర్మానించాలి. ఈ విషయాన్ని పైకమిటీ ఆమోదంకొరకు పంపాలి.

నిబంధన 13: ఒక పార్టీసభ్యునిగాని, తాత్కాలిక సభ్యునిగాని పార్టీనుంచి తొలగించదలచుకుంటే, ఆ పార్టీశాఖ యొక్క సర్వసభ్యసమావేశం చర్చించి నిర్ణయించాలి; ఈ నిర్ణయాన్ని పై కమిటీ ఆమోదించినతర్వాతనే తీర్మానం అమల్లోకి వస్తుంది.

కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో పార్టీశాఖకన్న పైస్థాయి గల కమిటీ ఒకపార్టీ సభ్యుని, లేదా తాత్కాలిక సభ్యుని పార్టీ నుంచి తొలగిస్తూ నిర్ణయం చేయవచ్చు. అయితే, దానికన్న పై కమిటీ యీ నిర్ణయాన్ని ఆమోదించిన తర్వాతనే అది అమల్లోకి వస్తుంది.

## రెండవ అధ్యాయం

## పార్టీ అంగనిర్మాణం

నిబంధన 14 : పార్టీయొక్క అంగనిర్మాణం కేంద్రీకృత ప్రజాస్వామ్యంపై ఆధారపడి ఉంటుంది. అంటే, ప్రజాస్వామ్యం యొక్క ప్రాతిపదికపై కేంద్రీకృతవిధానం, కేంద్రీకృత నాయకత్వంక్రింద ప్రజాస్వామ్యం అన్నమాట. దాని మూల సూత్రాలు యివి :

(అ) పార్టీయొక్క నాయకత్వ కమిటీలు అన్ని స్థాయిల లోను ఎన్నుకోబడాలి.

(ఆ) అలా ఎన్నుకోబడిన కమిటీలు, తమ్ము ఎన్నుకున్న క్రింది యూనిట్లకు దఫాలవారీగా రిపోర్టు లివ్వాలి.

(ఇ) ప్రతి పార్టీసభ్యుడు, అతడు ఏపార్టీ యూనిట్‌లో సభ్యుడో ఆ యూనిట్ చెప్పినట్లు చేయాలి; అల్పసంఖ్యాకులు, అధికసంఖ్యాకుల అభిప్రాయాన్ని పొందలదాల్చాలి; క్రింది పార్టీయూనిట్లు పై యూనిట్ల నిర్ణయాలను, అన్ని పార్టీ యూనిట్లు కేంద్రకమిటీ నిర్ణయాలను అమలుజరపాలి.

(ఈ) పార్టీ శిక్షణ కఠినంగా అమలుజరపబడాలి; పార్టీనిర్ణయాలు నిర్నిబంధంగా పాటింపబడాలి.

నిబంధన 15 : పార్టీయూనిట్లు భౌగోళిక విభాగాలను బట్టి, లేదా ఉత్పత్తిరంగాలనుబట్టి నిర్మింపబడాలి.

ఒకానొక ప్రాంతంలో పార్టీపని ఏ యూనిట్ క్రింద జరుగుతుందో, ఆ యూనిట్టే ఆ ప్రాంతంలోని పార్టీయూనిట్లన్నిటికన్న ఉన్నతమైనది.

ఒకానొక ఉత్పత్తిరంగంలో పార్టీపని ఏ యూనిట్ క్రింద జరుగుతుందో, ఆ యూనిట్టే ఆ ఉత్పత్తిరంగంలోని పార్టీ యూనిట్లన్నిటికన్న ఉన్నతమైనది.

నిబంధన 16 : పార్టీయొక్క అంగనిర్మాణం ఈ విధంగా ఉండాలి :

(అ) చైనాదేశానికంతకూ జాతీయ పార్టీమహాసభ, కేంద్రకమిటీ, జాతీయ పార్టీ కాన్ఫరెన్సు.

(ఆ) రాష్ట్రానికి రాష్ట్ర పార్టీమహాసభ, రాష్ట్రకమిటీ, రాష్ట్ర కాన్ఫరెన్సు; సరిహద్దుప్రాంతానికి సరిహద్దుప్రాంత మహాసభ, సరిహద్దుప్రాంత కమిటీ, సరిహద్దుప్రాంత కాన్ఫరెన్సు; రీజియనల్ కి రీజినల్ మహాసభ, రీజినల్ కమిటీ, రీజినల్ కాన్ఫరెన్సు.

(ఇ) కౌంటీకి కౌంటీ పార్టీమహాసభ, కౌంటీ పార్టీ కమిటీ, కౌంటీ పార్టీ కాన్ఫరెన్సు.

(ఈ) పట్టణానికి పట్టణ పార్టీమహాసభ, పట్టణకమిటీ, పట్టణ కాన్ఫరెన్సు.

(ఉ) పట్టణంలోని, లేదా గ్రామ సముదాయంలోని సబ్ డిస్ట్రిక్టుకు సబ్ డిస్ట్రిక్టు మహాసభ (లేదా సర్వసభ్య సమావేశం), సబ్ డిస్ట్రిక్టు కమిటీ, సబ్ డిస్ట్రిక్టు కాన్ఫరెన్సు.

(ఊ) ఫ్యాక్టరీకి, లేదా గనికి, లేదా గ్రామానికి, లేదా సంస్థకు, లేదా వీధికి, లేదా సైనికదళానికి, లేదా ఆఫీసుకు, లేదా స్కూలుకు సర్వసభ్యసమావేశం, పార్టీ బ్రాంచి (శాఖ) కమిటీ, పార్టీబ్రాంచి కాన్ఫరెన్సు.

<u>నిబంధన 17</u> : పార్టీ బ్రాంచి (శాఖ) యొక్క అత్యున్నత నాయకత్వసంస్థ దాని సర్వసభ్యసమావేశం. సబ్ డిస్ట్రిక్టు, లేదా కౌంటీ, లేదా పట్టణ, లేదా రీజియన్, లేదా సరిహద్దుప్రాంత, లేదా రాష్ట్ర యూనిట్ అత్యున్నత నాయకత్వ సంస్థ ఆ యూనిట్ పార్టీ మహాసభ. మొత్తం పార్టీ యొక్క అత్యున్నత నాయకత్వసంస్థ జాతీయ పార్టీమహాసభ.

పార్టీ మహాసభల మధ్యకాలంలో, వాటిచే ఎన్నుకోబడు వివిధ స్థాయిల కమిటీలు ఆయా పార్టీయూనిట్ల అత్యున్నత నాయకత్వ సంస్థలు.

<u>నిబంధన 18</u> : ఎక్కడైతే సాధ్యమో అక్కడల్లా వివిధ స్థాయిలలో నాయకత్వ కమిటీలు ఎన్నికలద్వారా నెలకొల్పబడాలి. సర్వసభ్య సమావేశాలుగాని, పార్టీ మహాసభలుగాని జరగడానికి పరిస్థితులు అనుకూలంగా లేనప్పుడుమాత్రమే వాటిని పార్టీ కాన్ఫరెన్సులు ఎన్నుకోవాలి; లేదా పై కమిటీలు వాటిని నియమించాలి.

నిబంధన 19 : ఏ స్థాయిలో అయినా పార్టీకమిటీని ఎన్నుకొనేటప్పుడు, కొంతమంది అభ్యర్థుల జాబితానుంచి రహస్య బ్యాలట్‌ద్వారాగాని, బహిరంగ ఓటింగ్‌ద్వారాగాని ఎన్నికలు జరగాలి. అప్పుడు ఏ అభ్యర్థినైనా విమర్శించే హక్కు, జాబితాలోని ఏ అభ్యర్థినైనా మార్చేహక్కు ఓటర్లకు ఉండాలి.

నిబంధన 20 : ఒక పై కమిటీచేసిన ముఖ్య నిర్ణయాలను చర్చించేటందుకు, లేదా క్రింది కమిటీలకు పంపేటందుకు, లేదా ఒక పార్టీయూనిట్ తన పనిని సమీక్షించేటందుకు, తన కార్యక్రమాన్ని నిర్ణయించుకొనేటందుకు ఆ యూనిట్ తన కార్యకర్తలనో, చురుగ్గా పనిచేసేవారినో సమావేశపరచవచ్చు.

నిబంధన 21 : నిర్ణయాలు తీసుకొనేముందు ప్రతి పార్టీ సభ్యుడు పార్టీలోను, పార్టీ సమావేశాల్లోను స్వేచ్ఛగాను, పూర్తిగాను చర్చ జరపవచ్చు. పార్టీ పాలసీనిగురించి, వివిధ సమస్యలనుగురించి తన అభిప్రాయాలను వెల్లడించవచ్చు. అయితే, ఒక నిర్ణయం తీసుకున్నతర్వాత దానికి అందరూ నిర్నిబంధంగా కట్టుబడియుండాలి; ఖచ్చితంగా దాన్ని అమలు జరపాలి.

నిబంధన 22 : అన్ని స్థాయిలలోను వివిధ పార్టీ యూనిట్ల నాయకత్వకమిటీలు ఆంతరంగిక ప్రజాస్వామ్య సూత్రంప్రకారం తమ విధులను నెరవేర్చాలి. అలా చేయడం

ద్వారానే పార్టీసభ్యుల విప్లవచొరవను, సృజనాత్మకశక్తిని పెంపొందించగల్గుతాం; చైతన్యయుతమైన పార్టీ శిక్షణను బలీయ మొనర్చగల్గుతాం; సరియైన నాయకత్వం పార్టీకి యివ్వ గల్గుతాం; ప్రజాస్వామ్యంపై ఆధారపడు కేంద్రీకృత విధానాన్ని కాపాడుతూ గట్టిపరచగల్గుతాం. అయితే యిలా చేసే టప్పుడు, వివిధ స్థాయిల నాయకత్వకమిటీలు పార్టీలో కేంద్రీకృత విధానం బలహీనపడకుండా జాగ్రత్తపడాలి; కేంద్రీకృత విధానానికి ఉపయోగపడే ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని అరాచక ధోరణులతో గందరగోళపరచకూడదు (సర్వ స్వతంత్రచర్యలు, అతి ప్రజాస్వామ్య చర్యలు).

<u>నిబంధన 23 :</u> పార్టీలో ఆంతరంగిక ప్రజాస్వామ్యం

అత్యవసర పరిస్థితుల్లో పార్టీయొక్క పోరాటశక్తిని, పోరాట వాంఛను బలహీనపరచేవిధంగా కాక, పార్టీశ్రేయస్సు కనుగుణ్యంగా అమలుజరిగేటట్లు చూడాలంటే; పార్టీవిచ్ఛిన్నకులు గాని, పార్టీ వ్యతిరేకులుగాని, పార్టీలో ముఠాలుకట్టేవారు గాని ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని ఉపయోగించుకొని పార్టీని పాడుచేయకుండాను, విచ్ఛిన్నంచేయకుండాను చూడాలంటే; కొద్దిమంది వ్యక్తులు పార్టీలో అధికసంఖ్యాకుల సిద్ధాంత బలహీనతలను తమ స్వార్థప్రయోజనాలకోసం ఉపయోగించుకో లేకుండా చేయాలంటే – దేశవ్యాపితంగాగాని, స్థానికంగాగాని పార్టీపాలసీని సమగ్రంగా సమీక్షించడానికి, కూలంకషంగా చర్చించడానికి క్రింది పరిస్థితులను కల్పించాలి:

(అ) ఇందుకు తగిన వ్యవధి ఉండాలి. అంటే, బాహ్య పరిస్థితులు అసాధారణ స్వభావాన్ని కలిగియుండకూడదు.

(ఆ) కేంద్రకమిటీగాని, అంతకన్న తక్కువస్థాయిగల నాయకత్వకమిటీగాని అలాంటి నిర్ణయం ఒకటి చేయాలి.

(ఇ) క్రిందియూనిట్లలో అధిక సంఖ్యగాని, అంతకంటె పై యూనిట్‌గాని అలాంటిచర్య అవసరమని సూచించాలి.

<u>నిబంధన 24 :</u> అన్నిస్థాయిల పార్టీయూనిట్లు, తమ నాయకత్వంక్రింద ప్రచురింపబడే పత్రికలు పై కమిటీల, కేంద్ర పార్టీ పత్రికల నిర్ణయాలను, పాలసీని ప్రచారంచేసేటట్లు చూడాలి.

<u>నిబంధన 25 :</u> జాతీయ ప్రాముఖ్యంగల సమస్యలపై కేంద్రకమిటీ ఒక ప్రకటనగాని, నిర్ణయంగాని చేయకముందు క్రింది పార్టీయూనిట్లుగాని, వాటిలో బాధ్యతగల సభ్యులుగాని తమ యిష్టంవచ్చిన స్టేట్‌మెంట్లను, నిర్ణయాలను చేయకూడదు. అయితే వారు వేరే చర్చలు జరుపుకొనవచ్చు; లేదా కేంద్ర కమిటీకి తమ సూచనలు పంపవచ్చు. స్థానిక సమస్యలపై క్రింది యూనిట్లు స్వతంత్రంగా నిర్ణయాలు చేసుకోవచ్చు. అయితే ఆ నిర్ణయాలు పై కమిటీల నిర్ణయాలతోగాని, కేంద్ర కమిటీ నిర్ణయాలతోగాని భేదించకూడదు.

<u>నిబంధన 26 :</u> ఒక క్రొత్తపార్టీ యూనిట్‌ను నెలకొల్ప దలచుకుంటే, దాని పై కమిటీ ఆమోదాన్ని పొందాలి.

<u>నిబంధన 27 :</u> రాష్ట్రకమిటీల, రీజినల్ కమిటీల పనిని సమర్థవంతంగా నడిపేందుకు కేంద్రకమిటీ ఆయా పరిస్థితుల్ని బట్టి సెంట్రల్ బ్యూరోలనుగాని, సబ్ సెంట్రల్ బ్యూరోలను

గాని నిర్మించవచ్చు. అవి అనేక రాష్ట్రాలపై, లేదా సరిహద్దు ప్రాంతాలపై అధికారం కలిగియుంటాయి. ఈ బ్యూరోలు కేంద్రకమిటీకి ప్రాతినిధ్యం వహిస్తాయి. కేంద్ర కమిటీచే అవి నియమింపబడతాయి; కేంద్రకమిటీకే బాధ్యత వహిస్తాయి. అట్టి బ్యూరోల అవసరం తీరినతర్వాత వాటిని రద్దు చేయడంగాని, యితర యూనిట్లతో కలిపివేయడంగాని చేయాలి.

నిబంధన 28 : వివిధ రంగాలలో పార్టీపనిని సమర్థవంతంగా కొనసాగించడానికి ఏ స్థాయి గల కమిటీఅయినా తన సమిష్టి నాయకత్వంక్రింద వేర్వేరు శాఖలను లేదా కమిషన్లను ఏర్పరచవచ్చు. అవి ప్రచారానికో, సిద్ధాంత ప్రబోధానికో, సైనిక వ్యవహారాలకో, ఆర్థిక సమస్యలకో, ప్రజారంగాలకో బాధ్యత వహిస్తాయి. ఏ స్థాయిలో అయినా ఒక పార్టీకమిటీ తాత్కాలిక కమిషన్లను లేదా శాఖలను నెలకొల్పవచ్చు; అవి తాత్కాలికంగా కొన్ని ప్రత్యేకవిధులను నెరవేరుస్తాయి.

## మూడవ అధ్యాయం

## పార్టీ కేంద్ర కమిటీ

నిబంధన 29 : జాతీయ పార్టీమహాసభనుగూర్చి కేంద్ర కమిటీ నిర్ణయించాలి; అదే మహాసభను జరపాలి. సాధారణ పరిస్థితుల్లో మూడేండ్లకొకసారి దాన్ని సమావేశ పరచాలి. అసాధారణ పరిస్థితుల్లోమాత్రం కేంద్రకమిటీ చేసే నిర్ణయం మేరకు దాన్ని వాయిదా వేయడమో, లేక అంతకన్న ముందు జరపడమో చేయాలి.

మొత్తం పార్టీ సభ్యులలో సగంకంటే ఎక్కువమందికి ప్రాతినిధ్యం వహించే క్రింది యూనిట్లు జాతీయ పార్టీ మహాసభ జరపాలని కోరితే, కేంద్రకమిటీ ఆ విధంగా చేయాలి.

జాతీయ పార్టీమహాసభకు హాజరైన ప్రతినిధులు మొత్తం పార్టీసభ్యులలో సగంకంటే ఎక్కువమందికి ప్రాతినిధ్యం వహించినప్పుడే అది సక్రమమైన మహాసభగా పరిగణింపబడుతుంది.

జాతీయ పార్టీమహాసభకు ఎంతమంది ప్రతినిధుల్ని పంపాలో, వారిని ఎన్నుకోవలసిన పద్ధతి ఎట్టిదో కేంద్రకమిటీ నిర్ణయిస్తుంది.

<u>నిబంధన 30 :</u> జాతీయ పార్టీమహాసభయొక్క విధులు, అధికారాలు క్రిందివిధంగా ఉంటాయి :

(అ) కేంద్ర కమిటీ, యితర కేంద్రసంస్థలు సమర్పించే నివేదికలనువినడం, చర్చించడం, వాటిపైనిర్ణయాలు చేయడం.

(ఆ) పార్టీ కార్యక్రమంపైన, నిబంధనావళిపైన నిర్ణయాలు చేయడం, వాటిని సవరించడం.

(ఇ) పార్టీయొక్క ప్రధాన వైఖరిని, పాలసీని నిర్ణయించడం.

(ఈ) కేంద్రకమిటీని ఎన్నుకోవడం.

నిబంధన 31 : కేంద్రకమిటీలో ఎంతమంది సభ్యులుండాలో జాతీయ పార్టీమహాసభ నిర్ణయించాలి; వారిని ఎన్నుకోవలసిందికూడా జాతీయ పార్టీమహాసభ.

కేంద్రకమిటీలో ఖాళీలు ఏర్పడితే, ఆ స్థానాల్లో కేంద్ర కమిటీయొక్క ప్రత్యామ్నాయ సభ్యుల్ని వారి వారి ప్రాధాన్యతనుబట్టి నియమించాలి.

నిబంధన 32: ఇతర రాజకీయపార్టీలతోను, సంస్థలతోను వ్యవహరించేటప్పుడు కేంద్రకమిటీ మొత్తం పార్టీకి ప్రతినిధిగా ఉండాలి; అదే పార్టీ పత్రికలను నెలకొల్పి వాటి కార్యకలాపాలను నడపాలి; పార్టీ కార్యకర్తల్ని, పార్టీనిధుల్ని పంచవలసిందికూడా అదే.

నిబంధన 33: ఆరు నెలల కొకసారి కేంద్ర పొలిట్ బ్యూరో కేంద్రకమిటీయొక్క విస్తృత సమావేశాన్ని పిలవాలి. అయితే పరిస్థితుల్నిబట్టి పొలిట్‌బ్యూరో దాన్ని వాయిదావేయవచ్చు; లేదా అంతకన్న ముందుగా సమావేశపరచవచ్చు. కేంద్రకమిటీయొక్క ప్రత్యామ్నాయసభ్యులు ఈ విస్తృత సమావేశానికి హాజరై తమ అభిప్రాయాలను తెలియజేయవచ్చు.

నిబంధన 34: కేంద్రకమిటీ విస్తృత సమావేశంలోనే పొలిట్‌బ్యూరో, కేంద్రకార్యవర్గం(సెంట్రల్ సెక్రటేరియట్), కేంద్రకమిటీ అధ్యక్షుడు ఎన్నుకోబడాలి.

కేంద్రకమిటీ విస్తృత సమావేశాలమధ్య పొలిట్ బ్యూరో పార్టీయొక్క కేంద్రనాయకత్వ సంస్థగా పనిచేయాలి; మొత్తం పార్టీపనిని అది నడపాలి.

కేంద్రకార్యవర్గం పొలిట్‌బ్యూరో నిర్ణయాలప్రకారం కేంద్రకమిటీయొక్క దైనందిన కార్యక్రమాన్ని చూడాలి.

కేంద్రకమిటీ అధ్యక్షుడు పొలిట్‌బ్యూరోకి, కేంద్ర కార్యవర్గానికికూడా అధ్యక్షుడే.

కేంద్రకమిటీ తన పనియొక్క అవసరాన్నిబట్టి వేర్వేరు శాఖలను (ఉదా : నిర్మాణశాఖ, ప్రచారశాఖ మొదలైనవి), కమిషన్లను (ఉదా: సైనిక వ్యవహారాల కమిషన్, పార్టీ పత్రికల కమిషన్ మొదలైనవి), తదితర సంస్థలను నియమించవచ్చు. అవి పొలిట్‌బ్యూరో, కేంద్రకార్యవర్గం, కేంద్ర కమిటీ అధ్యక్షుల నాయకత్వంక్రింద, పర్యవేక్షణక్రింద తమ తమ ప్రత్యేక రంగాలలో పనిచేయాలి.

<u>నిబంధన 35 :</u> జాతీయ పార్టీమహాసభల మధ్య కేంద్ర కమిటీ అనేక జాతీయ పార్టీ కాన్ఫరెన్సులు జరపవచ్చు. వాటికి ప్రతినిధులు క్రిందికమిటీలనుంచి రావాలి. ఈ కాన్ఫరెన్సులు ఆనాటి పరిస్థితుల్లో పార్టీ పాలసీకి సంబంధించిన సమస్యలపై చర్చలు జరిపి నిర్ణయాలు తీసుకోవచ్చు.

<u>నిబంధన 36 :</u> జాతీయ పార్టీ కాన్ఫరెన్సులకు ప్రతినిధులు రాష్ట్రకమిటీల విస్తృత సమావేశాల్లోను, సరిహద్దు ప్రాంత కమిటీల విస్తృత సమావేశాల్లోను, కేంద్రకమిటీక్రింద పనిచేసే యితర కమిటీల విస్తృత సమావేశాల్లోను ఎన్నుకోబడాలి. ఎంతమంది ప్రతినిధుల్ని ఎన్నుకోవాలో కేంద్రకమిటీ నిర్ణయించాలి.

జాతీయ పార్టీ కాన్ఫరెన్సులకు దేశంలోని మొత్తం రాష్ట్ర కమిటీల, సరిహద్దు ప్రాంత కమిటీల సభ్యులలో సగం మందికి పైగా హాజరుకావాలి.

నిబంధన 37 : జాతీయ పార్టీ కాన్ఫరెన్సులు కేంద్ర కమిటీలో తమ కర్తవ్యాలను నెరవేర్చలేని సభ్యుల్ని, లేదా ప్రత్యామ్నాయ సభ్యుల్ని తొలగించడానికి హక్కును కలిగివుంటాయి. ఉపఎన్నికల్లో కేంద్రకమిటీయొక్క ప్రత్యామ్నాయ సభ్యులలో కొందరిని ఎన్నుకోడానికికూడా హక్కును కలిగియుంటాయి. అయితే, అలా తొలగింపబడు సభ్యులూ, ప్రత్యామ్నాయ సభ్యులూ, లేదా ఎన్నుకోబడ్డ సభ్యులూ, ప్రత్యామ్నాయ సభ్యులూ మొత్తం సంఖ్యలో 5 వ వంతుకు మించి ఉండకూడదు.

నిబంధన 38 : జాతీయ పార్టీ కాన్ఫరెన్సులలో తీసుకునే నిర్ణయాలూ, కేంద్రకమిటీసభ్యుల- తాత్కాలిక సభ్యుల బర్తరఫులు, తాత్కాలికసభ్యుల ఎన్నికలూ కేంద్రకమిటీ ఆమోదం పొందిన తర్వాతే అమల్లోకి వస్తాయి.

కేంద్రకమిటీ ఆమోదంపొందిన జాతీయ పార్టీ కాన్ఫరెన్సుల నిర్ణయాలను అన్ని పార్టీయూనిట్లు అమలుజరపాలి.

## నాల్గవ అధ్యాయం

## రాష్ట్ర, సరిహద్దుప్రాంత కమిటీలు

నిబంధన 39 : రాష్ట్ర పార్టీమహాసభ లేదా సరిహద్దు ప్రాంత పార్టీ మహాసభ, రాష్ట్రకమిటీ లేదా సరిహద్దుప్రాంత కమిటీ కేంద్రకమిటీ నాయకత్వాన్ని లేదా దాని ప్రాతినిధ్యకమిటీ నాయకత్వాన్ని అంగీకరించాలి.

నిబంధన 40 : రెండేండ్లకొకసారి రాష్ట్రకమిటీ లేదా సరిహద్దు ప్రాంతకమిటీ రాష్ట్రపార్టీ మహాసభను లేదా సరిహద్దుప్రాంత మహాసభను జరపాలి. ప్రత్యేక పరిస్థితుల్లో రాష్ట్రకమిటీ లేదా సరిహద్దుప్రాంత కమిటీ మహాసభను వాయిదా వేయడంగాని, అంతకన్న ముందుగా జరపడంగాని చేయవచ్చు. అట్టి మహాసభను రాష్ట్రకమిటీ లేదా సరిహద్దు ప్రాంత కమిటీ సగంకంటె ఎక్కువగా ఉన్న క్రింది యూనిట్ల కోరికమీదనో, కేంద్రకమిటీ సూచనప్రకారమో, దాని ప్రాతినిధ్యసంస్థ సూచనప్రకారమో పిలవాలి.

రాష్ట్ర పార్టీ మహాసభకు లేదా సరిహద్దుప్రాంత మహాసభకు హాజరుకావలసిన ప్రతినిధుల సంఖ్యను, వారి నెన్నుకోవలసిన పద్ధతిని నిర్ణయించవలసింది రాష్ట్రకమిటీ లేదా సరిహద్దుప్రాంత కమిటీ. ఆ నిర్ణయం కేంద్రకమిటీయొక్క లేదా దాని ప్రాతినిధ్యసంస్థయొక్క ఆమోదాన్ని పొందాలి.

నిబంధన 41 : రాష్ట్రకమిటీ విస్తృత సమావేశం లేదా సరిహద్దుప్రాంత విస్తృత కమిటీ తన స్థాయిసంఘాన్ని, కార్యదర్శిని, సహాయ కార్యదర్శిని ఎన్నుకోవాలి. వారు దైనందిన కార్యక్రమాన్ని అమలుజరుపుతారు. రాష్ట్రకమిటీ కార్యదర్శి ఎన్నిక, స్థాయిసంఘ ఎన్నిక, కేంద్రకమిటీ ఆమోదాన్ని పొందాలి. అలాగే సరిహద్దుప్రాంతకమిటీ కార్యదర్శి స్థాయిసంఘం, కేంద్రకమిటీ ఆమోదాన్ని పొందాలి. కార్యదర్శి 5 సంవత్సరాలకంటె ఎక్కువకాలం పార్టీసభ్యుడై ఉండాలి.

రాష్ట్రకమిటీ విస్తృతసమావేశం లేదా సరిహద్దుప్రాంత కమిటీ విస్తృతసమావేశం కనీసం ఏడాదికి రెండుసార్లు జరగాలి.

నిబంధన 42: రాష్ట్రకమిటీ లేదా సరిహద్దుప్రాంతకమిటీ, విస్తృత సమావేశంలో, పైనందిన కార్యక్రమాన్ని అమలు జరిపేందుకు స్థాయిసంఘాన్ని, కార్యదర్శిని, సహాయ కార్య దర్శిని ఎన్నుకోవాలి. రాష్ట్రకమిటీ కార్యదర్శి లేదా సరిహద్దు ప్రాంతకమిటీ కార్యదర్శి, స్థాయిసంఘసభ్యులు కేంద్రకమిటీ ఆమోదాన్ని పొందాలి. కార్యదర్శి 5 సంవత్సరాలకన్న ఎక్కువకాలం పార్టీసభ్యుడై యుండాలి.

రాష్ట్రకమిటీ లేదా సరిహద్దుప్రాంతకమిటీ విస్తృత సమావేశం సంవత్సరానికి కనీసం రెండుసార్లు జరగాలి.

నిబంధన 43 : రాష్ట్రకమిటీ లేదా సరిహద్దుప్రాంత కమిటీ తన రాష్ట్రంలో లేదా సరిహద్దుప్రాంతంలో రాష్ట్ర మహాసభ నిర్ణయాలను లేదా సరిహద్దుప్రాంత మహాసభ నిర్ణ యాలను, కేంద్రసంస్థల నిర్ణయాలను అమలుజరపాలి; వివిధ పార్టీయూనిట్లను నిర్మించాలి; పార్టీకార్యకర్తలను, నిధులను కేటాయించాలి; ప్రజాసంఘాలలో పార్టీఫ్రాక్షన్ల పనిని నడపాలి.

నిబంధన 44 : రాష్ట్ర పార్టీ మహాసభల మధ్య లేదా సరిహద్దుప్రాంత మహాసభల మధ్య రాష్ట్రకమిటీలు లేదా సరిహద్దుప్రాంత కమిటీలు రాష్ట్ర కాన్ఫరెన్సులను లేదా సరిహద్దుప్రాంత కాన్ఫరెన్సులను జరపవచ్చు. వాటికి హాజరయే ప్రతినిధులు రీజినల్ కమిటీలనుంచి, కౌంటీ కమిటీల నుంచి, తనక్రింద పనిచేసే యితర కమిటీలనుంచి ఎన్నుకో బడాలి. ఈ కాన్ఫరెన్సులలో, రాష్ట్రంలోగాని సరిహద్దు

ప్రాంతంలోగాని జరగవలసిన పనినిగురించి, సమస్యల్నిగురించి నిర్ణయాలు తీసుకోబడతాయి.

రాష్ట్ర కాన్ఫరెన్సు లేదా సరిహద్దుప్రాంత కాన్ఫరెన్సు రాష్ట్రకమిటీలో కొందరినిగాని, సరిహద్దుప్రాంత కమిటీలో కొందరినిగాని తొలగించడానికి, వారి స్థానంలో కొత్తవారి నెన్నుకోడానికి అధికారం ఉంటుంది. అయితే అలా తొలగింపబడే సభ్యులు లేదా కొత్తగా ఎన్నుకోబడే సభ్యులు మొత్తం సంఖ్యలో నాల్గవవంతుకు మించరాదు.

నిబంధన 45 : రాష్ట్ర పార్టీకాన్ఫరెన్సు లేదా సరిహద్దుప్రాంత కాన్ఫరెన్సు చేసిన నిర్ణయాలు, సభ్యుల తొలగింపు, కొత్త సభ్యుల ఎన్నిక రాష్ట్రకమిటీయొక్క లేదా సరిహద్దుప్రాంత కమిటీయొక్క ఆమోదం పొందితేనే అమల్లోకి వస్తాయి.

## ఐదవ అధ్యాయం

## రీజినల్, కౌంటీ, పట్టణ, సబ్‌డిస్ట్రిక్టు కమిటీలు

నిబంధన 46 : రాష్ట్రానికి లేదా సరిహద్దుప్రాంతానికి వర్తించే పార్టీ నిర్మాణ విధులే రీజియన్‌కి లేదా కౌంటీకి లేదా పట్టణానికి లేదా సబ్‌డిస్ట్రిక్టుకికూడా వర్తిస్తాయి. ఆ యా ప్రాంతాలలో ప్రతి పార్టీయూనిట్ తన పై కమిటీ నాయకత్వం క్రింద పనిచేయాలి.

నిబంధన 47 : రెండేండ్లకొకసారి రీజినల్, కౌంటీ, పట్టణ, సబ్‌డిస్ట్రిక్టు పార్టీ మహాసభలు జరగాలి. అట్టి మహాసభలమధ్య పార్టీ కాన్ఫరెన్సులు జరపవచ్చు.

నిబంధన 48 : రీజినల్ కమిటీ విస్తృతసమావేశం లేదా కౌంటీ కమిటీ విస్తృత సమావేశం ఏడాదికి కనీసం నాలుగు సార్లు జరగాలి.

రీజినల్, కౌంటీ, పట్టణ, సబ్ డిస్ట్రిక్టు కమిటీ సభ్యులు, కార్యదర్శి, సహాయ కార్యదర్శి పై కమిటీల ఆమోదం పొందాలి; రీజినల్, కౌంటీ, పట్టణ కమిటీల కార్యదర్శులు కనీసం మూడు సంవత్సరాలకంటే ఎక్కువకాలం పార్టీ సభ్యులుగా ఉండాలి. సబ్ డిస్ట్రిక్టు కమిటీ కార్యదర్శి కనీసం ఏడాదికంటె ఎక్కువకాలం పార్టీసభ్యుడై యుండాలి. కొత్తగా విప్లవ స్థావరాలలో చేరిన ప్రాంతాల్లో పై సభ్యత్వకాలాన్ని మార్చుకోవచ్చు. అయితే ఆ మార్పు రాష్ట్ర కమిటీయొక్క లేదా సరిహద్దుప్రాంత కమిటీయొక్క ఆమోదాన్ని పొందాలి.

## ఆరవ అధ్యాయం

## పార్టీయొక్క ప్రాథమిక యూనిట్లు

నిబంధన 49 : పార్టీయొక్క ప్రాథమిక యూనిట్ పార్టీ బ్రాంచి (శాఖ) ఒకఫ్యాక్టరీలోగాని, గనిలోగాని, గ్రామంలోగాని, సంస్థలోగాని, వీధిలోగాని, సైనికదళంలోగాని, ఆఫీసులోగాని, విద్యాలయంలోగాని ముగ్గురుకంటె ఎక్కువమంది పార్టీసభ్యులున్నట్లయితే, అక్కడొక పార్టీ శాఖను నిర్మించాలి. ముగ్గురుకంటే తక్కువమంది ఉంటే, వారు అక్కడికి సమీపంలో ఉన్న పార్టీశాఖలో చేరాలి.

పార్టీశాఖను ఏర్పరచదలచుకుంటే, కౌంటీ కమిటీ లేదా పట్టణకమిటీ ఆమోదం అవసరం.

<u>నిబంధన 50:</u> పార్టీ బ్రాంచి (శాఖ)యొక్క సభ్యత్వం ఎక్కువగా ఉంటే, బ్రాంచికమిటీక్రింద కొన్ని గ్రూపులను ఏర్పరచవచ్చు. వాటి నిర్మాణం స్వాభావిక కారణాలనుబట్టి, నివాసస్థలాన్నిబట్టి, కార్యక్షేత్రాన్నిబట్టి ఉండాలి. ప్రతిగ్రూపు ఒక గ్రూపునాయకుని ఎన్నుకోవాలి; అవసరమనుకుంటే ఉప నాయకుణ్ణికూడా ఎన్నుకోవచ్చు.

50 కంటె ఎక్కువమంది సభ్యులు, తాత్కాలిక సభ్యులు ఉన్నగ్రామంలో, లేదా 100 మందికంటె ఎక్కువ సభ్యులున్న ఫ్యాక్టరీలో లేదా ఆఫీసులో, లేదా విద్యాలయంలో సాధారణ పార్టీశాఖను నెలకొల్పవచ్చు. ఈ సాధారణ పార్టీశాఖక్రింద ఉపశాఖ లుండాలి. అవి నివాసస్థలాన్ని బట్టి, వృత్తిషాపులనుబట్టి, డిపార్టుమెంట్లనుబట్టి, వర్గాలనుబట్టి నిర్మింపబడాలి. పార్టీ ఉపశాఖకు పార్టీశాఖహోదాయే ఉంటుంది.

<u>నిబంధన 51:</u> 500 మందికంటె ఎక్కువ సభ్యులు, తాత్కాలిక సభ్యులు ఉన్న పట్టణంగాని, ఫ్యాక్టరీగాని, ఆఫీసుగాని, విద్యాలయంగాని రాష్ట్రకమిటీ ఆమోదంతో లేదా సరిహద్దుప్రాంతకమిటీ ఆమోదంతో ఒకకమిటీని ఎన్నుకోవచ్చు. అలా ఎన్నుకోబడిన కమిటీక్రింద నివాసస్థలం, వృత్తిషాపు, డిపార్టుమెంటు,వర్గాలప్రాతిపదికపై పార్టీశాఖలు నిర్మింపబడాలి.

<u>నిబంధన 52:</u> పార్టీశాఖ పార్టీకీ, ప్రజలకూ మధ్య సన్నిహితమైన ఐక్యతను సాధించడానికి ప్రయత్నించాలి.

ప్రతి పార్టీ శాఖ యీ క్రింది విధులను నెరవేర్చాలి:

(అ) ప్రజలు పార్టీ దృక్పథాన్ని, పై కమిటీల నిర్ణయాలను ఆమోదించేటట్లు చేయడానికి ప్రచారం, నిర్మాణకృషి జరపడం.

(ఆ) ప్రజల మనోభావాలను, కోర్కెలను ఎప్పటి కప్పుడు తెలుసుకోవడం, వాటిని పై కమిటీలకు తెలియజేయడం, ప్రజల రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక జీవితంయెడల శ్రద్ధ వహించడం; ప్రజలు తమ సమస్యలను తాము పరిష్కరించు కొనేటట్లు వారిని సంఘటితపరచడం.

(ఇ) కొత్త సభ్యుల్ని చేర్చుకోవడం; సభ్యత్వ రుసుము వసూలుచేయడం; పార్టీసభ్యుల పనిని, గుణగణాలను పరిశీలించడం; వారిలో క్రమశిక్షణను పెంపొందించడం.

(ఈ) పార్టీసభ్యుల్ని సిద్ధాంతరీత్యా తరిఫీదుచేయడం; అధ్యయన తరగతులు నడపడం.

<u>నిబంధన 53 :</u> దైనందిన కార్యకలాపాలను నడపడానికి పార్టీశాఖయొక్క సర్వసభ్యసమావేశం ఒక బ్రాంచికమిటీని ఎన్నుకోవాలి. ఈ కమిటీయొక్క కాలపరిమితి 6 నెలలనుంచి సంవత్సరం. పార్టీశాఖ పెద్దదిగాఉంటే కమిటీలో ఎక్కువ మంది సభ్యులుంటారు. చిన్నదైతే తక్కువమంది - ముగ్గురికి తక్కువ కాకుండాను, పదకొండుగురికి ఎక్కువ కాకుండాను- ఉండాలి. ఈ కమిటీ ఒక కార్యదర్శిని ఎన్నుకోవాలి; అవసరమైతే సహాయకార్యదర్శినికూడా ఎన్నుకోవచ్చు. మిగతా కమిటీ సభ్యులమధ్య పనివిభజన అవసరాలనుబట్టి కమిటీయే ఏర్పాటుచేయాలి.

ఏడుగురుకన్న తక్కువ సభ్యులుగల పార్టీశాఖ ఒక కార్యదర్శినిమాత్రమే, లేదా కార్యదర్శినీ, సహాయకార్య దర్శినీమాత్రమే ఎన్నుకోవాలి; అంతేగాని కమిటీని ఏర్పరచ కూడదు.

## ఏడవ అధ్యాయం

## పార్టీయొక్క రహస్యయూనిట్లు

నిబంధన 54: పార్టీ బహిరంగంగా పనిచేయడానికి వీలులేని ప్రాంతాల్లో పార్టీ నిబంధనావళిప్రకారం కేంద్రకమిటీ చేసే ప్రత్యేక నిర్ణయాలమేరకు, రహస్య నిర్మాణరూపాలు, పనిపద్ధతులు నిర్వచింపబడతాయి. ఈ నిబంధనావళిలో పేర్కొన్నప్రకారం ఏ నిర్మాణరూపమైనా, పద్ధతి అయినా పార్టీయొక్క రహస్య సంస్థలకు వర్తించకపోతే, వాటిని తగు విధంగా మార్చవచ్చు.

నిబంధన 55: కొత్తపార్టీసభ్యుని చేర్చుకొనేటప్పుడు రహస్యపార్టీ యూనిట్ చాలజాగ్రత్తగా పరిశీలనలు జరపాలి. కొత్తసభ్యుడు పార్టీలో చేరేటప్పుడు, అతడు రహస్య పరిస్థితుల కనుగుణ్యంగానే సభ్యుడుగా చేర్చుకోబడాలి.

## ఎనిమిదవ అధ్యాయం

## పార్టీయొక్క కంట్రోల్‌సంస్థలు

నిబంధన 56: కేంద్రకమిటీ అవసరమని భావించినప్పుడు కేంద్ర కంట్రోల్‌కమిషన్‌ను, అంతకన్న క్రింది స్థాయిగల కంట్రోల్‌కమిషన్లను ఏర్పరచవచ్చు.

నిబంధన 57 : కేంద్రకంట్రోల్‌కమిషన్‌ను కేంద్రకమిటీ విస్తృత సమావేశం ఎన్నుకోవాలి. అంతకన్న తక్కువ స్థాయి గల కంట్రోల్ కమిషన్‌ను ఆ స్థాయిగల పార్టీ కమిటీ విస్తృత సమావేశం ఎన్నుకోవాలి; అయితే పై కమిటీ ఆమోదం యిందు కవసరం.

నిబంధన 58 : కేంద్ర కంట్రోల్‌కమిషన్ విధులు, అధికారాలు అంతకన్న క్రింది స్థాయిగల కంట్రోల్‌కమిషన్ల విధులు, అధికారాలు ఏవంటే పార్టీ సభ్యులమీద శిక్షణచర్య తీసుకోవడం లేదా శిక్షణచర్యను రద్దుచేయడం, పార్టీ సభ్యుల ఫిర్యాదులను పరిష్కరించడం.

నిబంధన 59 : వివిధ స్థాయిలలో ఏర్పడు కంట్రోల్ కమిషన్లు ఆయాస్థాయిలలోఉండే పార్టీకమిటీల నాయకత్వం క్రింద పనిచేయాలి.

## తొమ్మిదవ అధ్యాయం

## ప్రజాసంఘాలలో పార్టీఫ్రాక్షన్లు

నిబంధన 60 : ప్రభుత్వసంస్థ, లేదా ట్రేడ్‌యూనియన్ లేదా రైతు సంఘం, లేదా సహకారసంస్థ, లేదా యితర ప్రజాసంఘాల నాయకత్వసంస్థల్లో ముగ్గురుగాని, అంతకన్న ఎక్కువమందిగాని పార్టీసభ్యులు బాధ్యతగల స్థానాల్లోఉంటే ఒక పార్టీఫ్రాక్షన్ నిర్మింపబడాలి. పార్టీఫ్రాక్షన్‌యొక్క కర్తవ్యం, ఆ ప్రజాసంఘంయొక్క నాయకత్వసంస్థలో పనిచేసే

పార్టీసభ్యుల్ని నడపడం, పార్టీయొక్క పలుకుబడిని పెంపొందించడం, పార్టీ పాలసీని అమలుజరపడం.

నిబంధన 61: ప్రతి పార్టీ ఫ్రాక్షన్‌కి ఒక కార్యదర్శి ఉండాలి. పదిమందిగాని, అంతకన్న ఎక్కువమందిగాని సభ్యులున్న పార్టీఫ్రాక్షన్ దైనందిన కార్యక్రమాన్ని నిర్వహించడానికొక కార్యవర్గాన్ని ఏర్పరచాలి. ఆ పార్టీఫ్రాక్షన్ ఏ కమిటీ క్రింద పనిచేస్తుందో ఆ కమిటీ ఫ్రాక్షన్ కార్యదర్శినీ, కార్యవర్గ సభ్యుల్నీ నియమించాలి.

నిబంధన 62: ప్రజాసంఘాల పార్టీఫ్రాక్షన్లు ఆయా స్థాయిలలో పార్టీకమిటీల నాయకత్వంక్రింద పనిచేయాలి; ఆ కమిటీల నిర్ణయాలను అమలుజరపాలి.

అన్ని స్థాయిల పార్టీ కమిటీలు ముఖ్యమైన పార్టీ ఫ్రాక్షన్లలో బాధ్యతగల సభ్యుల్ని తమ సమావేశాలకు ఆహ్వానించవచ్చు.

## పదవ అధ్యాయం

## ప్రమోషన్లు, క్రమశిక్షణ

నిబంధన 63: పార్టీ సభ్యుడుగాని, పార్టీయూనిట్‌గాని తన కార్యకలాపాల్లో పార్టీయెడల, ప్రజలయెడల సంపూర్ణ విశ్వాసాన్ని ప్రదర్శిస్తే, పార్టీయొక్క, విప్లవ ప్రభుత్వంయొక్క క్రమశిక్షణను ఆదర్శప్రాయంగా అమలుజరిపితే; పార్టీ కార్యక్రమాన్నీ, పాలసీనీ, పైకమిటీల నిర్ణయాలను, కేంద్రకమిటీ

ఆదేశాలను అమలుజరపడంలో ప్రత్యేకచొరవను ప్రదర్శిస్తే; పార్టీ యిచ్చిన కర్తవ్యాలను నెరవేర్చడంలో ప్రత్యేకమైన విజయాలను సాధిస్తే; ప్రజలనుంచి సిసలైన సహకారాన్ని పొందితే — అట్టి సభ్యుణ్ని, లేదా యూనిట్‌ని పైస్థానానికి ప్రమోట్ చేయవచ్చు.

<u>నిబంధన 64 :</u> పై కమిటీయొక్క నిర్ణయాన్నిగాని, కేంద్రకమిటీ నిర్ణయాన్నిగాని అమలు జరపకపోతే, లేదా పార్టీ కార్యక్రమాన్నిగాని, పార్టీశిక్షణనుగాని ఉల్లంఘిస్తే, వివిధ స్థాయిల పార్టీయూనిట్లు క్రిందివిధమైన శిక్షణచర్యలు తీసుకోవచ్చు :

(అ) పార్టీయూనిట్‌కంతకూ వర్తించే శిక్షణచర్యలు : మందలించడం, లేదా నాయకత్వకమిటీని పాక్షికంగా పునర్నిర్మించడం, లేదా దాన్ని బర్తరఫుచేసి తాత్కాలిక నాయకత్వ కమిటీని నియమించడం, లేదా మొత్తం పార్టీ యూనిట్‌నే రద్దుచేసి తిరిగి కొత్తసభ్యుల్ని రిజిష్టరుచేయడం.

(ఆ) పార్టీసభ్యునికి వర్తించే శిక్షణచర్యలు : వ్యక్తిగతంగా హెచ్చరించడం, లేదా మందలించడం; బహిరంగంగా హెచ్చరించడం, లేదా మందలించడం; ఇచ్చిన పనినుంచి తొలగించడం; లేదా తాత్కాలిక సభ్యుల జాబితాలో చేర్చడం, లేదా పార్టీనుంచి తొలగించడం.

<u>నిబంధన 65 :</u> కేంద్రకమిటీలో పూర్తి సభ్యత్వంగల వ్యక్తిగాని, ప్రత్యామ్నాయ సభ్యుడుగాని పార్టీశిక్షణను

ప్రమాదకరంగా ఉల్లంఘిస్తే, అతన్ని ఆ స్థానంనుంచి తొలగించడానికి కేంద్రకమిటీకి అధికారం ఉంటుంది; పార్టీనుంచి వెళ్ళగొట్టే అధికారంకూడా దానికుంది. అయితే, మొత్తం కేంద్రకమిటీ సభ్యులలో మూడింట రెండువంతుల ఆమోదం లభిస్తేనే, అట్టి చర్య అమల్లోకి వస్తుంది.

నిబంధన 66: ఏ పార్టీ యూనిట్ మీద లేదా ఏ పార్టీ సభ్యునిమీద శిక్షణచర్య తీసుకోబడుతుందో, ఆ పార్టీ యూనిట్ కి లేదా పార్టీసభ్యునికి కారణం తెలియజేయాలి. ఆ చర్య అక్రమమని ఆ సభ్యుడు లేదా యూనిట్ భావిస్తే, ఆక్షేపించవచ్చు; పై నిర్ణయాన్ని పునరాలోచించమని కోరవచ్చు; లేదా పై కమిటీకి అప్పీలు చేసుకోవచ్చు. అట్టి అప్పీళ్ళను ఆయాస్థాయిల పార్టీకమిటీలు ఎట్టి ఆలస్యం చేయకుండా పైకి పంపాలి. ఆలస్యం చేయడంగాని, అప్పీళ్ళను అణచియుంచడంగాని నిషిద్ధం.

నిబంధన 67: పార్టీ తీసుకొనే శిక్షణచర్యలన్నిటిలోను కఠినమైనది పార్టీనుంచి తొలగించడం. అట్టి నిర్ణయం తీసుకొనేటప్పుడు, లేదా ఆ నిర్ణయాన్ని ఆమోదించేటప్పుడు పార్టీ యూనిట్లన్నీ అతిజాగ్రత్తగా ఉండాలి. ఆ పార్టీసభ్యుని అప్పీలును శ్రద్ధతో వినాలి; ఏ పరిస్థితుల్లో అతడు తప్పుచేశాడో ఆ పరిస్థితులను పరిశీలించాలి.

నిబంధన 68: ఒక పార్టీసభ్యుని ప్రమోట్ చేయడంలోగాని, అతనిపై శిక్షణచర్య తీసుకోడంలోగాని ఉద్దేశం, పార్టీ సభ్యుల్నీ, ప్రజల్నీ, ఆ పార్టీసభ్యునీ ఎడ్యుకేట్ చేయడంగా

ఉండాలి; అంతేగాని వ్యక్తుల అహంభావాన్ని ప్రోత్సహించడం లేదా శిక్షలు విధించడం కాదు. ఆదర్శవంతంగా పనిచేసే పార్టీ సభ్యుల్ని ప్రమోట్ చేయడంలో ఉద్దేశం, పార్టీలో ఆదర్శవంత మైన కార్యశైలిని ప్రవేశపెట్టడం, పార్టీసభ్యుల యెదుట ఆదర్శవంతమైన ఉత్తమ సాంప్రదాయాలను నెలకొల్పడం. తప్పులుచేసిన పార్టీసభ్యుల్ని విమర్శించడంలోగాని, శిక్షణచర్య తీసుకోవడంలోగాని ఉద్దేశం, వారు తమ తప్పుల్ని దిద్దుకొనే టట్లు చేయడం, వారిని రక్షించడం, యితరులకు హెచ్చరికగా ఉపయోగపడేటట్లు చూడ్డం.

## పదకొండవ అధ్యాయం

## పార్టీ నిధులు

నిబంధన 69 : పార్టీకి నిధులు పార్టీసభ్యులిచ్చే చందాల వల్ల, పార్టీ నిర్వహించే ఉత్పత్తి సంస్థలు మొదలైన ఆర్థిక సంస్థల ఆదాయంవల్ల, పార్టీసభ్యులు కానివారి విరాళాలవల్ల లభించాలి.

నిబంధన 70 : పార్టీ సభ్యులు, తాత్కాలిక సభ్యులు చెల్లించవలసిన చందా స్కేళ్లు ఒక్కొక్క రాష్ట్రకమిటీచే, లేదా సంబంధిత ప్రాంతకమిటీచే, లేదా వాటితో సమాన హోదాగల కమిటీచే నిర్ణయింపబడతాయి; ఆ చందాలను వసూలుచేయవలసిందికూడా ఆ కమిటీలే.





**On the Party** **Rs. 1/8**

# లీ షాప్ - చీ పుస్తకాలు

## పార్టీ అంతరంగిక పోరాటం

| పేజీలు | వెల |
|---|---|
| 74 | 0-10 0 |

## జాతీయత - అంతర్జాతీయత

| పేజీలు | వెల |
|---|---|
| 74 | 0-10-0 |

## మంచి కమ్యూనిస్టు ఎలా వుండాలి?

| పేజీలు | వెల |
|---|---|
| 156 | 1- 2-0 |



ప్రతులకు

**విశాలాంధ్ర ప్రచురణాలయం,**

**విజయవాడ-2.**

స్వతంత్ర ఆర్ట్ ప్రింటర్సు, విజయవాడ-2.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B156 |
| పుస్తకం పేరు | పార్టీ నిర్మాణం |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | YES |
| వెనుక అట్ట | YES |
| మొత్తం పేజీలు | 231 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI D, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good. |